

మీ అభిమాన తార

**జయప్రద**

ఇల్లు ఇదే ▶



పటిష్ఠమయిన
అందమయిన
కట్టడాలకు వాడేది

**ప్రియా సిమెంట్**

RA MA




సిమెంట్
రంగంలో
రారాజు



**ప్రియా సిమెంట్**



**Priyadarshini Cement Ltd.**

Rajbhavan Road, HYDERABAD-500 482



MAADS/89/TEL

# మనలో మాట

అందడానికేం– 80 నవలికలు అందాయి హాస్య నవలికల పోటీకి – కాని నవ్వించే ప్రయత్నం యిందులో కొన్ని నవలికలు మాత్రం చేయగలిగాయి. ఇతివృత్తంలో ఉదాత్తత, సన్నివేశ కల్పనలో సంయమనం హాస్య రచనలలో కూడా అవసరమేనన్న అంశాన్ని చాలామంది రచయితలు పట్టించుకోలేదు– చాలా నిరాశ కలిగించాయి పోటీకి అందిన నవలికలు! –మాకు అందిన నవలికలలో ప్రకటించిన మూడు బహుమతులకు– మూడు నవలికల ఎంపిక చేయగలిగినందుకు సంతోషిస్తూ– బహుమతి విజేతలను– పోటీలలో పాల్గొన్న రచయితలను– అభినందిస్తున్నాము–

మొదటి బహుమతి రు. 1500లు "సాహిత్యా హంతకోపాఖ్యానం" నవలికకి లభించింది.

రెండవ బహుమతి రు.1000లు. "భలే పెళ్లి" నవలిక అందుకున్నది. మూడవ బహుమతి రు. 700 లు "దొంగల రాజ్యంలో..." అన్న రచనకు లభించింది!– ఈ మూడు రచనలు పంపిన వారి పేర్లు అదే వరసలో యీ క్రింద యిస్తున్నాము : (1) బిట్రగుంట సాయిబాబా (2) జి. పద్మినీ ప్రసాద్ (3) అవధానుల విజయలక్ష్మి.– వీరి పరిచయాలు ఫొటోలు అందగానే సచిత్ర వారపత్రికలో వేస్తాము. ఇవిగాక సాధారణ ప్రచురణకు తీసుకున్న "రచనల" గురించి ఆయా రచయితలకు తెలియ జేస్తాము.– బహుమతి పొందిన నవలికల ప్రచురణ ఎప్పుడు ప్రారంభించేది పై సంచికలో తెలియజేస్తాము.

★ ★ ★ ★

మారుతున్న పాఠకుల అభిరుచి– తెలుసుకొని సీరియల్ నవలల ఎంపిక చేయడం ప్రారంభించిన సంగతి మీకూ తెలుసును పాఠకుల విశేష మన్ననలను చూరగొని– అమితలాఘవం – శరవేగం ప్రదర్శిస్తున్న అధునాతన రచయితల "సీరియల్స్" సిద్ధంగా వున్నాయి యిప్పుడున్న "సీరియల్స్" చేసే "చోటు" కోసం ఎదురు చూస్తున్నాయి! శరవేగం అంటారో రాకెట్ వేగమంటారో లేక సూపర్ సానిక్ జెట్ స్పీడు అంటారో– మీరేమి అన్నా– యీ సీరియల్స్ రాస్తున్న రచయితల "శైలి" యిటువంటి అనేక విశేషణాలకి తగినదేనని– అతిత్వరలో నే పాఠకులు అంగీకరిస్తారు– ఈ రచయితల పేర్లు వారి సీరియల్ నవలల శీర్షికలు కూడా ఈ సంచిక నుంచీ జాగ్రత్తగా చూస్తే మీకు కనపడతాయి!

★ ★ ★ ★

అన్నట్లు "ద్రౌపది" సీరియల్ మే నెల నుంచే మీకు అందించగలుగుతున్నందుకు సంతోషంగా వున్నది! ఇతిహాసంలో మహాపతివ్రతగా వాసికెక్కిన పంచ భర్తృక– పాంచాలి పూర్వజన్మ వృత్తాంతం తేటతెనుగులో ప్రారంభిస్తున్నాము కనుక యిది– ఈ ఎండాకాలం శలవులలో అదనపు సత్కాలక్షేపం కాగలదని మా ఆశ

త్వరలో నే మరొక 'పోటీ' కొత్త తరహా నవలకై పిలుపును ప్రకటిస్తాము రచయితలు అంతా ఎదురు చూడాలని మా ఆకాంక్ష!

## పఠించండి తో పత్రిక!

విడి ప్రతి వెల రు. 3.50



ముఖచిత్రం

"ఇలా వుంటుందండీ వసంత కాలం చూపు" – తార విజయశాంతి

పై సంచికలో : మన్నెం శారద కథ 'నీరు పల్లం మెరుగు'

### ఈ వారం ప్రత్యేకం :–


వాక్ స్వతంత్రం– వాక్స్వాతంత్ర్యం (సంపాదకీయం)-5, ఎన్. టి. ఆర్. నిర్ణయం (తాజాకాలమ్) -6, చర్మవ్యాధులపై డాక్టర్ సమాధానాలు-16, 'రెయిన్ మాన్' ఉత్తమ చిత్రం!-31, భగవాన్ శ్రీ రమణ మహర్షి-33, సెక్స్‌ప్పీల్ :మనసు-38, జయలలిత పాలిట ధావన్-45, కీలర్ శృంగారలీలలు-49, శుక్ల నామ సంవత్సర రాశిఫలాలు-66.


### కథలు :–


ఇది కథ కాదు-20, సంయుక్త సమస్య-34, ఐయామ్ సారీ-46, వికృతి-50.


### సీరియల్ నవలలు :–


పంచశూలమ్-8, మైథిలి-26, ఈ అబ్బాయికి పెళ్ళవుతుందా?-40, సూపర్‌గర్ల్-60, అన్వేషి-68.


### వ్యాసాలు, శీర్షికలు :–


మనలో మాట-4, ఇ'వేమన' పద్యాలు-12, న్యాయపీఠం-14, ప్రశ్నావళి-18, టిట్ ఫర్ టాట్-23, విద్యార్థులలో అశాంతి ఎందుకు?-25, ధర్మపథం-37, మనశ్శాస్త్రవేత్తలు-43, నలభీమపాకం-48, సినిమా సినిమా-55, హిందీలో నుంచి తెలుగులోకి-59, వారఫలం-65, భళారే చిత్రం-70, పుస్తకాల పేజీ-72, సాహితీ పజిల్-73.

ఆంధ్రసచిత్రవారపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

సంపుటము 81 | స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు | సంచిక 34

14-4-1989 విజయవాడ

వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు

సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్ (1938-1972)

శ్రీశుక్లనామ సం. చైత్ర శు నవమి

# "వాక్" స్వతంత్రం- వాక్స్వాతంత్ర్యం!

అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలలో రోడ్ల మీద వాహనాలు- రైలుబండ్లు పట్టాల మీద నడుస్తున్నట్లు- ఒక క్రమపద్ధతిలో బర్‌బర్రున పోతూ వుంటాయే తప్ప- 'బాం బాం'మని 'హారన్'లు కొట్టుకుంటూ- మెళికలు తిరుగుతూ, కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్ అన్నట్లుగా- యిష్టమొచ్చిన రీతి పరుగెడుతూ వుండవ్!- అక్కడ పాదచారులు- దారంట వారంట నడవడం, రోడ్ల మీద యిట్నుంచి అటు- అట్నుంచి ఇటూ దాటుతున్నప్పుడు- అటు ఇటూ చూసుకుంటూ పరిగెత్తి అవతలి వేపుకి చేరుకోడం చేస్తూ- వాహనాల రాకపోకలకి ఎంతో భద్రత కల్పించడానికి అలవాటు పడివుంటారు! అంతేకాని రోడ్డు మధ్య అడ్డదిడ్డంగా నడుస్తూ "వాక్" (నడక) స్వతంత్రాన్ని- అనుక్షణం ప్రకటించుతూ ఉండరు! అసలా దేశాలలో "హార్న్"లు కొట్టడం నిషేధం- 'హార్న్' వినపడ్డదీ అంటే ఎక్కడో ఎవరికో ప్రాణం మిదికొచ్చినంత ప్రమాదాన్ని నివారించడానికేనన్న మాట! కాని మనదేశం- మన రాష్ట్రం- మన వూరు తీసుకొని చూస్తే యిక్కడి రోడ్ల తీరుతెన్నులే వేరు- ఏ రోడ్డు గడచి చూసినా, నడిచి చూసినా అంతటా అది అతుకుల గతుకుల అడ్డంకుల "గండ్ల"కడగండ్లమయంగా వుంటుంది! దేశం మొత్తం మీద కచ్చా పక్కా రోడ్లన్నింటినీ కలుపుకుంటే పదిహేడున్నర లక్షల కిలో మీటర్ల నిడివికి మించి వున్నాయి! ఆ లెక్కన ప్రపంచంలోనే- "సుదీర్ఘ" రాదారి సౌకర్యాలున్న- అతి పెద్ద దేశాలలో మన దేశం పేరు కూడా వుంటుంది- కాని వాహనాల సంఖ్య చూస్తే మనం- అమ్మో అమ్మో అని ఉక్కిరి బిక్కిరి అయిపోతాం గాని ప్రపంచం మొత్తం మీద వున్న శకటాల సంఖ్యలో మన వాహనాల సంఖ్య- నూరో వంతు మాత్రమే! ఇవి చేసే రోద మాత్రం చాలా ఎక్కువ ప్రమాదాల సంఖ్య అంతకన్నా మిక్కిలి ఎక్కువ ప్రపంచంలో జరిగే రోడ్డు ప్రమాదాల సంఖ్యలో మనదేశంలో జరిగే రోడ్డు ప్రమాదాల సంఖ్య ఆరు శాతం కన్నా ఎక్కువ- అదీ ఏమిటీ!? యివాళ దేశంలో కచ్చా రోడ్డో పక్కా రోడ్డో- ఏదో వొకటి- అసలు 'రోడ్డు' అనిపించే పదార్థం- కేవలం 64 శాతం వరకూ మాత్రమే వున్నప్పుడు నెలకొని వున్న స్థితి ఇంకా 36 శాతం గ్రామకు గ్రామ ప్రాంతాలకు కాలిబాటలే గాని "రోడ్డు"లాంటి గట్టి పదార్థం మనకి లేదు అది వుంటే ప్రమాదాలు కూడా అలాగే పెరుగుతాయన్న మాట!

ఒక 'సర్వే'లో మనదేశంలో నాలుగు నిమిషాలకో 'ఏక్సిడెంట్' అవుతున్నట్లు వెల్లడైంది ఈ శతాబ్దాంతానికి- యీ లెక్క నిమిషానికో ప్రమాదంగా ప్రగతి సాధించగలదని కూడా అంటున్నారు 1976 నుంచి 1986కి- అంటే వో దశాబ్దం గడిచాక లెక్కలు తీసి చూస్తే- మన "రోడ్డు సెన్సు" 'రాదారి బుద్ధి' గొప్పగా బయటపడుతున్నాయి 1976 లెక్కల్లో లక్షా యిరవై వేల రోడ్డు ప్రమాదాలు జరిగాయి 58 వేల మంది మాత్రమే 'క్షతగాత్రులైనారు (ఎంతమంది వీర మరణం పొందారో)- 1986 లో యిదే మాదిరి లెక్కలు తీస్తే యించుమించు రెట్టింపు- రెండు లక్షల పదివేల ప్రమాదాలు జరిగాయి! లక్షా డెభ్భై అయిదువేల మంది గాయపడ్డారు! వీటిలో కనీసం మూడో వంతు ప్రమాదాలు 'వాహన చోదకులు' అప్రమత్తంగా వుంటే తప్పిపోయి వుండేవి- పదిహేను శాతం ప్రమాదాలు కేవలం 'పాదచారుల" అశ్రద్ధ, అలక్ష్యం వల్ల జరిగినవే- సైక్లిస్ట్‌లు, సైకిల్ రిక్షాయిస్టులు వీళ్ళకి రోడ్డు మీద "వీర మరణం" అంటే గొప్ప యిష్టం అధికాంశం "చోదకుల"- పాదచారుల వల్లనే ప్రమాదాలు జరుగుతున్నాయి అంటే- అది తప్పు వీటికి కారణం కొంతవరకు రోడ్ల దుర్భర దుస్సహ దుస్థితి కూడా మన పట్టణ ప్రాంతాలలో 'రోడ్లు" అనబడే విచిత్ర వింత "కీకారణ్యాలు" మనుష్యుల బుద్ధిని మందగింపజేస్తాయి వాహనాల దృష్టిని వక్రీభవింపజేస్తాయి! అక్షర సంపన్నులు, నిరక్షర కుక్షులు- సంపన్నులు కడు పేదలు అన్న వ్యత్యాసం లేకుండా అన్ని రకాల వాళ్లు తమ యిచ్ఛ వచ్చిన రీతి పచ్చి పచ్చిగా- తిరుగాడు "స్వతంత్ర భారత్" మన రోడ్ల మీదే మనం చూడగలం! ఆడుకోడానికి, మాట్లాడుకోడానికి, తిరుగాడడానికి- యిండ్లలోను, మనస్సులలోను పేరుకు పోయిన చెత్తాచెదారాలను చిందరవందరగా విసిరి- యీ రాదారులనే మన స్వతంత్ర పౌరులు స్వేచ్ఛగా వాడుకుంటారు- శతవార్షికోత్సవాలు జరుపుకొనే మ్యునిసిపాలిటీలు ఈ కారణంగానే- ఉత్సవాలను యీ రోడ్ల మీద గాక ' ఎయిర్‌కూల్‌డ్" మందిరాల్లో గానాబజానాలతో జరుపుకుంటూ వుంటాయి ఇటువంటి ఘోర దుస్థితిలో ఏడాదికోసారి "ట్రాఫిక్ భద్రతా వారోత్సవాల"ంటూ రోడ్ల కడ్డంగా వాహనాల శీర్షాలకి తగులుతూ "గుడ్డల తోరణాలు" వ్రేలాడదీసి- పోలీసులు హడావుడి చేస్తుంటారు- పాదచారులకి వాహన చోదకులకి నరక సదృశంగా వున్న రోడ్ల గురించి మాత్రం కనీసం ఈ వారం రోజులైనా మెడ మీద తలకాయ- దానిమీద అదికారం" వున్నవాడెవడూ ఆలోచించడు భద్రతా వారోత్సవాల్లో మామూలుగా- ఏదో మాదిరిగా తన గమ్యానికి 'పరిగెత్తే' వారికి- మరిన్ని ఆటంకాలు యిబ్బందులూ తప్ప ప్రయోజనం హుళక్కి పైగా అందరూ వేసే జోక్ ఒకటి వున్నది- "భద్రతా వారోత్సవాల సమయంలో తప్ప- మిగతా ఏడాది కాలం ఏ పద్ధతి భద్రతా లేకుండానే పోలీసులు పౌరులు- రోడ్డు ప్రయాణాలు చేస్తూ వుంటారనేగా!"- దేశంలో "వాక్" అంటే "వాక్కు"కి స్వతంత్రం పెంచండి కాని "వాక్" (అంటే నడక) స్వాతంత్ర్యాన్ని రోడ్ల మరమ్మత్తు చేసి తగ్గించండి అని ఎవరికి చెప్పాలి?

ముఖ్య సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ

అడ్వయిజరీ సంపాదకుడు : వీరాజీ

ముద్రాపకుడు, ప్రచురణకర్త : శివలెంక నాగేశ్వరరావు

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్‌లు: 75667, 61247, 61248, 75569

# "నమీబియా"లో "పోరు"




నైరుతి ఆఫ్రికాలో స్వతంత్రం కోసం కలలుగంటూ దారి పొడుగునా రక్తతర్పణ చేస్తూ అక్కడ పన్నెండు లక్షల మంది సాగిస్తున్న పోరాటం అంతమై యీ ఏప్రియల్ ఒకటో తారీఖు నుంచి ఆ రాజ్యానికి స్వయం ప్రతిపత్తి పాలన అందించే ఏర్పాట్లు ప్రారంభం అవుతాయనుకుంటే– అందుకు భిన్నంగా జరిగింది దక్షిణాఫ్రికా నమీబియా ప్రజలని ఏప్రిల్ ఫస్టునాడు "ఫూల్స్"ని చేసింది– అంగోలా సరిహద్దులలో "సౌతాఫ్రికా" దళాలు "స్వాపో" (నైరుతీ ఆఫ్రికా విమోచన గెరిల్లా దళాలు) దళాలకి మధ్య తీవ్రమైన పోరాటం మొదలైంది అక్కడ యిటువంటి దుర్ఘటనలు జరుగకుండా– నివారించడానికి దిగిన ఐక్యరాజ్యసమితి శాంతిదళాలు ముక్కున వ్రేలేసుకున్నాయో లేదో తెలీదు కాని నిస్సహాయంగా వుండిపోయాయి ఈ ఏప్రిల్ ఒకటి నుంచి 1990 ఏప్రిల్ ఒకటో తారీఖు నాటికి అన్ని అధికారాలు స్థానికులకి అప్పగించి వెళ్ళిపోయే ఏర్పాట్లు చేస్తానన్న హామీని దక్షిణాఫ్రికా జాత్యహంకార ప్రభుత్వం మాటతప్పింది అయితే నూటకి ఆ ప్రభుత్వం కట్టుబడి వుంటుంది అని చాలామంది నమ్మినప్పుడుకదా? ఛెంగ–

"నమీబియా" చిన్న అట్లాంటిక్ సముద్రతీర "నల్ల" రాజ్యం మన కృష్ణా జిల్లాలో సగం జనాభా కూడా వుండదు కాని ఈ నల్లజాతి ప్రజలంతా కష్టజీవులు' వారి కష్టానికి ఫలంగా ఆ నేల యిచ్చేది బంగారు పంట కూడాకాదు. "యురేనియం" పంట– వాళ్ళు వెతికితే దొరికేవి వజ్రాలు– జెర్మానియం, జింకు సమృద్ధిగా దొరుకుతాయి అక్కడ దక్షిణాఫ్రికా తెల్లవాడి "ఆశ" అంతా యీ పంటల మిదే - వీటిని వొదులుకోలేకనే ఐక్యరాజ్యసమితి, భద్రతామండలి కూడా ఎంత మెత్తుకున్నా కూడా దక్షిణాఫ్రికా యీ "భూమి"ని వదలనంటున్నది అమెరికా పూనుకొన్న కారణంగా నమీబియాకి స్వతంత్రం యిచ్చేస్తానన్న దక్షిణాఫ్రికాలో యీ ప్రయత్నాలు మొదలయ్యే శుభ ముహూర్తానికి బ్రిటిష్ ప్రధాన మంత్రి శ్రీమతి మార్గరెట్ థాచర్ అక్కడికి వెళ్ళకుండా వుంటే బాగుండేది అనే వాళ్ళు కూడా వున్నారు కాని ఆమె అక్కడకి వెళ్ళనే వెళ్ళారు జనవాసాల మీద కూడా బాంబుల వర్షం పడుతూ వుండటంతో కొంత ఆందోళన చెంది వెంటనే భద్రతామండలి సమావేశం కూడా ఏర్పాటు చేయాలని మార్గరెట్‌థాచర్ ప్రకటించారు. అఫ్‌కోర్స్– మండలి సమావేశమైంది ఆ తీర్మానాన్ని వాళ్ళు అమలు చేయాలీ అంటే అమెరికా బ్రిటన్‌లు గట్టిగా మరోసారి చెప్పాలి. లేకపోతే అక్కడ నవంబర్‌లో జరిగే స్వతంత్ర రాజ్యాంగ సభకి ఎన్నికలు కూడా సాధ్యంకావు'

ఏది ఏమైనా 20 సంవత్సరాలుగా వలసవాద వ్యతిరేక ఉద్యమాన్ని సాగిస్తున్న నమీబియా ప్రజలు దాన్ని సాధించకుండా మాత్రం నిద్రపోరు.

★ ★ ★

"పంచ పాండవులు పార్టీ వొదిలిపెట్టి వెళ్ళిపోయి– తాము పబ్లిక్‌గా చెప్పవలసిందంతా చెప్పేసిన తరువాత వాళ్ళడిగిన లెజిస్లేచర్ పార్టీ సమావేశాన్ని "ఆల్ ఫూల్స్‌డే" నాడు 'దేశం' అధ్యక్షుడు ఎన్. టి. రామారావుగారు ఏర్పాటు చేశాడు' 176 మంది ఎం ఎల్ ఏలు హాజరైనారు. అందులో సగం మందికన్నా ఎక్కువమంది ఎందుకైనా మంచిది అని పసుపు పచ్చచొక్కాలు ధరించి వచ్చారు అంటే మిగతా సగం మంది ధరించలేదనేగా అర్థం. అయినా వారి నాయకుడు యీ "వూసెత్త"లేదు ఏమిటి దీని అర్థం??– ఆ సభ్యులకు వారి యిష్టానుసారం దుస్తులు ధరించే హక్కు యిచ్చినట్లేగా .. యిలాంటిదాన్నే అంతర్గత ప్రజాస్వామ్యం అనుకోవాలి అంతేకాదు అసలు పార్టీలో ఈ నాకాల్స్ అంతర్గత ప్రజాస్వామ్యం ఎప్పుడు లేదని ఆయన గద్దించి అడిగితే సమాధానం చెప్పగల "అయిదుగురు"– అక్కడలేరు అసలు



# అసెంబ్లీని రద్దు చేయనన్న ఎన్. టి. ఆర్.



పార్టీలో కూడా లేరు వాళ్ళు – మిగతావాళ్ళు "కిమ్మ"నలేదు శాసన సభ్యులకు యూసఫ్‌గూడాలో స్వంత యిండ్లు నిర్మించుకోడానికి కూడా ముఖ్యమంత్రి దయతో అంగీకరించారు –

ఈ నెల 10 నుంచి మే నెల 10 దాకా జనచైతన్య యాత్రలు మొదలుపెట్టమని ఎన్ టి ఆర్ – ఆజ్ఞాపించారు– యివీ ఆ సమావేశ విశేషాలు

పవర్‌కట్, "డ్రింకింగ్ వాటర్" కట్‌కట్‌ల మధ్య యీ జనచైతన్య యాత్రలు సాగించగల ధైర్యం మన విశ్వామిత్రునికి గాక యింకెవరికుంటుంది?

ఇది ఇలా వుండగా ఎన్ టి ఆర్ మవునముద్ర వదిలి– అసలు తిరగబడ్డ ఆయిదుగురు వెళ్ళిపోయాక– సమావేశం ఏర్పాటు చేసి– "నథింగ్ హాపెన్డ్" అన్నట్టుగా వుంటే– అసమ్మతివాదులు యిప్పుడు మౌనముద్ర సడలించారు 'మే'నెలలో వీరు కొత్తపార్టీ పెడదాం అనుకుంటున్నారు – పెద్ద నదిలో నుంచి చీలిపోయిన చిన్నపాయలు– యింకా ఏమైనా వుంటే కలుపుకుందామని వీరుకూడా సహజంగా ఎదురు చూస్తున్నారు! అందుకు "జనతాదళ్" లోని అసమ్మతీయులు 'సై' అంటారేమోనని వేచి చూస్తున్నారేమో వాళ్ళు - మనం కూడా వేచిచూద్దాం? మొత్తం మీద ఆంధ్రదేశంలో తిరుగుబాటు ప్రకటనల జోరు తగ్గింది ఎన్ టి ఆర్ హాయిగా విశ్వామిత్ర షూటింగ్ షెడ్యూల్స్ చూసుకుంటున్నాడు!

## తమిళనాడు తగాదాలు

అయితే తమిళనాడు తగాదాలు అలాగే వున్నాయి అన్నా డి ఎం కె, డి ఎమ్ కె పార్టీలు అసెంబ్లీలోను వెలుపల కూడా బాగా "తన్నులాడుకుంటున్నాయి"– నిర్ద్వంద్వంగా ఎన్నికల్లో ఒక పార్టీని గెలిపించినా– ప్రజలకి శాంతియుత పరిపాలన అందటం లేదంటే ఆశ్చర్యంగానే వుంటుంది అసెంబ్లీ అంటే గోల గందరగోళం సెస్పెన్షన్‌లు యిదా? అర్థం– మళ్లీ అన్నా డి ఎమ్ కె సభ్యులు సస్పెండైనారు – జయలలితమ్మ తనకు విషమిచ్చి చంపాలనుకుంటున్నారంటుంది– తన అక్రమ అవినీతి కార్యకలాపాలను కప్పిపెట్టి వాటి మీద చర్యలు తీసుకోకుండా గవర్నమెంట్‌ను బెదిరించడానికే అన్నా డి ఎం కె నాయకులు ప్రజలను రెచ్చగొడుతున్నారని కరుణానిధి అనుయాయులంటున్నారు మొత్తం మీద యీ రెండు పార్టీలు ఒకటో రకం "రౌడీ మూకల్లా"గా అయినాయి – ఎక్కడ పడితే అక్కడ కలియబడుతున్నారు! (6-4-1989)

సీరియల్ ప్రారంభం!

# పంచశూలమ్

విశ్వప్రసాద్

(గత సంచిక తరువాయి)

జరిగిన కథ- 1: 25 సంవత్సరాల క్రితం చెయ్యని నేరానికి జైలుపాలై ఒక్క రోజు శిక్ష అనుభవించి జైల్లోంచి పరారీ అయిన జోషి కోసం పోలీసులు ఏడేళ్ళు గాలించి వదిలేసిన కేసును సి. బి. ఐ. డైరెక్టర్ ఆదిత్య చేపట్టాడని, ఆ విషయాలు తెలుసుకొనేందుకు ఢిల్లీ వెళ్ళమని పంచశూలమ్ ఒక యువకుడిని పురమాయిస్తాడు. సి. బి. ఐ. డైరెక్టర్ ఆదిత్య కేసు పూర్వాపరాలను సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్లకు వివరించి ఆలీషాకు కేసు బాధ్యతలప్పగిస్తాడు.

## 4

ఢిల్లీలోని ఫైవ్‌స్టార్ హోటల్ పూనమ్‌లో – 777 వ రూమ్‌లో ఎర్రరంగు ఫైవ్ గుప్పు గుప్పున వెలుగుతోంది కాళ్ళు టీపాయ్ మీద పెట్టి, సోఫాలో కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు పంచశూలమ్

ఇంతలో టెలిఫోన్ మోగింది

రిసీవరు అందుకున్నాడు "హలో! 777 ఈజ్ దిస్ సైడ్" అన్నాడు.

అవతలి నుండి ఎవరో రెండు మాటలు చెప్పారు

"థేంక్యూ" అని. రిసీవరు పెట్టేశాడు పంచశూలమ్

కొన్ని క్షణాల పాటు తిరిగి ఆలోచిస్తూ వూరుకున్నాడు తన ఆలోచనలకు ఓ రూపాన్ని ఏర్పరచుకున్నాడు రిసీవరు అందుకున్నాడు "పుట్‌మి ఇన్ టు హోటల్ సన్‌రైజ్– రూమ్ నెంబర్ 117 " అన్నాడు

కొంత సేపటికి కనెక్షన్ వచ్చింది "హలో, మైబోయ్! ఎలా ఉన్నావ్!?" కుశల ప్రశ్న వేశాడు.

"ఫైన్ మీరు...??" అవతలి నుండి ఓ యువకుని కంఠం వినిపించింది

"నీ శ్రేయోభిలాషిని."

అర్థం చేసుకున్నాడు అవతలి యువకుడు. ఆశ్చర్యపోయాడు "మీరు కూడా ఢిల్లీ వచ్చారా?" అని అడిగాడు.

"ఔను. ఈ రోజే వచ్చాను కాని, నిన్న వచ్చి యింత వరకూ నువ్వు ఏం చేశావ్"

"సి బి. ఐ డైరెక్టర్ ఆదిత్య– ఆలీషా అనే యిన్‌స్పెక్టర్‌కి ఈ కేసు అప్పగించినట్లు తెలుసుకున్నాను

"గుడ్ షా ఈ రాత్రి హైద్రాబాద్‌కు బయలుదేరుతున్నాడు "

"దేనిలో?– ట్రైన్‌లో నా, ఫ్లైట్‌లో నా"

"ట్రైన్‌లో."

"మీ కెలా తెలుసు?"

"ఇలాంటి విషయాలు తెలుసుకోడానికే వచ్చాను నేను."

"మీరు కూడా అదే ట్రైన్‌లో వెళుతున్నారా?"

"నా విషయం ఎలా వున్నా, నువ్వు బయలుదేరు."

"తర్వాత"

"తర్వాత ఏం చెయ్యాలన్నది నువ్వు ఆలోచించుకోవాలి."

"అల్‌రైట్ సార్! ఈ రాత్రి ట్రైన్‌లో షాతో పాటు బయలుదేరతాను ఆ తర్వాత ఏం చెయ్యాలో నేనే నిశ్చయించుకుంటాను. కాని, ఒక రహస్యం చెబుతారా మీరు?"

"ఏమిటది?"

"మా నాన్నగారు– జోషీ ఎక్కడున్నారు??"

కొన్ని క్షణాలపాటు కళ్ళు మూసుకున్నాడు పంచశూలమ్. అంతలోనే తనను తాను సంబాళించుకున్నాడు. ఓ మారు పైపు పీల్చాడు. మనసును శాంత పరచుకున్నాడు "సారీ మై బోయ్! రహస్యమనేది 'రహస్యం'గానే ఉండాలి" అన్నాడు

"అసలు ఆయన బ్రతికున్నారా"

"అఫ్‌కోర్స్.. కాని, చనిపోయినట్లే..."

"వివరంగా చెప్పండి "

"చెప్పే స్థితిలో లేను "

"ఆల్‌రైట్– నేనే తెలుసుకుంటాను."

"ఆవేశ పడొద్దు "

"లేదుసార్! ఆవేశ పడటంలేదు బాగా ఆలోచించుకునే ఓ నిశ్చయానికి వచ్చాను "

"ఏమిటా నిశ్చయం?"

"నా తండ్రికి ద్రోహం చేసిన వారందర్నీ అంతం చేస్తాను. ఆయన జీవితం అన్యాయంగా అపనిందల పాలయి పోయింది. ఆయన భవిష్యత్తు అంధకారమై పోయింది ఆయన ఎక్కడున్నారో, ఎలా వున్నారో, అసలు బ్రతికున్నారో లేదో కూడా తెలియదు ..

ఆ మహావ్యక్తికి అన్యాయం చేసిన వారిని ప్రాణాలతో వుంచకూడదు ఉండ నివ్వను. మీ సలహా ఏమిటి?"

అవతలి యువకుడు చెబుతున్న మాటలు వింటూ, కొన్ని క్షణాలు కళ్ళు మూసుకున్నాడు పంచశూలమ్ "యస్, మై బోయ్ నీ ఆర్గ్యుమెంట్ అంగీకరిస్తున్నాను నేను" అన్నాడు

"అయితే రేపటి నుండి నా ఉగ్రరూపాన్ని, ప్రశాంత స్వరూపాన్ని, ప్రతీకార జ్వాలల్ని, ప్రసన్నవదనాన్ని– వివిధ రూపాల్లో చూస్తారు మీరు."

"అదే కోరుతున్నాను నేను కాని కార్యసాధనకు క్రోధావేశాలతో కత్తి విసరడమే కాదు– లౌకిక జ్ఞానంతో శాంతాన్ని నటించడం కూడా అవసరం" అంటూ, కుడి చేతిమీది పచ్చబొట్టు వంక చూసుకున్నాడు పంచశూలమ్

"మీరు యిచ్చిన ఈ ఆదేశాన్ని ఆశీర్వాదంగా తీసుకుంటాను నేను ఈ క్షణం నుంచి యివే భావాలను అమలుపరుస్తాను నా తండ్రికి అన్యాయం చేసిన వారిని చీల్చి పారేస్తాను."

తృప్తిగా శ్వాస తీసుకున్నాడు "విష్ యు గుడ్‌లక్ మై బోయ్" అని రిసీవరు ఫోన్ మీద పెట్టేశాడు పంచశూలమ్.

## 5

వివిధ భాషలు మాట్లాడుతూ, రకరకాల– వేషాలు వేసుకున్న వేలాది ప్రయాణీకుల్లతో కలకలలాడుతోంది ఢిల్లీ రైల్వే స్టేషన్.

ఆ జనంలోంచి ఓ యువకుడు ట్రియిన్ దగ్గరకు

వచ్చాడు ఎయిర్ కండిషన్డ్ కోచ్ దగ్గర ఆగాడు

ఐదడుగుల ఎనిమిది అంగుళాల ఎత్తు ఉంటాడు 26–27 సంవత్సరాల వయసుంటుంది ఎర్రటి శరీరం, నిండైన విగ్రహం, అందమైన ముఖం– సూటు, బూటు ధరించి ఆఫీసరులా ఉన్నాడు కాని, అతని ముఖం మీద వున్న గడ్డం, మీసాలు, కళ్ళజోడు అతని రూపాన్ని దాచడానికి ప్రయత్నిస్తున్నాయి

కోచ్ బయట అంటించిన లిస్టు మీదకు దృష్టిని సారించాడు ఆ యువకుడు

బెర్త్ నెంబర్ వన్ ఆలీషా, హైద్రాబాదు– అని ఉంది

మూడో బెర్త్ తన పేరిట రిజర్వ్ చేయబడింది.

మొదటి 'కూ పే'లో యిద్దరి పేర్లే ఉన్నాయి. రెండు, నాలుగు నెంబర్లు గల బెర్త్లు ఖాళీ

సంతోషంతో– బూటుకాలితో ప్లాట్‌ఫామ్ మీద నెమ్మదిగా తన్నాడు "సామాను లోపల పెట్టండి" అన్నాడు పోర్టర్లతో

నెత్తి మీద పెట్టుకున్న– శవపేటికలాంటి పెద్ద కర్రపెట్టెను కంపార్టుమెంటులో కి తీసుకెళ్ళాడు ఓ కూలీ బ్రీఫ్‌కేసు, ఎయిర్ బ్యాగ్, పళ్ళబుట్ట పట్టుకుని లోపల కెక్కాడు మరో కూలీ బెర్త్ నెంబర్ త్రీ క్రింద సామాను పెట్టి యిద్దరూ బైటకు వచ్చారు

ఇరవై రూపాయలిచ్చి, వాళ్ళను పంపించేశాడు ఆ యువకుడు కళ్ళజోడు తీసి, జేబులో పెట్టుకున్నాడు ఎవరి కోసమో ఎదురు చూస్తూ, ప్లాట్ ఫామ్ మీదనే నిలుచున్నాడు

ఇంతలో, యింజన్ ఎదుట వున్న రెడ్‌లైట్ ఆరిపోయింది పసుపురంగు లైటు వెలిగింది. ట్రెయిన్ హారన్ మోగింది మరికొన్ని క్షణాలకు పచ్చలైటు వెలిగింది విజిల్‌వేస్తూ, పచ్చదీపం చూపించాడు గార్డ్

బయలుదేరడానికి సిద్ధంగా ఉంది ట్రెయిన్

అదే సమయంలో పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ వచ్చాడు ఆలీషా కంపార్టుమెంటు



బైట లిస్టులో, తన పేరు చూసుకున్నాడు. "బెర్త్ నెంబర్ వన్" అన్నాడు- తనతో వచ్చిన కానిస్టేబుల్స్‌తో.

సూట్‌కేసు, హోల్‌డాల్ లోపల పెట్టారు యిద్దరు కానిస్టేబుల్సు గబగబా బైటకు వచ్చారు

ఫైనల్ విజిల్ వేశాడు గార్డ్.

బిగ్గరగా హారన్ వాయించి, నెమ్మదిగా కదల సాగింది ట్రెయిన్.

కానిస్టేబుల్స్ చేసిన సెల్యూట్ అందుకుని, ట్రెయిన్ ఎక్కాడు షా.

అతని వెనకనే కంపార్ట్‌మెంట్‌లోకి వచ్చి, తలుపుమూశాడు ఆ యువకుడు

ఇద్దరూ కూపేలోకి వచ్చారు

"నా పేరు.." తనను తాను పరిచయం చేసుకోబోయాడు ఆ యువకుడు

"తెలుసు బైట లిస్టులో చూశాను" చిరునవ్వు నవ్వుతూ కరస్పర్శ చేశాడు షా "నేను సి ఐ డి యిన్స్‌పెక్టర్ని కాకినాడ నుండి హైద్రాబాద్ ట్రాన్స్‌ఫర్ చేశారు. చిన్న పనిమీద ఢిల్లీ వచ్చాను డ్యూటీలో చేరడానికి హైద్రాబాద్ వెళుతున్నాను" అన్నాడు

"వెరీ గ్లాడ్ టు మీట్ యు హైద్రాబాద్‌లో నాకు స్కూటర్స్ ఫ్యాక్టరీ ఉంది కొన్ని పార్టులు జపాన్ నుండి దిగుమతి చేసుకోవాలి అదే పనిమీద ఢిల్లీ వచ్చాను పని పూర్తయిపోయింది తిరిగి వెళుతున్నాను "

"గుడ్. హైద్రాబాద్‌లో మనం తరచుగా కలుసుకోవచ్చు "

"ష్యూర్ ష్యూర్" అన్నాడా యువకుడు

చీకటిని చీల్చుకుంటూ వేగంగా పరుగెత్తుతోంది ట్రెయిన్.

ఇద్దరూ తమ సామాన్లు సర్దుకుంటున్నారు అదే సమయంలో షా వంక పరీక్షగా చూశాడు ఆ యువకుడు

తనంత ఎత్తే ఉన్నాడు షా. శరీరం కూడా తనలాగే ఉంది. వెనక నుండి చూస్తే యిద్దరూ ఒకేలా ఉంటారు. అయితే షా కుడిబుగ్గ మీద పులిపిరికాయ ఉంది, మనిషి చామనఛాయ అవి తప్పితే, యిద్దరికీ దగ్గరి పోలికలున్నాయి.

హుషారుగా బూటుకాలితో క్రింద తన్నాడు యువకుడు.

ఇంతలో టి సి. వచ్చాడు. ఇద్దరి టిక్కెట్లు పరీక్ష చేశాడు. తిరిగి యిచ్చేస్తూ "ఈ కూపేలోకి మరెవరూ రారు తలుపు వేసుకోండి." అని చెప్పి వెళ్ళిపోయాడు.

తలుపు మూశాడు షా.

స్థిమితంగా బెర్త్ మీద కూర్చున్నాడు ఆ యువకుడు.

"మీరు ఇంజనీ రనుకుంటాను." అన్నాడు షా.

"ఎలా వూహించారు?" ఆశ్చర్యపోతూ ప్రశ్నించాడు ఆ యువకుడు.

"ఇంత చిన్న వయసులో స్కూటర్స్ ఫ్యాక్టరీ పెట్టారంటే యింజనీరే అయ్యుండాలి. అంతే కాదు, మీరు విదేశాలు కూడా తిరిగి వచ్చారు."

"మైగాడ్!! మీకు జ్యోతిషం వచ్చునా?"

"సి ఐ డి యిన్స్‌పెక్టర్ని నేను. 'మాకు జ్యోతిషం రాకపోయినా, వూహాశక్తి వుంటుంది మీ గడ్డం మీసాలు చూస్తే, మీరు విదేశాలు తిరిగి వచ్చారనిపిస్తోంది

"అఫ్‌కోర్స్ జపాన్‌లో ఓ ప్రొఫెసర్ని చూశాను గెడ్డం, మీసాల్లో ఆయన ఎంతో నిండుగా కనిపించారు నాకు అప్పటి నుంచీ నేను కూడా ఆయన స్టైల్ అనుకరించాను బైది బై.. మీరు డ్రింక్ తీసుకుంటారా ??"

"అలవాటు లేదు. మీరు తీసుకుంటే అభ్యంతరం లేదు "

"నాకూ అలవాటు లేదు. అప్పుడప్పుడూ బీర్ తీసుకుంటాను." అని, ఎయిర్‌బ్యాగ్‌లోంచి రెండు బీర్ బాటిల్స్ తీశాడు. ఒకటి ఓపెన్ చేసి షా కిచ్చాడు. రెండోది తను పట్టుకున్నాడు.

నిరాకరించలేక పోయాడు షా "ఛియర్స్" అన్నాడు.

"ఛియర్స్... ఫర్ ది హెల్త్ ఆఫ్ గాడ్."

ఆశ్చర్యంగా అతని వంక చూశాడు షా "భగవంతుని ఆరోగ్యం కోసమా??" రెట్టించాడు.

"యస్. దేవుడు కులాసాగా వుంటేనే, మన ఆరోగ్యం కాపాడ గలడు."

"బలే జోక్ వేశారు "

"జోక్ కాదు- నిజం" అన్నాడు యువకుడు

తర్వాత, బీర్ తాగుతూ యిద్దరూ రక రకాల విషయాలు మాట్లాడుకున్నారు వారి సంభాషణలో – అమెరికా ప్రెసిడెంటు రీగన్ నుండి పాకిస్తాన్ ప్రెసిడెంట్ జియావరకు, రాజీవ్‌గాంధీ నుంచి ఎన్. టి. ఆర్. వరకు, ఎలిజిబెత్ టేలర్ మొదలుకొని ఎక్స్‌ట్రా నటి వరకు; అమితాబ్, అక్కినేని నాగేశ్వరరావుతో పాటు చిన్న చిన్న హీరోలు- అంతా దొర్లిపోయారు

ఒక్క బీర్‌బాటిల్‌కే షాకి బాగా నిషా ఎక్కిపోయింది. ట్రెయిన్‌తోపాటు మనిషి కూడా వూగిపోతున్నాడు. పిచ్చిగా అటూ- ఇటూ చూస్తున్నాడు నోటికి వచ్చినట్లు వాగుతున్నాడు. "నాన్‌సెన్స్ ఆక్టర్స్‌కి నటన తెలీదు. యాక్టింగ్ నేర్చుకోవాలంటే మా దగ్గరే నేర్చుకోవాలి. లేదా, రాజకీయ నాయకుల్ని అనుకరించాలి ఔనూ, అది బీరేనా? విస్కీకంటే నిషాగా ఉంది.. బాప్‌రే... తల తిరుగుతోంది... రాంగ్ సమ్ థింగ్ రాంగ్. బీర్‌లో ఏదో కలిపావు.. నిన్ను చంపేస్తా.." అంటూ రివాల్వర్ తియ్యబోయాడు షా.

మరుక్షణంలోనే ఆ యువకుడి చెయ్యి మెరుపులా పైకి లేచింది. షా మెదడు మీద సమ్మెటలా తగిలింది.

"మైగాడ్! రాంగ్.. సమ్‌థింగ్... రాంగ్..." అంటూ తల పక్కకు వాలేశాడు షా.

విజయగర్వంతో చిరునవ్వు నవ్వాడు ఆ యువకుడు. షాను బెర్త్ మీద పడుకో బెట్టాడు. దుప్పటి కప్పాడు "గుడ్‌నైట్" మై గుడ్ ఫ్రెండ్. రెస్ట్ తీసుకో" అన్నాడు అతని ముఖంలోకి సూటిగా చూస్తూ

వేగంగా పరుగెత్తుతోంది ట్రెయిన్

అంతకంటే వేగంగా- ఆ యువకుని మెదడులో,



## బెంగాలీ ద్రౌపది!



ప్రతి ఆదివారం టి వి ప్రేక్షకులను రంజింపచేస్తున్న 'మహాభారత్' సీరియల్‌లో పాంచాలీ. పంచభర్తృకగా బెంగాలీ అమ్మాయి 'రూపాగంగూలీ' కనువిందు చేయబోతున్నది

అంతకుముందు రతి అగ్నిహోత్రి, జుహీచావ్లాలు ఈ పాత్ర పోషణకు ఆసక్తి కనబరిచారు కాని వారికీ చాన్సు దక్కలేదు యిప్పుడా చాన్సును రూపా కొట్టేసింది

పెన్ని, సంకీర్తన వంటి అనేక తెలుగు చిత్రాలలో రమ్యంగా నటించిన రమ్యకృష్ణ సుభద్రగా దర్శనమిస్తోంది

---

రక రకాల ఆలోచనలు పరుగెత్తుతోన్నాయి

అర్ధరాత్రి దాటిపోయింది

షా పంక చూశాడు ఆ యువకుడు

బీరులో కలిపిన మత్తుమందు ప్రభావం వలన అతను స్పృహ తప్పిపోయాడు తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు యువకుడు అతని సూట్‌కేస్ తెరిచాడు అందులోంచి జోషి కేసుకు సంబంధించిన ఫైలు తీశాడు గంటసేపు పరీక్షించాడు విషయాలు పూర్తిగా అర్థం జేసుకున్నాడు ఫోటోలు పరిశీలించాడు

ఆగ్రహావేశాలతో అతని శరీరం ఫూగిపోయింది. కోపాన్ని అణచుకోలేకపోయాడు బూటుకాలితో కంపార్టుమెంటు గోడను తన్నాడు

అప్పటికీ అతనిలోని ఆవేశం చల్లారలేదు

గుండుసూది తీశాడు బొటన వేలిమీద పొడుచుకున్నాడు రక్తపు చుక్క బైట కొచ్చింది వేలు నోట్లో పెట్టుకుని పీల్చాడు ఫైల్లోంచి అపరాధుల ఫోటోలు తీశాడు. వాటి వంక చూస్తూ, బుసలు కొడుతూ నిలుచున్నాడు

దీపాదేవి!– మహా తెలివైనది తన పరువు కోసం ఎలాంటి అపరాధమైనా చేస్తుంది దేనికైనా తెగిస్తుంది

పరిమళ!– మదమెక్కిన అందగత్తె నీతి లేని, మోసగత్తె

విశాలాక్షి!– సుందరి, సుకుమారి, మంచు బిందువులాంటిది చరిత్రహీనురాలు

జయరాజ్!– మాటకారి, అవకాశవాది

గురూజీ!– లా తెలిసినట్లు నటించే లిటకెంట్ మోసగాడు దుర్మార్గుడు

ఐదుగురూ క్రూర మృగాల్లా కనిపించారు అతనికి

25 ఏళ్ళ క్రిందట వాళ్ళు చేసిన అపరాధాలను బైటకు తియ్యడానికి బయలు దేరాడు షా కాని, ఆ పని అతను చెయ్యకూడదు అతను రంగంలో ప్రవేశిస్తే, తనకు అడ్డు గోడలా నిలుస్తాడు తనే అపరాధులతో పోరాడాలి వాళ్ళను రెచ్చగొట్టాలి చిత్ర హింసలు పెట్టాలి

ఆలోచిస్తూ, ఓ నిశ్చయానికి వచ్చాడు అతను

శవ పేటికలాంటి కర్ర పెట్టెను తెరిచాడు షాను బెర్త్‌మీద కూర్చోబెట్టాడు అతని ఒంటిమీది బట్టలన్నీ తీసేశాడు అతని నగ్న దేహాన్ని పెట్టెలో పడుకోబెట్టాడు

తన బ్రీఫ్ కేసులోంచి టైమ్ బాంబ్ తీశాడు

పదిహేను నిముషాల్లో అది ప్రేలేటట్లు అమర్చాడు దానిని కర్ర పెట్టెలో అమర్చి మూత వేశాడు

ఎయిర్ బ్యాగ్‌లోంచి నైలాన్ తాడు తీశాడు పెట్టె విడిపోకుండా గట్టిగా కట్టాడు.

కూపేలోంచి బైటకు వచ్చాడు

ఆ కోచ్‌లో చాలా తక్కువమంది ఉన్నారు ప్రయాణీకులు అంతా గాఢంగా నిద్రపోతున్నారు.

గుమ్మం దగ్గరకు వచ్చాడు అతను తలుపు తెరిచి బైటకు చూసాడు

ఎత్తైన ప్రదేశం నుండి పరుగెత్తుతోంది ట్రైన్ క్రింద పది-పన్నెండు మీటర్ల పల్లం ఉంది ఒత్తుగా పచ్చగడ్డి పెరిగింది ఆ పల్లంలో

గబగబా కూపేలో కెళ్లాడు కర్ర పెట్టె తీసుకు వచ్చాడు గుమ్మంలోంచి –పల్లంలోకి తోసేశాడు దీర్ఘంగా నిట్టూర్చి టైమ్ చూసుకున్నాడు

అప్పటికే పన్నెండు నిముషా లయింది బాంబు పేలడానికి మరో మూడు నిముషాల టైముంది

గుమ్మంలోనే నిలబడ్డాడు అతను బైటకు దృష్టిని సారించాడు పెట్టె పడిన ప్రదేశాన్ని కూడా దాటిపోయింది– చివరి కంపార్ట్‌మెంట్

రెండు నిముషాలు గడిచాయి ఊపిరి బిగబట్టాడు అతను

ఇంతలో -

'ఢన్' మంటూ టైమ్‌బాంబ్ పేలింది కర్రపెట్టె పగిలింది చుట్టూ వున్న గడ్డి అంటుకుంది భోగి మంటలా కాల నారంభించింది

ఆ దృశ్యాన్ని చూశాడు అతను దీర్ఘంగా నిట్టూర్చాడు "సారీ, మై గుడ్ ఫ్రెండ్! నీమీద ద్వేషం లేదు. అసూయ లేదు కాని, నిన్ను చంపితేగాని, అడుగు ముందుకు వెయ్యలేను నేను వెరీవెరీ సారీ!" అనుకుంటూ తలుపు మూశాడు

పరుగెత్తుతూనే ఉంది రైలు

లావెటరీ దగ్గర క్రీనీడలో నిలుచున్న పంచశూలమ్–

ఆ యువకుని చర్యలన్నీ గమనిస్తూనే ఉన్నాడు!!

## 6

హైద్రాబాద్ - నాంపల్లి స్టేషన్‌లో ఆగింది ట్రెయిన్

ఇద్దరు కానిస్టేబుల్సు, ఓ సబ్ యిన్స్పెక్టర్ - ఎయిర్ కండిషన్డ్ కోచ్ దగ్గరకు వచ్చారు లిస్టులో ఆలీషా పేరు చూశారు

అదే సమయంలో తలుపు తెరుచుకుంది

సి ఐ డి యిన్స్పెక్టర్ ఆలీషా–యూనిఫామ్‌లో గుమ్మం దగ్గర నిలుచున్నాడు. కళ్ళజోడు పెట్టుకున్నాడు హేండ్‌స్టిక్ పట్టుకున్నాడు

అప్పుడే షేవ్ చేసుకున్నట్లు శుభ్రంగా ఉంది అతని ముఖం!

ఎస్ ఐ, కానిస్టేబుల్సూ అటెన్షన్‌లో నిలుచున్నారు సెల్యూట్ చేశారు "గుడ్మార్నింగ్ సార్!" అన్నారు

"వెరీ వెరీ గుడ్మార్నింగ్!" అంటూ ట్రెయిన్ దిగాడు షా

కూపేలోని సామాను బైటకు తెచ్చారు కానిస్టేబుల్సు స్టేషన్ బైట నిలబెట్టిన పోలీసు జీప్ వైపుకు బయలు దేరారు

"సార్! ఒక్కరే వచ్చారా?" కుశల ప్రశ్న వేశాడు ఎస్ ఐ

"ఔను"

"రండి సార్!" అంటూ ముందుకు అడుగులు వేశాడు.

కుడి బుగ్గమీది పులిపిరికాయను సవరించుకుంటూ - ఎస్ ఐ ని అనుసరించాడు ఆలీషా వేషం వేసుకుని, చలామణీ కాబోతున్న ఆ యువకుడు!!

## 7

ఉదయం పది గంటలయింది

టూ టౌన్ పోలీసు స్టేషన్‌లో – తన ఆఫీసు గదిలో కూర్చున్నాడు సి ఐ డి యిన్స్పెక్టర్ ఆలీషా!

అతని కెదురుగా నిలబడ్డారు యిద్దరు ఎస్ ఐ. లు

వాళ్ళిద్దరు యిచ్చిన ఫైల్సు చూశాడు షా. "డ్యూటీలో చాలా స్ట్రిక్ట్‌గా ఉంటాను నేను. ఈ విషయం మీకు తెలిసే ఉంటుంది" అన్నాడు.

"విన్నాము సార్! మీ గురించి చాలా గొప్పగా విన్నాము" ఓ ఎస్. ఐ అన్నాడు.

"బైది బై మన ఏరియాలో పేరు మోసిన గూండా ఎవరు?"

"చాలామంది ఉన్నారు సార్! ప్రతి ఒక్కరూ విడి విడిగానే తమ కార్యక్రమాలు సాగిస్తున్నారు.

ఒకరితో మరొకరికి సంబంధం లేదు. కాని, పంచశూలమ్ అనే ఓ పెద్ద మనిషి ఉన్నాడు సార్! సుమారు 55 ఏళ్ళుంటాయి. అందంగా, హుందాగా, ఎంతో ఐశ్వర్యవంతునిలా ఉంటాడు. పంచామృతం హోటల్లో పార్ట్నర్. అతను–కొంతమంది రౌడీలను, గూండాలను కంట్రోల్ చేస్తున్నాడని అంటున్నారు సార్" అన్నాడు రెండో ఎస్. ఐ

"ఎప్పుడైనా పట్టుబడ్డాడా?"

"లేదు సార్! ఎప్పుడూ, ఏ విషయంలోనూ అతన్ని అనుమానించడానికి వీల్లేకుండా పోయింది... అదే గొడవ"

"అతని విషయం నేను చూసుకుంటాను. మీరొక పని చెయ్యండి."

"చెప్పండి సార్!"

"మన ఏరియాలోని రౌడీలను, కేడీలను, గూండాలను, పాత అపరాధుల్ని పిలిపించండి. వాళ్ళందర్నీ నేనొకసారి చూడాలి. వాళ్ళతో మాట్లాడాలి."

"అందర్నీ ఒకేసారి పిలవమంటారా?"

"నో .. ఉదయం యిద్దరు - ముగ్గుర్ని, సాయంకాలం మరో యిద్దరు-ముగ్గుర్ని రప్పించండి. మీ రిచ్చిన ఫైల్సునుబట్టి ఈ ఏరియాలో దాదాపు నూటఏభై మంది అపరాధులున్నారు. రోజుకు ఐదారుగుర్ని పిలిస్తే ఓ నెలలో మొత్తం అందర్నీ చూసినట్లవుతుంది "

"ఓ. కే సార్! అలాగే చేస్తాం" అన్నాడు మొదటి ఎస్. ఐ

ఇంతలో ఓ కానిస్టేబుల్ వచ్చి సెల్యూట్ చేశాడు ఓ విజిటింగ్ కార్డు షా కిచ్చాడు

దాని వంక పరీక్షగా చూశాడు షా.

"వి గురూజీ, మీనా యింపోర్ట్ అండ్ ఎక్స్‌పోర్ట్స్, హైదరాబాద్" అని ఉంది.

"ఆయనకు చాలా ఫ్యాక్టరీలూ, రక రకాల వ్యాపారాలూ ఉన్నాయి సార్! మన ఏరియాలో చాలా గొప్పవారు తమ దర్శనం చేసుకోవాలని వచ్చారు" అన్నాడు కానిస్టేబుల్

"రమ్మను." అని, "మీరు వెళ్ళి నేను చెప్పిన ఏర్పాట్లు చెయ్యండి" అన్నాడు షా.

సెల్యూట్ చేసి వెళ్ళిపోయారు ఎస్ ఐ లు

కానిస్టేబుల్ వెళ్ళి గురూజీని లోపలకు తీసుకొచ్చాడు.

55 సంవత్సరాల వయసుంటుంది గురూజీకి. ఐశ్వర్యం యిచ్చిన అందంతో ఎంతో హుందాగా ఉన్నాడు. ఖరీదైన సూటు వేసుకున్నాడు. చిరునవ్వు ముఖంతో "గుడ్మార్నింగ్ యిన్స్పెక్టర్ సాబ్!" అన్నాడు ఎంతో మర్యాదగా, చనువుగా

కుర్చీలోంచి లేచాడు షా "గుడ్మార్నింగ్!" అంటూ అతనితో కరచాలనం చేశాడు "కూర్చోండి" కుర్చీ చూపించాడు.

"మీరు కాకినాడ నుండి బదిలీఅయి, యిక్కడికి వచ్చారని విన్నాను చూసి వెళదామని వచ్చాను" కుర్చీలో కూర్చుంటూ అన్నాడు గురూజీ.

"చాలా సంతోషం మీరు రాకుంటే, నేనే వచ్చేవాడిని."

'దేనికి?" ఉలిక్కిపడ్డాడు గురూజీ.

"మీ వంటి పెద్దల సహకారం, పరిచయం కావాలి మాకు."

"ఎంత మాటన్నారు మీలాంటి ఉద్యోగుల ఆదరాభిమానాలు మాకే కావాలి. మా వ్యాపారాల్లోనూ, పరిశ్రమల్లోనూ అప్పుడప్పుడు ఏవేవో గొడవలు వస్తూనే ఉంటాయి. మీలాంటివారి అండదండలు మాకు చాలా అవసరం "

"మీ వ్యాపారాలు బాగున్నాయా?"

"లక్షణంగా ఉన్నాయి."

"సమ్మెలు, గొడవలు "

షా యింకా ఏదో చెప్పబోతుండగా మధ్యలో అందుకున్నాడు గురూజీ "లా ప్రకారం నడుచుకునే మనిషిని నేను. ఏ గొడవలు వచ్చినా నేనే సర్దుకుంటాను. ఇంతవరకు నా పనివాళ్ళమీద ఒక్క రిపోర్టు కూడా యివ్వలేదు."

"గుడ్"

"అయినా, కొత్తగా వచ్చిన ప్రతి ఆఫీసర్ని పరిచయం చేసుకోవడం నాకు అలవాటు "

"ష్యూర్! ప్రజల్ని పోలీసువారు, పోలీసుల్ని ప్రజలు అర్థం జేసుకోవడం చాలా మంచిది. మీ పరిచయం కలిగినందుకు ఎంతో ఆనందిస్తున్నాను. రియల్లీ హేపీ "

"థేంక్స్... మీ భార్యా పిల్లల్ని తీసుకువచ్చారా?"

చిన్నగా నవ్వాడు షా. "నా కింకా పెళ్ళి కాలేదు" అన్నాడు.

ఈ "వేమన" పద్యాలు

## "తలరాత"

బ్రహ్మ మయమగు విశ్వంబు ప్రబలగాంచి
లయము నొందగ మదినెంచు లక్ష్యమూని
చింత విడనాడి యుండుటే చిన్మయంబు
విశ్వదాభిరామ వినురవేమ.



# సంపూర్ణ ఆరోగ్యానికి-సంతృప్తికర మైన భోజనానికి



RAMANA

1



**A. S. బ్రాండ్** పప్పునూనె మరియు **మాన్షన్ బ్రాండు** నువ్వులనూనెతో తయారయ్యే వంటకాలతో మీరు ఎన్నడూ చేయనంత సంతృప్తిగా భోజనం చేస్తారు. వంటకాల్లో వచ్చే రుచి, కమ్మదనం అద్వితీయం.

2



అన్నిరకాల ఊరగాయలను సంవత్సర పొడువునా మెత్తబడనీయకుండ, రుచికరంగా, ఘుమఘుమలాడుతూ, తాజాగా ఉంచుతుంది.

3



గుండెపోటు, రక్తపోటు అరికట్టడంలో గొప్పగా సహాయపడుతుంది. విటమినులు A & D కలిగినది

**15,5,2 కేజీల డబ్బాలలో ఇండియన్ గవర్నమెంట్ వారి అగ్‌మార్కు సీలుతో లభించును.**




MFRS

# అంబటి సుబ్బన్న అండ్ కో. సామర్లకోట, A.P.

బ్రాంచీలు: డాక్టర్ పుళ్ళుక్కి స్ట్రీటు, తెనాలి, ఫోన్: 3150; 1-3-166 రాజా ముదలియార్ స్ట్రీట్, కలాసిగూడా, సికింద్రాబాదు, ఫోన్: 76160. కలకత్తా (ఫోన్: 469941) జెంషెడ్‌పూర్, (ఫోన్: 23219) బరంపురం (ఫోన్: 2043)లలోను ఆంధ్రదేశము ముఖ్య కేంద్రములలోను మా ఏజెంట్లు కలరు.* 5,2 K.G.ల సైజులు ప్లాస్టిక్ కంటైనర్స్‌లో సప్లై చేయబడుచున్నవి!



# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

## ఆత్మహత్య కూడా నేరమే!

కరీమ్‌నగర్ జిల్లాలోని మరియాల్ గ్రామంలో డాక్టర్ జగదీశ్వర్ ప్రాక్టీస్ చేస్తున్నాడు. అతని వయస్సు 35 సంవత్సరాలు. 13 సంవత్సరాల క్రిందట సరోజను వివాహం చేసుకున్నాడు. వివాహ సమయంలో అతని మామ పది వేల రూపాయలు, ఇంకా బహుమానాలు ఇచ్చాడు. మామ చేసిన ఆర్థిక సహాయం వలన ఎమ్.బి. బి. ఎస్. పూర్తి చేశాడు. అతనికి ప్రాక్టీస్ వలన రోజుకు 500 రూపాయల రాబడి వస్తున్నది. అతని సంతానం ముగ్గురు ఆడపిల్లలు, ఒక కొడుకు. అతని సంపాదనతో జగత్యాలలో ఒక ప్లాట్ కొని ఇల్లు కట్టుకోడానికి 1984 సంవత్సరం ఆగస్టు 13వ తేదీన శంకుస్థాపన చేసుకున్నాడు. బంధువులను పిలిచాడు. కాని ఆ కార్యక్రమానికి అతని మామ రాలేదు. అతని స్నేహితుడు రెండు రోజుల తర్వాత అతని మామను కలిసి శంకుస్థాపన కార్యక్రమానికి ఎందుకు రాలేదు అని అడిగాడు. అల్లుడికి చాలినంత డబ్బు పెట్టినట్లు మామ బదులు చెప్పాడు. ఈ విషయం జగదీశ్వర్‌తో అతని స్నేహితుడు చెప్పాడు. జగదీశ్వర్ విని ఊరుకున్నాడు. ఆగస్టు 19 తారీఖున తెల్ల వారుజామున పని మనిషి వచ్చింది. తలుపులు వేసి వున్నాయి. పని మనిషి పిలిచింది. జవాబు లేదు. ప్రక్క వాళ్ల ప్రహరీ గోడ దూకి ఇంట్లోకి ప్రవేశించింది. పని మనిషి ఆశ్చర్యపోయింది. జగదీశ్వర్, అతని భార్య సరోజ, నలుగురు పిల్లలు తెలివి తప్పి పడి వున్నారు. పని మనిషి ప్రక్క వాళ్ళకు చెప్పింది. వాళ్లు వచ్చారు. ముగ్గురు పిల్లలు మృణాళిని, మృదులు, మృత్యుంజయ మరణించారు. జగదీశ్వర్, సరోజ, ఒక ఆడపిల్ల మృణ్మయి తెలివి తప్పి పడి వున్నారు. వారిని హాస్పిటల్‌కు తీసుకొని వెళ్ళారు. మృణ్మయి కూడా మరణించింది. సర్కిల్ ఇన్‌స్పెక్టర్ జగదీశ్వర్ ఇంటికి వెళ్ళి చూశాడు. మృత్యుంజయ పడి వున్న మంచం మీద గార్డెనాల్ మాత్రలు,కాంపోజ్ ఇంజక్షన్లు, సిరంజి పడి వున్నాయి. జగదీశ్వర్, సరోజ బ్రతికి పోయారు. జగదీశ్వర్ మరియు సరోజపై పోలీసులు కేసు పెట్టారు. తన నలుగురు పిల్లలను హత్య చేసినందుకు భారతీయ శిక్షా స్మృతిలోని 302 సెక్షను క్రింద నేరము చేసినట్లు సెషన్సు జడ్జి తీర్పు చెప్తూ జగదీశ్వర్‌కు యావజ్జీవ కారాగార శిక్ష విధించారు. ఆత్మహత్యకు ప్రయత్నించినందుకు కూడా 309 సెక్షన్ క్రింద జగదీశ్వర్‌కు 6 మాసములు కారాగార శిక్ష విధించారు. జగదీశ్వర్ భార్య సరోజ కూడా ఆత్మహత్యకు ప్రయత్నించినందుకు 2 సంవత్సరములు ప్రొబేషన్ మీద విడిచి పెట్టారు. ఇద్దరూ హైకోర్టుకు అప్పీలు చేసుకున్నారు. నిందితుల తరపున సరోజ పిల్లలకు గార్డెనాల్ మాత్రలు ఇచ్చినట్లు వాదించారు. పిల్లలు కూడా మాత్రలు తీసుకొని వుండవచ్చు అని వాదించారు. హైకోర్టు వారు ఈ వాదనను తిరస్కరించారు. భారత శిక్షా స్మృతిలోని 309 సెక్షన్ భారత రాజ్యాంగములోని 19 మరియు 21 అధికరణలకు విరుద్ధమని వాదించారు. బొంబాయి హైకోర్టు డివిజన్ బెంచ్ వారు 1986లో ఇచ్చిన తీర్పుతో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు వారు ఏకీభవించలేదు. 309 సెక్షన్ భారత రాజ్యాంగములోని 19 మరియు 121 అధికరణలకు విరుద్ధం కాదని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు వారు తీర్పు చెప్పారు. 309 సెక్షన్ క్రింద జగదీశ్వర్‌కు 3 మాసముల కారాగార శిక్ష విధించారు. సరోజకు విధించిన శిక్షను మార్పు చెయ్యలేదు. నిందితులు పెట్టుకున్న పిటిషన్లు డిస్మిస్ చేస్తూ ఆంధ్రప్రదేశ్ హైకోర్టు డివిజన్ బెంచ్ వారు 1987 లో తీర్పు చెప్పారు. ●

---

అలాగా! ఒంటరిగా ఉంటున్నారన్నమాట "

"ఔను "

"మీరు మరోలా అనుకోకపోతే, నా కోరికొకటి చెల్లించండి "

"చెప్పండి "

"ప్రతి ఆదివారం ఫ్యామిలీతో సహా గెస్ట్‌హౌస్‌కి వెళ్ళిపోతాను నేను సాయంకాలం వరకు అక్కడే గడుపుతాను. రాత్రి భోజనాలు చేసి. అంతా తిరిగి వస్తాము ఈ ఆదివారం మీరు కూడా రావాలి "

"తప్పకుండా వస్తాను '

"రాత్రి అక్కడే భోజనం చెయ్యాలి "

"దయచేసి అలాంటి ఏర్పాట్లు చెయ్యవద్దు "

"మీకు ప్రత్యేకంగా ఏ ఏర్పాట్లూ చెయ్యం మా కుటుంబంలోని మనిషిగా మీరు కలిసిపోవాలి అంతా కలిసి భోజనం చెయ్యాలి "

"భోజనం విషయం మరచిపొండి ఆదివారం సాయంకాలం మీ గెస్ట్ హౌస్‌కి వస్తాను అందర్నీ కలుసుకుంటాను మీ కుటుంబంలో ఓ మెంబర్‌గా కలిసిపోతాను ఓ కే"

"థేంక్యూ యిన్‌స్పెక్టర్! అదే నాకు కావలసింది మీ కోసం ఎదురు చూస్తుంటాను' అంటూ కుర్చీలోంచి లేచాడు గురూజీ

"కాఫీ ?"

"లా ప్రకారం నడుచుకునే మనిషిని నేను. పోలీసు స్టేషన్‌లో మంచి నీళ్ళు కూడా తాగను మీ పెళ్ళికి వస్తాను పప్పు, దప్పళాలతో భోజనం చేస్తాను వస్తా "

"గురూజీగారూ!" పిలిచాడు షా

గదిలోంచి వెళ్ళబోతూ ఆగాడు గురూజీ

"పంచశూలమ్ తెలుసా మీకు?"

"పేరు విన్నాను ఎప్పుడూ పరిచయం లేదు "

"ఆల్‌రైట్ వెళ్ళిరండి" బుగ్గమీది పులిపిరి కాయను వేలితో నొక్కుకుంటూ బూటు కాలితో నేలను తన్నాడు షా

## 8

విలాసంగా మీసాలు దువ్వుకున్నాడు పంచశూలమ్ పెదవుల మధ్య వున్న పైప్ తీశాడు తన కెదురుగా నిలబడిన ఐదుగురు వ్యక్తుల వంక పరీక్షగా చూశాడు

ఐదుగురూ పేరు మోసిన గూండాలే

ప్రసిద్ధి కెక్కిన రౌడీలే

కాటా కుస్తీలు పట్టిన పహిల్వాన్‌లే

దాదాగిరిని సాగిస్తున్న మొనగాళ్లే.

ప్రతి ఒక్కరు నాలుగైదు సార్లు జైలు కెళ్ళిన పాత నేరస్థులే

"పంచభూతాలు ఎప్పుడూ కలవవు మీరు ఐదుగురు ఒకేసారి వచ్చారంటే ఏదో పెద్ద విశేషమే ఉండి వుంటుంది" అన్నాడు తాపీగా పంచశూలమ్

"మన ఏరియాకు కొత్త సి ఐ డి యిన్‌స్పెక్టర్ వచ్చాడు" ఓ గూండా అన్నాడు

"విన్నాను అతను తిరుపతి, వైజాగ్, గుంటూరు, కాకినాడల్లో పని చేసి యిక్కడికి ట్రాన్స్‌ఫర్ అయ్యాడు" అని, పైప్ పీల్చసాగాడు పంచశూలమ్.

"మన ఏరియాలోని గూండాలను, రౌడీలను, పాత నేరస్థులను పోలీసు స్టేషన్‌కు రమ్మన్నాడట "

"మన పరువు బజార్లో పెట్టాలని చూస్తున్నాడట "

"ఈ ఏరియాలో ఎలాంటి గొడవ జరగనివ్వనని చాలెంజ్ చేస్తున్నాడట."

# పంచశూలమ్

ఫైప్ పీలుస్తూ, ఐదుగురు చెప్పిన మాటలూ విన్నాడు పంచశూలమ్ కాని సమాధానం యివ్వలేదు వూరుకున్నాడు

"అతని ఛాలెంజ్‌ని ఎదుర్కొంటాం "

"ఎముకల్లో సున్నం లేకుండా కుమ్మేస్తాం."

"ఒక్క దెబ్బతో గంట కట్టేస్తాం "

"వాళ్ళ బాబు దగ్గరకు పంపేస్తాం" అన్నాడు అందరికంటే భయంకరంగా వున్న పహిల్వాన్

"గౌస్‌ఖాన్!" తాపీగా పిలిచాడు పంచశూలమ్

"గురూ!" పహిల్వాన్ పలికాడు

"తొందర పడవద్దు. నిప్పును ముట్టుకుంటే కాలుతుంది కత్తి మీద కాలు వేస్తే తెగుతుంది బుల్లెట్‌కి ఎదురు వెళితే గుండెల్లోకి దూసుకుపోతుంది కాస్త ఆలోచించండి ముందు "

"ఏ ఆలోచనా మాకు తోచకే మీ దగ్గరకు వచ్చాం గురూ! బంగారంలాంటి బాపిరాజును కాకినాడ పంపించి, అక్కడినుండి ఈ కసాయివాడిని ఎందుకు రప్పించారో అర్థం కావడం లేదు, గురూ!" అన్నాడు పహిల్వాన్.

"ఏదో పాత కేసు పరిశోధించమని, సి బి.ఐ డైరెక్టర్ అతన్ని యిక్కడికి పంపినట్లు విన్నాను" ప్రశాంతంగా అన్నాడు పంచశూలమ్

"పాత కేసులంటే మేము చేసినవేనా?"

"మీరు ఈమధ్యనే రంగంలోకి దిగారు అతను వచ్చింది - పాతికేళ్ళ కిందటి కేసు పరిశోధించడానికి."

"ఆ కేసుకు, మాకు సంబంధం ఏమిటి?"

"ఏమీ లేదు "

"మరి, మమ్మల్నందర్నీ స్టేషన్‌కు రమ్మని కబురంపా డెందుకు?"

"చూడాలని"

"మాతో అతని కేం పని గురూ? చూడాలనే వంకమీద పిలిచి మమ్మల్ని లోపలకి తోస్తే " పహిల్వాన్ ప్రశ్నించాడు

"నేను వచ్చి విడిపిస్తాను" అన్నాడు శాంతంగా పంచశూలమ్

"అంతవరకు ఎందుకుసార్! అతన్ని ఓ చూపు చూసేస్తాం" అన్నాడు ఓ రౌడీ

"కీళ్ళు విరిచేస్తాం" వంత పాడాడు కేడీ

"అతని తల తీసి, పోలీస్ స్టేషన్ ముందు వేలాడగట్టేస్తాం" అన్నాడు పహిల్వాన్.

రెండుసార్లు ఫైప్ పీల్చాడు పంచశూలమ్. హుషారుగా పొగ బైటకు విడిచి పెట్టాడు ఓ నిశ్చయానికి వచ్చాడు. "గౌస్ ఖాన్! ఇన్స్పెక్టర్ ఆలీషాను రెచ్చగొట్టడం అంత మంచిది కాదు అతను పైకి మంచి వాడిలాగే కనిపిస్తాడు కాని, చాలా దుర్మార్గుడు" అన్నాడు

"అతనికంటే దుర్మార్గులం మేము" అన్నాడు గౌస్‌ఖాన్

"అహింసావాదిని నేను హింసను భరించలేను . మీరంతా నా శిష్యులు అందుకే ఓ యిన్ఫర్‌మేషన్ యివ్వాలనుకుంటున్నాను"

"చెప్పండి గురూ!" అన్నాడు గౌస్‌ఖాన్

"ఆదివారం సాయంకాలం గురూజీ గెస్ట్‌హౌస్‌కి డిన్నర్‌కి వెళుతున్నాడు షా అక్కడినుండి అతను తిరుగుముఖం పట్టేసరికి రాత్రి పది గంటలవుతుంది. ఆ సమయంలో మీ ప్రయత్నాలు మీరు చెయ్యండి. తర్వాత నాకు చెప్పండి "

"శుక్రియా దాదా!" అని వంగి వంగి సలాములు చేసి ఐదుగురూ వెళ్ళిపోయారు

మరుక్షణంలో నే టూ టౌన్ పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేశాడు పంచశూలమ్ "ఇన్స్పెక్టర్ షా కావాలి" అన్నాడు

"హలో! షా ఈజ్ దిస్ సైడ్" అవతలి నుండి వినిపించింది

"మిష్టర్ షా! ఆదివారం సాయంకాలం గురూజీ గెస్ట్‌హౌస్‌కి మీరు విందు కెళుతున్నారు మీరు తిరిగి వచ్చేటప్పుడు కొందరు గూండాలు మీకు మరో విందు చెయ్యబోతున్నారు! దట్సాల్" అని, రిసీవరు ఫోన్‌మీద పెట్టేశాడు ప్రశాంతంగా ఫైప్ పీలుస్తూ దీర్ఘాలోచనలో మునిగిపోయాడు పంచశూలమ్

(ఇంకా ఉంది)

# మనమూ- మన చర్మం దాని వ్యాధులు



**ప్ర: శోభి అనేది ఎందుకు వస్తుంది? దాన్ని నిర్మూలించవచ్చా ?**

జ: శోభి ఒకరకమైన ఫంగస్ (మలసేజియా ఫర్ ఫర్) వలన వస్తుంది. ఇది ఎక్కువగా చెమట పోయువారికి, సబ్బులు, టవల్స్ ఇతరులు వాడినవి వాడటం వలన ఈ వ్యాధి సంక్రమిస్తుంది. కేన్సర్, మదుమేహము లాంటి జబ్బులు ఉన్నవారికి ఇది త్వరగా శరీర మంతయు ముఖ్యముగా ఉదరభాగము, మెడ, చేతులు, ముఖము నందు వ్యాపిస్తుంది. ఈ వ్యాధిని నయము చేయుటకు 'మైకోనజోల్' 'ఈకోనజోల్' లాంటి పూత మందులు రోజూ రెండు సార్లు స్నానం చేసిన తరువాత వ్రాయవచ్చు. 'కేటకోనజోల్' బిళ్ళలు భోజనం తరువాత వేసుకొనవలెను. లివర్ జబ్బులున్నవారు, ఈ మందు వాడకూడదు.

**ప్ర: కుష్టువ్యాధి స్పర్శవలన ఇతరులకు వ్యాపిస్తుందా ?**

జ: కుష్టువ్యాధులలో రెండు ముఖ్యమైన రకాలు ఉన్నాయి. మొదటిది 'ట్యూబర్క్యులాయిడ్' 80 శాతం ఈ రకమైన రోగానికి గురవుతారు. ఇది అంటు వ్యాధి కాదు. ఇక రెండవరకము 'లెప్రమేటస్' 20 శాతం రోగులు ఈ రకమైన వ్యాధికి గురవుతారు. స్పర్శవలన, వస్త్రముల వలన ఒకరి నుండి మరియొకరకు వ్యాపించవచ్చు. చెవి తమ్మెల నుండి, ముక్కు రంధ్రము నుండి రక్త పరీక్ష చేయుట, మరియు చర్మ వ్యాధి నిపుణులు రోగిని పరీక్ష చేయుట ద్వారా ఏ రకమైన వ్యాధో తెలిసి కొనవచ్చు.

**ప్ర: చర్మంపై వచ్చే మచ్చలను అవి ప్రమాదకరమైనవో కాదో తెలుసుకోవడమెలా?**

జ: ముందుగా అవి ఏ రంగులో ఉన్నవో జాగ్రత్తగా పరీక్షించాలి. రాగి రంగు మచ్చలు కుష్టువ్యాధికి సంబంధించినవి, ఈ మచ్చలపై గిచ్చినా సూది ఆనించినా స్పర్శ తక్కువగా ఉండుట లేదా పూర్తిగా లేకపోవుట గమనించవచ్చు. ఈ రకం మచ్చలపై చెమట కూడా తక్కువగా ఉంటుంది. నల్లని మచ్చలు కొన్ని రకముల మందులు పడకపోవటం వలన వస్తాయి. అలాగే పుట్టుమచ్చలు పుట్టుకతోనే రానవసరములేదు. కొన్ని 5 నుండి 25 సంవత్సరములు వయస్సు మధ్య రావచ్చును ఏ రకమైన మచ్చలు అయినా వైద్యునికి చూపించుకోవడం మంచిది.

**ప్ర: కొంతమందికి శరీరం పై నల్లటి మచ్చలు వస్తుంటాయి కదా ! వాటికి చికిత్స ఉందా ?**

జ: కొన్ని రకములైన మందులు పడకపోవడమువల్ల శరీరంపై దురద, మొదట ఎరుపు అంచు మచ్చలు ఆపైన నల్లని మచ్చలు వస్తాయి. వీరు సల్ఫాడ్రగ్స్, ఎనాల్జిన్, బెరాల్గన్, టెట్రామైసిన్ మొదలగు మందులు వాడకూడదు. ఎక్కువగా ఎండలో తిరుగుట వలన క్రీమ్స్, కాస్మోటిక్స్ వాడుటవలన, సమీక్రుత ఆహారం లోపము వలన మరియు వంశపారపర్యంగా కూడా ఈ మచ్చలు రావటానికి అవకాశం ఉంది. వీరు 'మైలలైట్ క్రీమ్' 'బెక్లామిథసైన్' లోషన్ కలిపి వాడిన మంచి

---

**చర్మ వైద్య నిపుణులు**

**డా. జాస్తి వెంకట సుబ్బారావు**

ఎం. బి. బి యస్, డి. వి



డా వెంకట సుబ్బారావు యువకులు అయినా అనుభవజ్ఞులు రంగరాయ వైద్య కళాశాల - కాకినాడలో వైద్య విద్య నభ్యసించారు తెనాలిలో చర్మ వైద్య నిపుణునిగా 1985 నుండి ప్రాక్టీసు చేస్తున్నారు

ఉపయోగముగా ఉంటుంది. 'బి'కాంప్లెక్స్, విటమిన్'సి', అయిరన్ టాబ్లెట్లు రోజూ ఒకటి చొప్పున వాడాలి, ఈ విధంగా 6 నెలలు వాడాలి.

**ప్ర: సబ్బులు వాడటం వలన చర్మానికి ఏమైనా నష్టాలు ఉన్నాయా ?**

జ: అది మన శరీరతత్వమును బట్టి ఉంటుంది. కొందరికి చర్మపొలుసులుగాను,-పొడి గాను ఉంటుంది. అటువంటి వారు సబ్బులు వాడకూడదు. అలాగే 'ఎగ్జిమా' మొదలగు జబ్బులున్నవారు కూడా సబ్బులు వాడుట మంచిదికాదు. అలాగే ఒక బ్రాండ్ నుంచి ఇంకొక బ్రాండ్‌నకు తరచుగా మార్చుట కూడా మంచిది కాదు. వయస్సుమళ్ళినవారు సబ్బులు వాడుట ఏమంత మంచిది కాదు. వయస్సు ప్రభావము వలన చర్మము పొడిగా ఉంటుంది. అటువంటివారు సబ్బులు వాడకం వలన దురదలు, పగుళ్ళు రావచ్చును.

**ప్ర: చర్మం పరిశుభ్రతకోసం ఏ విధంగా, ఎన్నిసార్లు రోజూ స్నానం చేయాలి?**

జ: పరిశుభ్రత కోసం రోజుకి రెండు సార్లు స్నానం చేస్తే సరిపోతుంది. వంటికి నూనె వ్రాసి, సున్నిపిండితో నలుగు పెట్టుకుని గోరువెచ్చని నీళ్లతో స్నానం చేయడం మంచిది.



విపరీతంగా సబ్బు వాడటం మంచిదికాదు.

**ప్ర: చెమట కాయలు ఎందుకు వస్తాయి? నివారణ ఏమిటి ?**

జ: ఎక్కువవేడి, సరి అయిన గాలి లేకపోవుట, బిగుతు వస్త్రాలు, నైలాన్, పాలిష్టర్ వస్త్రాలు ధరించుటవలన చెమటకాయలు వస్తాయి. చెమట ఎక్కువగా పట్టి చెమట గ్రంధుల ద్వారా బయటకు విసర్జించబడు శక్తి కోల్పోయి, చర్మములోని ఏదో ఒక పొర లోనికి (ఎపిడెర్మిస్, లేదా డెర్మిస్) విసర్జించబడి, అది చిన్న చిన్న పొక్కులుగా మారుతుంది. కొన్ని ప్రత్యేక సందర్భములో వాటికి చీము కూడా పట్టవచ్చును. వీటిని నివారించుటకు చెమట ఎక్కువగా పట్టకుండా చూచుకొనుట, మంచి గాలి వచ్చే ప్రదేశములలో నివసించుట, లూజు వస్త్రాలు, కాటన్ వస్త్రాలు ధరించుట, విటమిన్ 'ఎ' బిళ్ళలు, విటమిన్'సి' బిళ్ళలు వాడవచ్చును. టాల్కమ్ పౌడర్, లేదు ప్రెక్లీహీట్ పౌడర్ వాడుట ఉపయోగకరము.

**ప్ర: సాక్సులు, బ్రాలు, డ్రాయర్లు వాడటం వలన కొందరకు ఎలర్జీ వస్తుంది, ఎందుచేత ?**

జ: ఎలర్జీ (సరిపడకపోవుట) అనేది సృష్టిలో ఏ వస్తువు వల్లనైనా సంభవించవచ్చు. కట్ డ్రాయర్లు, బ్రాలు వేసుకుని, ఎక్కువగా చెమటపోయు వారికి "ఫంగస్" వ్యాధి వస్తుంది. దీనిని చాలామంది ఎలర్జీ అని భ్రమపడతారు. వీరు చెమట ఎక్కువగా పట్ట కుండా చూచుకొనుట, ఆ తరువాత 'క్లోట్రిమజోల్'పౌడర్, ఏంటీ హిస్టమిన్ బిళ్ళలు రోజూ 1 లేదా 2 వాడవచ్చు. నైలాన్ సాక్సులు సరిపడకపోతే కాటన్ సాక్సులు వాడవచ్చు. బ్రాలు, డ్రాయర్స్ ఒక రకం సరిపడకపోతే వేరే రకం వాడి చూడాలి. అప్పటికి ఫలితం లేక పోతే చర్మ వైద్యుని సంప్రదించాలి.

ఇంటర్వ్యూ :
హిప్నాటిస్టు టి. ఎస్. రావ్

కె రామలక్ష్మి (మద్రాసు)

ప్రశ్నావళి పాఠకులకో విజ్ఞప్తి. నేనిక మీదట పాఠకుల కోరిక తీరడానికి– వారి వారి పూర్తి పేర్లు, ఇంటి పేర్లు, ప్రాంతాలపై పరిశోధనాసక్తి కలవారికి ఉపయోగకారిగా వుంటుందని– పూర్తి యింటి పేరు, ఊరు ప్రచురించితే బాగుంటుందని సూచించాను సంపాదకులు అంగీకరించారు. కావున మీ ఇంటి పేరుతో సహా– పూర్తి పేరు– వీలైతే జిల్లా మీ ప్రశ్నలతో రాసి ఆంధ్ర సచిత్ర వార పత్రికకే మీ ప్రశ్నలు పంపించండి




యు ఉరికుందు, ఎమ్మిగనూరు

అంతర్గత ప్రజాస్వామ్యం అంటే–

★ నా మాట విన్నవాళ్ళు– స్వేచ్ఛ ఏమైనా చేయవచ్చు విననివాళ్ళు కూడదు– అని కాదా– అర్థం?

తమిళనాడు అసంబ్లీలో గలాభా? కామెంట్?

★ హాయిగా టి వి లో చూపించినా బాగుండేది! (కాని సెన్సార్లు బొత్తిగా 'ఏ' ఇచ్చేవారు) ఓ హాస్యనటి (తెలుగు వారు కాదు– మన వాళ్ళకా రిపార్టీ ఎక్కడుంది?) "అలా చీర పట్టుకుంటేనా? యిచ్చి చక్కా వచ్చేదాన్ని" అందిట!

చీమకుర్తి నాగేశ్వరరావు, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా

టి వి లో ప్రసారం అవుతున్న రామాయణం, మహా భారతంలో మీకేది నచ్చింది?

★ నేను రెండూ చూడను. ఇవి మన కోసం కాదు– నిరక్షరాస్యులూ, మన సంస్కృతి అస్సలు తెలియని పాశ్చాత్యులూ యితరులూ, ఫారిన్‌లో పుట్టిన మనవాళ్ల టిలుగు ఛిల్డ్రన్‌లకూ– బాగుంటుంది– బేసిక్స్ తెలుసుకుందుకు– అయినా ఏమాత్రం టెంపోలేకుండా రోకలి బండలాగ సాగిస్తూంటే– ఒకొక్కప్పుడు విసుగనిపించదూ?

ఆంధ్ర, తమిళనాడులలో మీకు మంచి అవగాహన వుంది కదా– రెండింటిలో మీకు నచ్చినది ఏది?

★ తమిళనాడే! ఇక్కడ జనానికి మంచి రాజకీయ పరిజ్ఞానం వుంది– ఎవరూ యింకా అనుకోక ముందే– రిక్షావాళ్ళు, కూలినాలి చేసుకునే వాళ్ళు ఎన్నికల్లో డి. ఎం. కె. వస్తుందని నిర్ణయించ కల్గారు!

18 సం. ఓటును మీరు సమర్థిస్తారా? వ్యతిరేకిస్తారా?

★ మధ్య మనం ఎవరం? ఏడాదికి కొన్ని కోట్ల. ఓట్లు పోతున్నాయని– వయసు తగ్గించారంతే– యువతకి ప్రాధాన్యత యివ్వడానికి కాదే!

టి. అనంత్, ఖుర్దా

నేను ప్రేమించిన అమ్మయి నన్ను ప్రేమించక పోతే?

★ ఇంకో అమ్మాయిని ప్రేమించే ప్రయత్నంలో తల మునుకలు కావడమే. ఏం? అంత టైం లేదంటారా ఏమిటి?!

ఈనాడు జనాభా పెరగడానికి ఆడది ముఖ్య కారణమా?

★ కాదా మరి! ఆమే కదా కంటూంది! అందుకే కాబోలు– మహా గొప్పగా వసంత సాఠెగారు– ఆడ–మగ నిష్పత్తి తగ్గించేయ మన్నారు– అందులోనూ ఆడాళ్ల సంఖ్యని? స్వామీ– ప్రకృతి దయవల్ల–ఇంకా స్త్రీలు సజ్జో గర్భధారణ చేయడం లేదు– స్త్రీ పురుషుల శ్రమాఫలం– సంతానం

కె. శ్యామల, కలకత్తా

మీ జవాబులు చాలా థ్రిల్‌గా వుంటాయి సుమండీ!

★ అలాగా! ఆ థ్రిల్/ ఎడ్వెంచర్/ జుగుప్స/ రొమాన్స్/ సస్పెన్స్ భయ విభ్రాంతులలో మనుషులను ముంచేయగల ప్రతిభ నా కెక్కడిదండీ? నేను మీ మాట నమ్మను నేను నిజంలేక కల్పన రాయలేను. 'నమ్మకం' లేకపోతే కనీసం పోయేదాకానేనా– నమ్మకుండా వుండలేను! కర్మ.

ఎస్. కొండలరావు, నెల్లూరు

భారత దేశంలో నాటి, నేటి రాజధానిలోనూ రేడియో స్టేషన్లు లేనివి ఎన్ని?

★ హాయిగా వుండక– యీ బాధెందుకు సార్.

రాయలసీమ రాగాలసీమ లేక రతనాల సీమా– దేనికి ఇప్పుడు ప్రాతినిధ్యం వహించింది?

★ అక్కడికి మీకు తెలియనట్టు– కరువు కాటకాలకి, నాటు బాంబు తయారీకి! ఏ ప్రాంతమైనా అక్కడి నుంచి రాజకీయ వ్యాపారంలో పైకి వచ్చిన వ్యక్తుల యుక్తి శక్తులను బట్టేకద అభివృద్ధి చెందేది? అలా రాయలసీమ విషయంలో గట్టి పట్టు పట్టే నేతలు– తక్కువ

వై. ఎస్. ఎన్. మూర్తి, తాళ్ళపూడి, పశ్చిమ గోదావరి

లక్ష్మిగారూ భార్య భర్తను మెచ్చుకునేది ఎప్పుడు?

★ సాటి ఆడదాన్ని కాస్త తిట్టినప్పుడా? జీతం రాళ్లన్నీ చేతికిచ్చినప్పుడా? నీ అంత తెలివైనది లేదన్నప్పుడా? చెప్పడం చాలా కష్టం భార్యలు భర్తలని పొగడ్డానికి అవకాశాలే తక్కువ!

నేటి బాలలే రేపటి పౌరులు అయితే నేటి రచయితలే రేపటి. . .?

★ రౌడీలు/ గూండాలు– సారీ రాజకీయ వేత్తలు.

జి. వెంకటేశ్వరరావు. . సికింద్రాబాదు

కోరికలు తీర్చేసుకుంటే జీవితం సాఫీగా సాగించడం సులభం అంటాను. ఏమంటారు రామలక్ష్మిగారు?

★ ఏముంది అనడానికి సార్. కోరికలని తీర్చేసుకుంటూ, కోరినవన్నీ సేకరించేసుకుంటూ పోవడం నిప్పుని ఎండు గడ్డితో ఎగసన దోయడమే కద! కోరికలన్నీ తీరేనా?! కొత్తవి పుట్టక ఆగేనా?!

మీరేం నగలు పెట్టుకో రెందుకు?

★ లేవు కనుక! (పోనీ– ఉంటే బాగుండు ననుకుంటే– మూడూ లేకుంటే బాగుండు ననుకుంటే ఐదూ అనుకో అనేవాడు మా పెద మామయ్య. అలా అనుకున్నా బాగానే వుంటుంది కదూ!)




# ఇప్పుడు అంతర్జాతీయ గుర్తింపు పొందింది

యుగోస్లోవియా మరియు తూర్పు యూరోప్
ప్రాంతాలకు ఎగుమతి చేయడానికి, సాలిడైర్
సిఎటి 1000 డిఎక్స్‌కి మంచి అవకాశం
లభించింది ఇది కేవలం ఒక ఆరంభము
ఇలాంటి ఎన్నో మంచి అవకాశాలు
భవిష్యత్తులో లభిస్తుంది
ప్రస్తుతం భారతదేశంలో ఎక్కువ మందిని
ఆకర్షిస్తున్న సాలిడైర్ సిఎటి 1000 డిఎక్స్
డీలక్స్ కలర్ టి వి త్వరలో విదేశాలలోకూడా
ఎక్కువ మందిని ఆకర్షించగలదు



# ఇది కథ కాదు

"తాతయ్యగారూ యీ వార్త విన్నారా' చదువుతాను వినండి" అంటూ ఆచారిగారి వంక ఓసారి చూసి పేపర్లోకి తల దూర్చాడు రాఘవ

ఆచారి గారింట్లో అద్దెకుంటూ 'తాతయ్యగారూ' తాతయ్యగారూ' అంటూ కలివిడిగా కలిసిపోయిన వ్యక్తి రాఘవ చదువు డిగ్రీ వరకూ చదివినా వుద్యోగం రాలేదు అలాగని నిరుత్సాహపడకుండా యేదో ప్రవేట్ జాబ్ చేసుకుంటూ సాయంత్రం పూటగా పదిమందికి ట్యూషన్‌లు చెప్పుకుంటూ దిగుల్లేకుండా కాలాన్ని గడిపేస్తున్నాడు

రాఘవ చదవటం మొదలెట్టాడు.

"కర్నూల్లో వరకట్నానికి బలైన ఓ యువతిగాథ కట్నం యివ్వలేదని గత కొద్ది నెలలుగా వేధిస్తూ, ఆఖరికి భార్యని చంపటానికి కూడా సిద్ధపడిన భర్తని నిన్న అరెస్టు చేయటం జరిగింది నవీన్ మరియు రామమ్మకి రెండు సంవత్సరాల క్రితం వివాహం జరిగింది అయితే యివ్వవలసిన కట్నానికి గాను పిల్ల తండ్రి యింకా అయిదువేలు వివాహం జరిగే సమయానికి పెళ్ళికొడుక్కి యివ్వవలసి వుంది. అయితే ఆర్థిక యిబ్బందులవల్ల పిల్ల తండ్రి వెంటనే యివ్వలేక వివాహం జరిగిన ఆరునెలలకి కొద్ది కొద్దిగా పెళ్ళికొడుక్కి ముట్టజెప్పడం జరిగింది అయినా తర్వాత కూడా ఆ భర్త యింకా కట్నం కావాలని భార్యని వేదించుకు తింటూంటే ఆ పిల్ల తండ్రి మరో అయిదువేలు తన పొలం అమ్మి అల్లుడికి అప్పజెప్పటం జరిగింది అయితే ఆ పెళ్ళి కొడుక్కి డబ్బులు యింకా గుంజాలనే తపనతో భార్యని వేధించుకు తింటూంటే రెండు రోజుల క్రితం రామమ్మ భర్త కోరికను మన్నించి తండ్రిని డబ్బు అడక్కుండా ఎదురు తిరిగింది. దానికి యిద్దరి మధ్యా ఘర్షణ జరిగి అదేరోజు రాత్రి నవీన్ భార్యని కిరోసిన్‌పోసి తగలెయ్యటానికి ప్రయత్నించగా రామమ్మ అరిచిన అరుపులకు చుట్టు ప్రక్కల వాళ్ళులేచి రామమ్మను రక్షించటానికి చేసిన ప్రయత్నంలో రామమ్మ మితిమీరిన కాలిన గాయాలతో హాస్పిటల్లో జేర్పబడింది అప్పుడే రంగంలోకి పోలీసులుదిగి భర్త నవీన్ని అరెస్టు చేశారు. కేసు రిజిస్టర్ చేసి దర్యాప్తు చేస్తున్నారు

చదవటం ఆపాడు రాఘవ ఆచారిగారు వంక చూశాడు ఆయన కళ్ళలో నీళ్ళు తిరిగాయి రాఘవకి ఆయన పరిస్థితి చూస్తే కళ్ళ నీళ్ళు పర్యంతమయింది

"తాతయ్యగారూ' యీ వార్త వింటే బాధగా వుంది కదూ!"

"అవున్నాయనా మనం బాధ పడగలమేగాని యేం చేయగలం ప్రతీ వంద యింట్లోనో యిటువంటివి ఓ పదిశాతం వుండక పోతాయా అయినా కట్నాలు పూర్తిగా యిచ్చిన వాళ్ళకి కూడా కొంతమందికి సుఖంలేదు అయినా పూర్వజన్మ సుకృతం కూడా వుండాలి ఈ రోజుల్లో మంచి అల్లుళ్ళు, అందులోనూ కట్నాలు లేకుండా చేసుకునే వాళ్ళు చాలా అరుదు ఆడది యెదురు తిరగనంత కాలం యీ కట్నాల జులుం సాగుతూనే వుంటుంది పోనీ యెదురు తిరిగి భర్తని వదలి బయటకువస్తే మనమే కాకుల్లా పొడుస్తూ సూటీ పోటీ మాటలతో ఆడది యెదురు తిరగాలంటే ఆత్మస్థైర్యం యెక్కువ వుండాలి " అంటూ పడక్కుర్చీలోంచి లేచి లోపలికి వెళ్ళాడు రాఘవ అక్కడే కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు ఆ రోజు ఆఫీసుకి సెలవు పెట్టాడు రాఘవ కొంచెం వంట్లో నలతగా అనిపించింది.

ఆచారిగారు వరండాలోంచి లోపలి గదిలోకి వెళ్ళి మంచం మీద నడుం వాల్చారు ఆచారిగార్కి యిద్దరే అమ్మాయిలు. పెద్దమ్మాయికి పెళ్ళయ్యి నాలుగేళ్ళయ్యింది ఓ బాబు రెండో అమ్మాయి సునీతకు పెళ్ళి జరగాల్సి వుంది ఆ రోజు వుదయం లేచిందగ్గర్నుంచి కంగారుగా వున్నారు ఆచారిగారు దానిక్కారణం అంతక్రితం రోజు వచ్చిన వుత్తరం అది పెద్దమ్మాయి సుజాత దగ్గర్నుంచి వచ్చింది ఉత్తరం చదివాక ఆచారిగార్కి విషయం అర్థం అయ్యింది ఇప్పుడు ఆయనకు డబ్బులు కావాలి ఎలా" తన దగ్గర ఒక్క పైసా కూడా లేదు స్కూల్లో టీచర్ క్రింద రిటైర్ అయ్యాక వచ్చిందే కొంచెం ఆ మొత్తంలో సుజాత పెళ్ళి చేశాడు తన అదృష్టమానుకుంటూ రెండో పిల్ల సునీతకు గవర్నమెంటు ఆఫీసులో వుద్యోగం వచ్చింది దాంతో కొంతవరకూ వూపిరి పీల్చుకో గల్గాడు యెప్పుడో తాతలు మిగిల్చిన పెంకుటిల్లు. అందులోనే ఒకగది రాఘవకి అద్దెకిచ్చాడు

ఆచారిగారు మంచం మీద పడుకునే వున్నారు కాని వళ్ళంతా చెమట పడుతోంది పెద్దమ్మాయికి మళ్ళీ డబ్బులిచ్చి పంపాలేమోనని అంతక్రితం ఓ రెండుసార్లు అలాగే వచ్చిన వుత్తరానికి తను డబ్బులిచ్చారు ఈ సారి కూడా ఆ ఉత్తరం చూస్తుంటే అదే అనుమానం కల్గుతూంది ఆచారిగార్కి అందుకే ప్రొద్దున్న ఆఫీసుకెళుతున్న రెండో కూతురోతో అన్నాడు

"అమ్మా యీ రోజు మీ అక్కయ్య వస్తుంది"

"ఉత్తరం చూశానుగా తెలుసు నాన్నా'

"అది కాదమ్మా' మళ్ళీ తనకి డబ్బులు అవసరం " ఆగిపోయాడు ఆచారిగారు

కూతురు కూడా ఓ క్షణం మాట్లాడలేదు

"రానీండి నాన్నా' మనం యేదో వూహించుకుని బెంబేలు పడిపోవటం యెందుకు వచ్చాక యెలాగు తెలుస్తుందిగా డబ్బులైతే మనం యివ్వాలి అనుకుంటే యెక్కడైనా అప్పైనా తీసుకురావాలి

బులుసు కామేశ్వరరావు

అమ్మా సునీతా నువ్వు అంత తేలిగ్గా డబ్బులు గురించి చెప్పావుగాని డబ్బులు సర్దటం అంత సులభం కాదు

"సరే అక్కయ్యని రానీండి. ఆలోచిద్దాం." సునీత వెళ్ళిపోయింది.

అప్పట్నుంచి మనసు అంతా వొకటే దిగులు వేసుకుంది ఆచారిగార్కి. అలా ఆలోచిస్తూ వరండాలో కూర్చుంటే ఆ రాఘవ పేపర్లో వార్త అంటూ అదేదో చదివాడు. ఆ బాధని చదివితేనే మనం అంత బాధపడ్డాము కదూ! మరి నిత్యం వాటి గురించి పోట్లాడుకునే జంటల సంగతేంటి. అందులో తన కూతురు కూడా ఒక్కర్తె. మొదటిసారి అల్లుడు డబ్బు అడిగినప్పుడు కట్నం తాలూకు డబ్బులన్నీ పెళ్ళిలోనే యిచ్చేశాంకదా మళ్ళీ యెందుకడిగాడు అని అనుమానించాడు. కాని యే స్కూటరో కొందామని సరదాపడి వుంటాడు అని తను మారుమాట్లాడకుండా అడిగిన డబ్బు యిచ్చేశాడు. కాని రెండు నెలలుతిరగకుండా మళ్ళీ కూతురు వుత్తరం వచ్చింది అప్పుడూ డబ్బులు ప్రస్తావనే అప్పుడు తనకి అనుమానం వచ్చింది అల్లుడి విషయంలో అంచనా తప్పుఅయినందుకు కాని చూస్తూ చూస్తూ కూతురి కాపురం నాశనం చేయలేదు ఆ ధైర్యంతోనే అల్లుడు కూడా ఆచారిగార్ని అడుగుతున్నాడు. భార్యని అడ్డం పెట్టుకుని. ప్రస్తుతం తను డబ్బులు యిస్తే నాల్గోసారి అవుతుంది. ఇప్పటికి మూడుసార్లు మూడు అయిదులు యిచ్చాడు. ఇప్పుడు యెంత అడుగుతాడో.

వరండాలో అలికిడి అయ్యేసరికి గోడగడియారం వంక చూశాడు ఆచారిగారు. టైం పన్నెండు





అయ్యింది. కూతురే వచ్చి వుంటుందని మంచం మిద నుంచి లేచి వరండాలోకి వచ్చాడు. అప్పుడే ఆచారిగారి పెద్ద కూతురు రిక్షా దిగుతూంది. ఆచారిగారి మనమడు తప్పటడుగులు వేసుకుంటూ మెట్లు యెక్కటానికి ప్రయత్నిస్తున్నాడు. ఆచారిగారు గబగబా వెళ్ళి మనవడ్ని యెత్తుకుని ముద్దాడాడు. కూతురు సుజాత రిక్షావాడికి డబ్బులిచ్చి పంపి లోపలికి నడిచింది.

"ఏవమ్మా! బాగున్నావా! అల్లుడు కులాసానా"

"ఆ కులాసానే నాన్నా!" మామూలుగానే సమాధానం చెప్పింది సుజాత.

"ఇన్నిసార్లు నువ్వొంటరిగానే వస్తున్నావు. ఒక్కసారి కూడా అల్లుడిగార్ని తీసుకు రాలేదు. నేను ఇన్నిసార్లు వుత్తరం రాశాను కదా యీ సారైనా తీసుకు రావలసింది"

"ఆయనా రావాలనే అనుకున్నారు. కాని ఆఫీసు పనిలో కుదరలేదు" పెట్టెను గదిలో ఓ మూల పెడూ లోపలికి వెళ్ళింది సుజాత.

అదే సమాధానం కూతుర్నుంచి వస్తుంది అని తనకి తెలుసు అంత క్రితం కూడా అదే సమాదానం చెప్పింది కూడా కాని అల్లుడ్ని గురించి ఓ మాట కూడా అడక్కపోతే తను చిన్న చూపు చూస్తున్నానేమోనన్న బావం కూతురికి కలగచ్చు ఆ బేదం కలగకుండా వుండటానికి తాను అడిగాడు ఎంతైనా మనసులో వున్న చిన్న చూపుని బయటకు ప్రకటించలేడు కదా తను. ఎంతకయినా తన రక్తాన్ని పంచుకుపుట్టిన కూతురు. కాని వివాహం అయిన తర్వాత భర్త చెంత వుండవలసిందే భర్తకి విలువనివ్వవలసిందే. ఆ భర్తకి యెవరు విలువనివ్వలేదని తెలిసినా అది ఆమె మనసులో వారి మీద కించిత్తు రెస్పెక్టు తగ్గుతుంది వాళ్ళ తండ్రిగాని, తల్లిగాని, మరేతోడబుట్టినవాళ్ళు కాని

ఆచారిగారు ఆ పూటంతా మనవడి కబుర్లతో గడిపేశారు. సుజాత ప్రయాణ బడలికలో అలసిపోయిందేమో భోజనం చేసి కొడుక్కి కొంచెం అన్నం పెట్టి పడుకుంది.

మనవడు ఆడి ఆడి ఆచారిగారి దగ్గరే నిద్ర పోయాడు. కూతురింకా నోరు విప్పలేదు విప్పితే యే తుఫాను రేగుతుందా అని ఆసక్తికంటే బయంగా కూతుర్నుంచి వచ్చే మాట గురించి యెదురు చూస్తున్నాడు ఆచారిగారు.

* * * * *

సాయంత్రం ఆరున్నర అయింది టైం రాఘవ అరుగు మీద కూర్చుని పిల్లలకి ట్యూషన్స్ చెప్తున్నాడు. సునీత అప్పటికి వచ్చి గంటపైనే దాటింది. కుశల ప్రశ్నలయ్యాక అక్కా చెల్లెళ్ళు కబుర్లల్లోపడ్డారు. ఆచారిగారు మనవడ్ని తీసుకుని అలాషికారుకు బయల్దేరాడు

యేమే సునీతా ఆ బ్రహ్మచారికి యిల్లిచ్చారు

## ఇది కథ కాదు

చూడు ఆ పిల్లలతో యెంతగొడవ చేస్తున్నాడో ఆ ప్రవేటు పిల్లల్ని పెట్టుకుని.

"ఏదో పొట్టకక్కుర్తి. అతను తింటూ వాళ్ళ అమ్మకి కొద్దో గొప్పో పంపించాలి. మనిషి మంచివాడులే. ఎప్పుడైనా సహాయం కావాలంటే హనుమంతుడిలా సేవలు చేస్తాడు. నాన్నకి కూడా ఆ అబ్బాయితో కాలక్షేపం అవుతూంది."

"కాలక్షేపం మాటటుంచు. ఆ పిల్లాడి ప్రవర్తన నాకేం నచ్చలేదు. మాటి మాటికి ఆ నిలువు గుడ్లేసుకుని యెలా యిటే చూస్తున్నాడు. జాగ్రత్తగా వుండు నువ్వు.".

"నీకు యెవర్ని చూసినా అనుమానమే అక్కా! అవునూ నేను అడగటం మర్చిపోయాను బావ అలవాటు మార్చుకున్నాడా"

సునీత అడిగినదానికి సుజాతకి ఓ క్షణం యేం అర్థం కాలేదు. సునీత మాట్లాడేదాంట్లో రెండర్థాలు వుండేట్టుగా ఓసారి మాట్లాడుతుంది. సునీత యెందుకు అలా అడిగిందో తనకు తెలుసు. పెళ్ళి అయిన కొత్తలో సునీత తన యింటికొచ్చినప్పుడు తను బజార్లోపనివుండి బయటకెళ్ళింది అప్పుడు సునీత ఒక్కర్తే వుంది. తను వెళ్ళగానే ఆయన రావటం. సునీత ఒక్కర్తే వుందనీ వెనక నుంచి వాటేసుకోవటం, సునీత గట్టిగా అరవటం. అప్పుడే తను రావటంతో ఆ సీన్ అక్కడితో కట్ అయ్యింది. లేకపోతే భర్త తన చెల్లెల్ని యేం చేసేవాడో యీ రోజుకి వూహకందటంలేదు. కాని ఆ రోజు రాత్రంతా సునీత తన దగ్గరే పడుకుని ఒకటే యేడుపు. తను యెంత వోదార్చినాతన యేడుపు మానలేదు. ఆఖరికి తను కూడా యేడ్చేసింది. అలా యిద్దరూ యెంత సేపు యేడ్చారో తమకే తెలియదు. ఆ మర్నాడు మాట వరసకి భర్త ముందు "యేమే మీ బావగారు నీతో చిన్న సరసానికి పోతే అంత గట్టిగా అరవాలా" అని అంది. కాని చెల్లెలు అప్పుడు యేం మాట్లాడలేదు. భర్త కూడా ఆ రోజంతా తప్పు చేసినవాడిలా తలయెత్తలేదు ఆ రోజే సునీత బయల్దేరి వచ్చేసింది. కనీసం స్టేషన్‌కి కూడా రాలేదు. తన భర్త.

"ఏం అలవాటే" బియ్యం కడుగుతున్నదల్లా ఒక్కసారి గతం గుర్తుకువచ్చి చెల్లెల్ని అడిగింది సుజాత.

"అదే ఆ మధ్య సిగరెట్లు మానేస్తున్నారు అని చెప్పావుకదా... మానేసారా లేదాని అడుగుతున్నాను."

ఎంతకైనా చెల్లెలు అంత త్వరగా మాట్లాడిన విషయం గురించి బయటపడదు. ఏదైనా క్లిష్టమైందిగా అడిగేటప్పుడు యెదుటి వాళ్ళ వూహకి రెండో జాబు తనదగ్గర వుంచుకుంటుంది. అది చిన్నప్పట్నుంచి దానికలవాటు. మనసులో మెచ్చుకున్నా అసలు సంగతి చెప్పనందుకు నొచ్చుకుంది సుజాత.

---

పాఠకులకో సవాల్!




– మరీ యింత బరువైతే నే మోయలేను కొంచెం తగ్గించాలి!

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి– ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలేగాని బాధించకూడదు. రసభరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్ట వచ్చినట్లుండరాదు... కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం. ప్రచురించిన రెంటికి రు. 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది!– ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం. సంచిక విడుదలైన వారంలో గా పంపాలి. మర్చిపోకండి. –సం.

చాలా మంది వెంటనే "రిపార్టీ"ల వర్షం కురిపించారు. కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం. బహుమతులు పొందిన రెండూకాక– మరికొన్ని యిక్కడ వేశాము. తతిమ్మా వారి "వాగ్బాణాలు" స్థలాభావం చేత వేయలేకపోయాం. లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహ పడక మళ్ళీ ప్రయత్నించండి! సం.

"దేవుడనేవాడుంటే తీర్థం, ప్రసాదం పుచ్చుకోడేం?"

★ రు. 25 బహుమతి పొందిన రిపార్టీ.

**ఆ దేవుడువేరు అలా 'గవర్నమెంట్ ఆఫీసుకి' దయచెయ్!**

– ఏ. వి. ఆర్. ప్రసాద్ (నెల్లూరు)

★ రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:

**డైరెక్టుగా తినడు నాయనా! భక్తుల రూపంలో కొంత, గుళ్ళ ధర్మకర్తల రూపంలో మరికొంత అరగిస్తాడు!**

– పి. శ్రీదేవి (కడప)

### మరికొన్ని వాగ్బాణాలు

"గుళ్లో పెడితే ఎలా తింటాడు బ్రదర్!" –వై. దుశ్శల (శ్రీకాకుళం)

"పూజార్ల పొట్ట కొట్టడం యిష్టంలేక!" –వర్ధినీడి సురేష్‌బాబు (పాలకొల్లు)

"వద్దు బాబోయ్ యింక మనకేం మిగలవ్" -పోలోజు వెంకటాచారి (బోడుప్పల్)

లక్కీ పేర్లు :—బి. శ్రీనివాసరావు (ద్రాక్షారామ), సోమయాజుల సోదరులు (హైదరాబాద్), ఎస్. టి. పి. రామకృష్ణ (భీమవరం), టి. పుష్పలత (విజయవాడ), కె. జనార్ధన్ (బుచ్చిరెడ్డి పాలెం), సి. హెచ్. సుబ్రమణ్యం (అంగలకుదురు), ఎస్. శ్రీనివాసమూర్తి (నెల్లూరు), పి. మురళి (వరంగల్), ఆర్. విజయలక్ష్మి (విశాఖ పట్టణం), ఎ. హరిబాబు (గూడూరు), పి. గోపాలకృష్ణ (చెన్నూరు), బి. అరుంధతి (ఎమ్మిగనూరు), జి. వెంకట రమణ (హైదరాబాద్), సి. హెచ్. ప్రకాష్ (విజయవాడ)

## ఇది కథ కాదు

అలా ఆ రాత్రి వరకూ కులాసాగా గడిచింది యింట్లో. రాత్రి భోజనాలప్పుడు–

"నాన్నా! ఆయన మళ్ళీ ఓ పది అడిగి తీసుకు రమ్మన్నారు" సుజాత మెల్లగా గొణిగింది. అన్నం అసలు యెక్కటంలేదు తనకి అలాగే మెతుకులు కెలుకుతూంది.

ఆచారిగారు ఒక్కసారి ఆశ్చర్యపోలేదు. తను వూహించేదే జరిగింది. కాకపోతే తను అయిదను కున్నాడు. కూతురు పదడుగుతోంది. సునీత ముద్ద పెట్టుకోబోతున్నదల్లా ముద్ద మింగుడు పడక అక్క మాటకి పాలపోయింది. సుజాత చెల్లెలి నెత్తిన మెల్లిగా మీటింది.

ఆచారిగారు యేం సమాధానం చెప్పలేదు. ఒక రూపాయా? అయిదు రూపాయలా? పదివేలు. ఇవ్వకపోతే ఓ గొడవ. ఇస్తే మళ్ళీ తనకేగొడవ యేం అర్థం కావటంలేదు. అన్నం సయించటంలేదు అలానే మెతుకులు కతికి లేచాడు.

"నా దగ్గరా యేం లేవమ్మా! ఎక్కడైనా ప్రయత్నిస్తా" అన్నాడు నెమ్మదిగా

ఆ మాటకి సుజాతకి కళ్ళవెంట నీళ్ళు ఆగలేదు. యేడుపు ఆపుకోవటానికన్నట్లు చీరకొంగు అడ్డుపెట్టుకుంది చెల్లెలు ఓదారుస్తూంది.

"నాన్నా! నేను యీ సంఘర్షణని భరించలేను. నాకు విడాకులు యేర్పాటు చెయ్యండి నాన్నా!" సుజాత వెక్కి వెక్కి యేడుస్తూంది. సునీత చేయి కడుక్కొని అక్కని పొదివి పట్టుకుంది. ఆచారిగారు కూడా కూతుర్ని ఓదార్చటాని కన్నట్లు దగ్గిర వచ్చారు. తండ్రి గుండెల మీద పడి బావురుమంటూ యేడ్చింది. ఆచారిగార్కి కూడా కళ్ళ నీళ్ళు ఆగలేదు. తను యేం చేయలేని స్థితి. అసహాయస్థితి.

"బాధపడకమ్మా! ఏదోలా చేద్దాంలే. బాధపడకు. డబ్బులు యెలాగో అలాగ సర్ది పంపిస్తాను నువ్వు సుఖంగా వుండటమే నేను చూడాల్సింది. ఇప్పుడే మయింది అంత యేడుస్తున్నావు. మా వంట్లో రక్తం వున్నంత వరకూ మా సహాయం మీకుంటుంది దిగులుపడకు."

"అవునక్కా భయంలేదు. డబ్బులు యిచ్చేపూచి నాది." చెల్లెలు సునీత కూడా అక్కకి ధైర్యం చెప్పింది.

సుజాత అలా వెక్కిళ్ళ మధ్య యెంతసేపు యేడ్చిందో తనకేతెలియదు.

* * * * * * *

"అమ్మా సునీతా డబ్బుల ప్రయత్నం యేమన్నా ఫలించిందా" అడిగాడు ఆచారిగారు.

"లేదు నాన్నా!" నాలుగువేలే దొరికాయి.

"మరి యెలా" ఆ మాటలో కూతురి సంసారం పాడయిపోతుందనో లేక పేపర్లో యే వార్త తను చదవకూడదో అదే తన కూతురి గురించి చదువుతానని భయమో ఆ వొక్క ప్రశ్న పదిప్రశ్నల్లా అనిపించింది సునీతకి.

"ఏం చెయ్యలేం నాన్నా! ప్రస్తుత పరిస్థితుల్లో ఆ నాలుగువేలూ నా మెడలో వున్న మూడు తులాల గొలుసు యిచ్చేస్తాను.

"గొలుసు యిచ్చేస్తావా" అని మరో సమయంలో అడిగేవారు. అది తన భార్యది తను పంచిన నగలలో అది చిన్నమ్మాయికి వచ్చింది. కాని అది యీ రోజు పెద్దమ్మాయికే చెందుతుంది ఇంక సునీత మెడ బోసిగానే వుంటుంది. తను చూసి భరించాలి. ఏం చెయ్యలేడు. భగవాన్ యిటువంటి కష్టం యెవరికీ రాకూడదు. మనసులో మూగగా రోదించాడు.

"సరే నీ యిష్టం." అని పైకి మాత్రం అన్నాడు. అంతకంటే తను యేం అనగలడు వయసయి పోయింది. ఇంకొకరి మీద ఆధారపడి బ్రతుకు తున్నాడు. పెళ్ళి చెయ్యాల్సిన కూతుర్నుంచి తను భుక్తి పొందుతున్నాడు. ఎంత విచిత్రం. అదే కూతురు తన అక్క మొగుడి కోర్కెను తీరుస్తుంది. "అమ్మా సుజాతా యిది గొప్పతనం కాదమ్మా! అది యేవన్నా వుంటే మీ చెల్లెల్ది. దానికి మనం చిన్నదైనా దణ్ణం పెట్టాలి" మనసులో అనుకుంటున్నట్లుగా గొణుక్కున్నాడు ఆచారిగారు.

ఆ రోజు రాత్రి ఆచారిగార్కి, యింట్లో యెవరికీ నిద్రపట్టలేదు. తెల్లారితే ఆదివారం. సుజాత ప్రొద్దున ట్రైన్‌కు బయల్దేరుతానంది. ఆచారిగారు కాదనలేదు. కూతురు సుఖంగా వుండటమే తనక్కావాలి.

ప్రొద్దున్న–

"అక్కయ్యా! యిదిగో డబ్బు" అంటూ సునీత కొంత డబ్బుని, గొలుసుని అక్కయ్య చేతికందించింది.

సుజాతకి అర్థం అయ్యింది. డబ్బులు అందు బాటుకు రాలేదని. అవును యెక్కడ తీసుకొస్తారు వాళ్ళుమాత్రం. తన సంసారం నిలబెట్టడం గురించి తన చెల్లెలు తన గొలుసుని కూడా యిచ్చేసింది. యింత దుర్భరస్థితి యేస్త్రీకి వద్దు. తీసుకోలేక తీసుకుంటున్నట్లు పెదవుల మధ్య యేడుపును ఆపుకుంటూ పెట్లో పెట్టుకుంది సుజాత.

ట్రైన్ బయల్దేరి వెళ్ళే వరకూ అందరికీ భారంగా గడిచాయి క్షణాలు, నిమిషాలు.

* * * * * *

సుజాత మర్నాడే తిరిగి తండ్రి దగ్గరకు వచ్చేసింది.

"ఏమ్మా! డబ్బులు చాలలేదా" అడిగారు.

సుజాత మాట్లాడలేదు. "ఏమయింది అక్కయ్యా!" అడిగింది సునీత.

సుజాత సమాధానం చెప్పలేదు. సునీత అక్క చేతిలో బాబుని తీసుకుని ఎత్తుకుంది. ఆచారి గార్కి కంగారుగా వుంది.

"ఏమయ్యింది చెప్పమ్మా!" వణుకుతున్న కంఠంతో అడిగారు

సుజాత పెట్టె తీసి డబ్బులు, నగ తీసి తండ్రికిచ్చేసింది.

"నాన్నా! అసలు ఆయన దగ్గరకే వెళ్ళలేదు. నేను ఆయన్ని వదిలేయాలని అనుకుంటున్నా నేను తీసుకున్న నిర్ణయం యిది. మీకు అభ్యంతరం అయితే చెప్పండి నేను యిక్కణ్నుంచి వెళ్ళి పోతాను. నా పొట్ట నేను పోషించుకుంటూ నా కొడుకును చదివించుకోగలను మనిషి మనసుంచు కుని మాటిమాటికి చచ్చేకంటే ఒకసారి మనసును చంపుకోవటం వుత్తమం. మీరు విడాకులకు యేర్పాటు చేయండి" అంటూ లోపలికి వెళ్ళి పోయింది.

ఆచారిగారు, సునీత ఓ క్షణం అలాగే వుండి పోయారు. ఏడ్వాలో, సంబరపడాలో తెలియని పరిస్థితి.

పశ్చిమాన ఎర్రటి సూర్యుడు నవ్వుతూన్నట్లుగా క్రిందకు దిగుతున్నాడు. అప్పుడే వచ్చిన రాఘవ వరండాలో లైటు వేశాడు.

"ఇలా చీకట్లో నించుండిపోయారేం"

"లేదు నువ్వు లైటు వెయ్యకముందే వెలుగొచ్చింది యింటికి" అన్నారు ఆచారిగారు.

రాఘవకి ఆ మాటలలో అర్థం గోచరించలేదు. ●



# విద్యార్థులలో అశాంతి ఎందుకు?

## మరెవ్వరో మధ్యలో.....

**త**ల్లి, తండ్రి, గురువు ఈ ముగ్గురికన్నా విద్యార్థి యోగ క్షేమాల్ని గురించి బాగా ఆలోచించే వారెవరున్నారు?

దురదృష్టవశాత్తు నేటి విద్యార్థి ఈ ముగ్గురి చేతుల్ని దాటి మరెవరి చేతనో మలచబడుతున్నాడు. ఆ వ్యక్తులకు తమ స్వార్థమే గాని విద్యార్థి అభివృద్ధితో యేం పని. వారు మొదట్లో ఈతడి అభివృద్ధి కోసం అంతా తామే చేస్తామన్నట్లు నటిస్తారు. విద్యార్థి కూడ ముందు నమ్ముతాడు కాని, తరవాత క్రమంగా అది సడలిపోతుంది. నేటి విద్యార్థికి తల్లి, తండ్రి, గురువులమీద విశ్వాసం కుదరటం లేదు. అలాంటప్పుడు అశాంతికాక నేటి విద్యార్థికి యేం మిగులుతుంది" అన్నారు శ్రీ గుండవరపు ప్రజాపతిరావుగారు.

శ్రీ ప్రజాపతిరావుగారు దాదాపు మూడు దశాబ్దాల పైచిలుకుగా అధ్యాపకులుగా వివిధ స్థాయిల్లో బాధ్యతలు నిర్వహించి ప్రస్తుతం శాతవాహన కళాశాల ప్రిన్సిపాల్‌గా వున్నారు. విద్యా సంస్థల నిర్మాణంలో, నిర్వహణలో విశేషానుభవం గడించిన వీరిని ఈమధ్య కలసినప్పుడు విద్యార్థులకు సంబంధించిన అనేక విషయాలు ప్రస్తావన కొచ్చాయి.

## పూర్వకాలం : ఈ కాలం

"మాష్టారూ! 1958-59 సంవత్సరంలో నేను మీ విద్యార్థిని! మిమ్మల్ని ఒకమాట అడగాలని వుంది. నాటి విద్యార్థుల్లో అశాంతికి, నేటి విద్యార్థుల్లో అశాంతికి మీకు తేడా ఏమన్నా కనిపిస్తున్నదా!" అన్నాను.

యధార్థానికి "విద్యార్థుల్లో అశాంతి నేటిది కాదు. కాకపోతే ఇప్పుడది ప్రబలింది" అన్నారు.

"పూర్వం కూడ విద్యార్థుల్లో అశాంతి వుండేదని



శాతవాహన కళాశాల ప్రిన్సిపాల్

## 'మనోనిగ్రహం పెంపొందించే విద్య కావాలి'

మీరే చెబుతున్నారు కనుక ఏమీ అనుకోకపోతే నాకు తోచిన ఒక తేడా చెబుతాను. ఆ రోజుల్లో విద్యార్థుల అశాంతి, వాళ్ల ఉపాధ్యాయుల దగ్గరకుపోతే తొలగిపోయేది. నేటి విద్యార్థులు ఉపాధ్యాయుల కంతగా చేరువ కావటం లేదు. ఎవరైనా అలాటి విద్యార్థులున్నా వారి అశాంతిని తొలగించే స్థితిలో ఉపాధ్యాయుల్లేరు. విద్యార్థిది తెలిసీ తెలియని వయస్సు, అనేకమైన అనుమానాలు, ఆసక్తులు, భయాలు! వీటిని తల్లి దండ్రుల దగ్గర చెప్పలేడు, తోటి విద్యార్థులు తీర్చలేరు. తనకు సమస్య వచ్చినపుడు ఉపాధ్యాయుడి సలహా స్వీకరించాలనే అభిప్రాయం విద్యార్థికి కలగాలి. ఉపాధ్యాయుడు ఆ సమస్యను పరిష్కరించి విద్యార్థికి మార్గదర్శకుడుగా నిలవాలి. ఈ పరిస్థితి లేకపోవటమే "నేటి విద్యార్థి అశాంతికి ముఖ్య కారణం" అన్నారు.

'విద్యార్థుల అశాంతికి తల్లి దండ్రులు యెంతవరకు బాధ్యులు?" అన్నప్పుడు వారు చాలా ముఖ్యమైన విషయం చెప్పారు'

## తల్లిదండ్రులు

"తల్లిదండ్రులు చాలా వరకు బాధ్యులు. గాంధీగారు తల్లి మాట మీద గౌరవంతో ఇంగ్లాండులో మద్య మాంసాల్ని ముట్టలేదు. అలాంటి గౌరవాలు ఇప్పుడు తగ్గిపోయాయి. తల్లి దండ్రులకు సంతానానికి ప్రేమాను బంధాలు సడలిపోతున్నాయి. విద్యార్థులకు ప్రేమ కరువయి పోతున్నది. ఇది చాలదా! విద్యార్థుల్లో అశాంతి ప్రబలటానికి".

"మీరు బహుకాలంగా ఎన్నో పాఠ్య ప్రణాళికలు చూస్తున్నారుగదా! వీటిక నేటి విద్యార్థి లోకంలో అశాంతికి ఏమైనా సంబంధం వుందంటారా?" అన్నాను.

శ్రీ ప్రజాపతిరావుగారు సాలోచనగా సిలబస్ గురించా! మనోనిగ్రహం, వికాసం, సంస్కారం, క్రమశిక్షణ పెంపొందించే విషయాలు పాఠ్య ప్రణాళికలలో ఏమున్నాయి? పోనీ ఈ చదువు జీవనోపాధికి పనికివస్తుందా? వుద్యోగాలు దొరకటంలేదు. ఇవన్నీ విద్యార్థుల్లో అశాంతికి కారణాలే" అన్నారు.

నేటి విద్యార్థుల అశాంతికి పరిష్కారాలు సూచిస్తూ, "మనోనిగ్రహం, వికాసం, పెంచే పాఠ్యప్రణాళికలు వుండాలి. తల్లి, తండ్రి, గురువు, విద్యార్థి పూర్తి బాధ్యతను వహిస్తూ, కంచెలాగా ఇతరశక్తుల్నించి రక్షిస్తూ, అతని భావిజీవితాన్ని తీర్చిదిద్దాలి అప్పుడే శాంతి, సౌఖ్యం" అని వివరించారు శ్రీ ప్రజాపతిరావుగారు.

ఇలాంటి పెద్దల అనుభవాలను యువ అధ్యాపకులు, విద్యార్థులు, ప్రభుత్వ వర్గాలు, వినియోగించుకుంటే విద్యాలోకం సుందరంగా శాంతినందనంగా మారుతుంది, అంటే అతిశయోక్తేముంది. (పి. వి. కె.)

సీరియల్

# మైథిలి

కుందుర్తి ఇందిరా దేవి



(గత సంచిక తరువాయి)

కారు దిగి ఇంట్లోకి వచ్చారు మైథిలి, రజని

'ఇంత ఆలస్యం అయిందేమిటమ్మా" గౌరమ్మ వచ్చింది

'చూడు మనింటికి స్నేహితుడు వచ్చాడు పది నిముషాల్లో డైనింగ్‌టేబిల్‌మీద అన్నీ రెడీ చేశావంటే నువ్వు చాలా మంచి గౌరమ్మ వన్నమాట "

మైథిలిలో కొత్త ఉత్సాహం చూసి గౌరమ్మ ఆశ్చర్యపడుతూ "అలాగేనమ్మా" అంది

"మున్నీ మైథిలి పిలిచేలోపే గాలిలా వచ్చేసింది మున్నీ

"మమ్మీ! ఇంత ఆలస్యం చేశావేం? నాకు చాలా ఆకలివేస్తోంది" మెడకు చేతులువేసి గారంగా అంది

మైథిలి విడిపించుకుంటూ "మనింటికి కొత్త అంకుల్ వచ్చాడు చూడు" అంది

"అంకులా! మురళీ అంకుల్ తప్పితే ఇంకెవరున్నారు!" ఆశ్చర్యంగా తిరిగి చూసింది

సోఫాలో కూర్చున్న రజనీకాంత్ కుతూహలంగా చూస్తున్నాడు

"ఆయన రజనీకాంత్ అంకుల్. ఇంజనీర్' అని 'ఇదిగో నా పుత్రికారత్నం" అంది

"నమస్తే అంకుల్" మున్నీ ఏమాత్రం సిగ్గుపడకుండా చేతిలో పుస్తకంతో సహా హస్తద్వయం జోడించింది

తన కెలా పలకరించాలో తెలియనట్టు అతను ఒక్క క్షణం సందిగ్ధంగా చూసి దగ్గరికి రమ్మనట్టు చూశాడు

మున్నీ వెళ్ళి టీపాయ్‌మీద అతని కెదురుగా కూర్చుంది.

అతను చేయి చాచి "గ్లాడ్ టు సీయూ మున్నీ" అన్నాడు

మున్నీ సంకోచంగా తన చేయి అందించింది.

"గుడ్ గళ్ "

మైథిలి సోఫాలో కూర్చుని వాళ్ళిద్దరినీ చూస్తోంది

రజని శ్రద్ధగా మున్నీని ఏవేవో ప్రశ్నలు వేస్తున్నాడు ఆమె స్టడీస్‌గురించి మున్నీ తడుముకోకుండా హుషారుగా ఆన్సర్స్ చెబుతోంది.

'గుడ్! నీకులా కాదు. చాలా తెలివైంది" నవ్వుతూ అన్నాడు

మైథిలి నవ్వింది ఆ నవ్వులో దాగిన గర్వం, మురిపెం అతను పసికట్టాడు

"ఒక్క కళ్ళు మినహా కంప్లీట్‌గా మోహన్ నోట్లో నుండి ఊడిపడ్డట్లే వుంది. రంగుతో సహా" రజని ఆశ్చర్యంగా అన్నాడు "ఆ మాటలు, నవ్వూ, హుషారు.

"అది వాళ్ళ నాన్నే పూర్తిగా" నవ్వింది. "మున్నీ కాఫీ తీసుకురా" అని కూతుర్ని పంపించింది.

"నాళ్ళ నాన్నే అని అనటం స్త్రీకి పుట్టుకతోనే వస్తుందా!" నవ్వుకున్నాడు

"నాకు ఒకటే ఆశ్చర్యం" అన్నాడు

"ఏమిటి?" అడిగింది మైథిలి

"నాకు బాగా గుర్తుంది ఒకరోజు నువ్వు కడుపుతో వున్నప్పుడు ఏడుస్తూ "నాకీ బిడ్డ వద్దు. నేను మోయలేను" అని బాధపడ్డావు. అటువంటిది పాప నెలా కన్నావు? ఎలా పెంచావు?"

"తిలక్ ఏమన్నాడో తెలుసా?"

"స్వరాజ్యం నా జన్మహక్కు."

మైథిలి ఫకాల్న నవ్వింది.

కాఫీ తెచ్చిన మున్నీ ఆశ్చర్యపోయింది తల్లి అలా పెద్దగా నవ్వటం ఆ అమ్మాయి ఎప్పుడూ చూడలేదు.

తెల్లబోయి చూస్తున్న రజనితో "లోకమాన్య కాదు దేవరకొండ బాలగంగాధర తిలక్" అంది

"ఏమన్నాడు?" కుతూహలంగా అడిగాడు

"ఆకతాయి మొగుడైనా ఆ వెధవ ప్రతిబింబాన్ని ఆప్యాయంగా కడుపులో మోసే స్త్రీ" మైథిలి మళ్ళీ నవ్వింది "ఇది భారతదేశం రజనీ "

రజని అలా నవ్వుతున్న మైథిలిని అభిమానంగా చూశాడు.

ఆ కబుర్లూ, ఈ కబుర్లూ దొర్లిపోయాక లేచి ముగ్గురు భోజనం చేశారు

"చాలా రోజుల తర్వాత ఈ రోజు తృప్తిగా తిన్నాను మధూ" అని రజని అంటుంటే మైథిలి కళ్ళు చెమ్మగిల్లినయి

ఆ పిలుపునుబట్టి వాళ్ళిద్దరికీ బాగా పరిచయమని గ్రహించింది మున్నీ

మైథిలి యిచ్చిన వక్కపొడి వేసుకుంటూ "తండ్రి లేకుండా కూతుర్ని పెంచటం ఆడవాళ్ళకి కష్టం కాదనుకుంటాను నేను చూడు ' అన్నాడు నిట్టూర్చి

మైథిలి ముఖంలో క్షణంసేపు విషాద రేఖ కదిలింది.

"ఆడవాళ్ళకే చాలా కష్టాలు రజనీ దాన్ని నేను పట్టుపరుపులమీద, ఎయిర్‌కండిషన్ రూమ్‌లోనూ పెంచలేకపోయినా, అపురూపంగా చూశాను తండ్రిపరంగా దాని కేమీ ప్రేమాభిమానాలు సంక్రమించకపోవచ్చు ఆస్తిపాస్తులు లభించకపోవచ్చు, కానీ నా నిశ్చలమైన ప్రేమతో పుట్టి, సత్యమనే హద్దుల్లో పెరిగిన నా మున్నీకి, ప్రేమాభిమానాలు, నీతి- నిజాయితీలని మించిన అండతప్ప, తల్లిగా నే నేమీ యివ్వలేకపోవచ్చు. వాటివల్లే దానిజీవితం ఫల పుష్పభరితమైన వసంతంలా కళకళ్ళాడుతుందని నా ఆశ."

రజని ఆనందంగా చిరునవ్వుతో అన్నాడు "ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళిపోయిం తర్వాత ఎప్పుడూ నీ గురించే ఆలోచించేవాడిని మధూ. నువ్వు మోహన్‌తో రాజీపడిపోయి నిర్లిప్తంగా బ్రతుకుతున్నావని తో చినప్పుడల్లా విలవిల్లాడిపోయేవాడిని కానీ..." గోడమీద వున్న విద్యాపతి ఫొటో చూస్తూ "ఆయన దయవల్లే నువ్విలా వ్యక్తిత్వం గల స్త్రీగా రూపొంది, సంఘంలో తలెత్తుకుతిరుగుతున్నావు. చాలా సంతోషంగా వుంది మధూ" అన్నాడు.

వెళ్ళి మున్నీకి గుడ్‌నైట్ చెప్పి కారెక్కాడు. మైథిలి చెయ్యి వూపుతూ "గుడ్‌నైట్" చెప్పింది.

ఇన్ని సంవత్సరాల తర్వాత అనుకోకుండా తారసపడిన రజని తన జీవనవిధానాన్నే మార్చివేయబోతున్నాడని ఆ క్షణంలో మైథిలికి తెలియదు.

★ ★ ★

సంవత్సరాలుగా బీడుపడిన హృదయం స్నేహమనే వానజల్లుకి తడిసి తిరిగి పచ్చబడింది.

ఫ్రీక్వెంట్‌గా వచ్చిపోతుండే రజని, మైథిలి జీవితంలో ఒంటరితనాన్ని మెల్లమెల్లగా

**జరిగిన కథ- 10:** బంధువులమ్మాయితో సన్నిహితంగా వుండే మోహన్‌ను పెండ్లాడుతుంది మైథిలి. లంచాలకు అలవాటుపడి ఉద్యోగం పోగొట్టుకుని బిజినెస్‌లోకి దిగుతాడు మోహన్. మైథిలి ఒక పాపకు తల్లి అవుతుంది. ఒక విధవను మోహన్ రిజిస్టర్ మారేజ్ చేసుకున్నాడని తెలిసి మానసిక వ్యథకు గురైన మైథిలిని విద్యాపతి హైదరాబాద్ తీసుకు వెళ్ళాడు. అక్కడ ఎం. ఎ. ప్యాసై ఉద్యోగంలో చేరుతుంది. అనుకోకుండా చాలా ఏళ్ళ తర్వాత ఒక రోజు బిర్లామందిర్‌లో తన చిన్ననాటి స్నేహితుడు రజనీకాంత్ కలుస్తాడు.

మాయంచేయసాగాడు

ఇక మున్నీకయితే ఆటవిడుపే. అదివరకు ఇల్లు, స్నేహితులు తప్ప వేరే ప్రపంచం తెలీదు ఇప్పుడు మరో ప్రపంచానికి దారులు తెరుచుకున్నట్టుంది

ఆదివారాలు వస్తే సినిమాలు, పార్కులు, హోటల్స్‌లో సరదాగా ఐస్‌క్రీమ్ తినడం, ఊళ్ళోజరిగే క్రికెట్ మాచ్‌లు, రవీంద్రభారతిలో నాటకాలు, డ్యాన్స్ ప్రోగ్రామ్స్ ఒకటేమిటి ఇదివరకు వేటికోసమైతే ముఖం వాచిపోయిందో, ఇప్పుడవన్నీ అతి ఈజీగా తీరిపోతున్నాయి

వాళ్ళతో అన్నింటికి వెళ్ళకపోయినా, అప్పుడప్పుడు తనూ కలుస్తుంటుంది మైథిలి లేకపోతే మున్నీ వూరుకోదు

డ్రైవింగ్ నేర్చుకుంటానని మున్నీ మొండిపట్టు పడితే మైథిలి చివాట్లేసింది.

ముఖం ముడుచుకున్న మున్నీ గడ్డంపుచ్చుకుని రజని అనునయించాడు "నువ్వు టెన్త్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయినప్పుడు తప్పకుండా నేర్పుతాను ఓ.కే"

మున్నీ ఒప్పుకుంది బయట ప్రపంచంలోనే కాదు, ఇంట్లో కూడా అతను మున్నీతో సరదాగా క్యారమ్స్ దగ్గర్నుండి చైనీస్ చెక్కర్ దాకా ఆడుతాడు

టి వి. ప్రోగ్రామ్ చూడ్డానికి రిక్షాలో రజనీకాంత్ ఇంటికి వెడుతుంది తర్వాత అతనేవచ్చి కార్లో డ్రాప్‌చేస్తాడు

మున్నీ ఏది కోరితే అది కామిక్స్ నుండి బట్టల దాకా కొనిపెడతాడు

నెలరోజులు తిరక్కుండానే యిద్దరూ ఒకరికొకరు ప్రాణం అయిపోయి అలా ఆనందంగా తిరుగుతుంటే మైథిలి ముచ్చటగా చూస్తుండిపోయింది

అతను కూతుర్ని ఎలా గారాబం చేసినా మైథిలి అడ్డుచెప్పలేదు జీవితంలో అనుకోకుండా లభిస్తున్న ఈ ఆప్యాయతలు, మమకారాలు కూతురికి సంపూర్ణంగా లభించాలనే మనస్ఫూర్తిగా కోరుకుంది



ఇదివరకు లెక్కల్లో చాలా పూర్‌గా వుండే మున్నీకి రజని బాగా తర్ఫీదు ఇస్తున్నాడు.

ఈ ఇంటికి దగ్గిర బంధువైపోయాడు" అని గౌరమ్మ సంబరపడుతుంటే "ఆత్మబంధువే దొరికాడని మైథిలి తృప్తిపడింది "

ఒక రోజు గౌరమ్మ ఇరుగు– పొరుగు చెవులు కొరుక్కుంటున్నారని బాధపడితే మైథిలి నవ్వుతూ కొట్టిపారేసింది.

నీటిబొట్టు విలువేమిటో ఎడారికే తెలుస్తుంది

* * *

మైథిలి అరటికాయలు తరుగుతోంది. స్టవ్‌మీద అన్నం వుడుకుతోంది.

రజని ఆ వంట అరుగుమీదే ఒకప్రక్కగా కూర్చుని వూర్లో కబుర్లు చెబుతున్నాడు.

అతను అంతకుముందే వాళ్ళ వూరు వెళ్ళి సరాసరి ఇక్కడికే తిరిగివచ్చాడు వస్తూనే "మధూ భోజనం చెయ్యలేదోయ్" అని మైథిలిని నిద్రలేపేశాడు

మొదట్లో ఒక ఆదివారం అతను ఫోను చేశాడు "ఏమిటి రజనీ?" అని మైథిలి అడిగితే చాలాసేపు నసిగాడు.

కబుర్లు కూడా తెమిలి ఏం మాట్లాడాలో తోచని మైథిలి రజని ఎంతకూ ఫోన్ పెట్టేసెయ్యకుండా నసుగుతుంటే గట్టిగా అడిగింది.

"మధూ నేను... "

"ఊ నువ్వు.. "

ఈ రోజు "

వింటున్నావా?"

చెప్పు .. "

మీ ఇంటికి డిన్నర్‌కి. రానా?"

మైథిలి ఫోన్ పెట్టేసింది. అడగలేనట్టు అడుగుతున్న రజనిమీద కోపం వస్తోంది వంటచేసి పదకొండు గంటలప్పుడు టేబిల్‌మీద అన్నీ సిద్ధంచేసి కూతుర్ని రజనీకాంత్‌కి రమ్మని ఫోన్ చెయ్యమంది

మున్నీ పరిగెత్తి "రజనీ- అంకుల్! వంటయిపోయింది నాకు చాలా ఆకలివేస్తోంది. తొందరగా వచ్చెయ్యండి" అని ఫోన్‌లో చెప్పేసింది

మైథిలి ఫోన్ పెట్టేసినప్పటి నుండి దిగులుగా అలా పడుకుండిపోయిన రజని, మున్నీ ఫోన్‌కాల్ రాగానే అయిదు నిముషాల్లో తయారయి వచ్చేశాడు

మైథిలి జడవేసుకోబోతోంది అప్పుడే. అతన్ని చూడగానే ముడిపెట్టుకుని వడ్డించింది మైథిలి సీరియస్‌గా వుండటంచూసి అతను కంచంలో చెయ్యి పెట్టకుండా "ఎందుకలా వున్నావని" పదేపదే అడిగాడు

"ఏం లేదు" మైథిలి ముక్తసరిగా అంటూ అన్నం కలుపుకుంటోంది

"నువ్వు చెప్పేవరకూ నేను కంచంలో చెయ్యికూడా పెట్టను "

"ఏమిటి మమ్మీ. నిజంగా డల్‌గా వున్నావు" అంది మున్నీ

"మీ అంకుల్ నన్ను హర్ట్ చేశారు "

"నేనా .!" అతడు విస్మయంగా చూశాడు

మైథిలి ఒక్కసారి బరస్టయి "నువ్వే! నువ్వే! మధూ ఈ రోజు భోజనానికి వస్తున్నాను నా కిష్టమైనవి రెడీ చెయ్యి అని చెప్పాల్సిందిపోయి, డిన్నర్‌కి రానా అని పర్మిషన్ అడుగుతావా" అంది.

"అలా అన్నావా అంకుల్" మున్నీ బోలెడు ఆశ్చర్యపోయింది

రజని కళ్ళు చెమ్మగిల్లినయి "సారీ మధూ" అన్నాడు.

ఆ తర్వాత అత నెప్పుడూ అలా ప్రవర్తించలేదు

గబగబా అరటికాయ ముక్కలు వేయించి, ఉప్పు, కారం చల్లి టేబిల్‌మీద పెట్టింది.

"రాత్రి ప్రొద్దుపోయి వచ్చావు. ఆ వేపుడు, జాడీ పచ్చడే గతి" ఆవకాయ వేస్తూ అంది

"చలికాలం ఆవకాయ రుచి కదుటోయ్" రజని నవ్వాడు.

"పెరుగు కొంచెమే వుంది. పాలింకా తోడుకోలేదు

"పెద్దగా ఆకల్లేదు. నువ్వేమీ వర్రీ అవకు "

"మమ్మీ రజనీ అంకుల్ వచ్చారా?" మున్నీ కళ్ళు నులుముకుంటూ వచ్చింది.

"హాయ్ మున్నీ" తన మెడచుట్టూవేసిన మున్నీ చెయ్యి ఆప్యాయంగా తడిమాడు రజనీ.

ఆ చొరవ చూస్తే మోహన్ గుర్తొకొస్తాడు మైథిలికి

"బ్యాగ్‌లో మినప సున్ని, తేగలు వున్నాయి "

"అబ్బబ్బా! అర్ధరాత్రిపూట ఏమిటి" మైథిలి వారించేలోపే డ్రాయింగ్ రూమ్‌లోకి పరిగెత్తి ఎయిర్ బ్యాగ్ తీసుకొచ్చింది

"మున్నీ రేప్రొద్దుట తినచ్చుగా "

రజని సైగచెయ్యడంతో మున్నీ ఏమాత్రం లెఖ్ఖచెయ్యకుండా బ్యాగ్ తెరిచింది.

"ఎప్పుడూ బ్యాగ్‌లో పచ్చళ్ళు, పాడు పెట్టి నన్ను చంపేది అమ్మ. నీ పుణ్యమాని ఇప్పుడాబాధ తప్పింది" రజని చెయ్యికడుక్కోడానికి లేస్తూ అన్నాడు

మైథిలి కంచం తీసి సింక్‌లో పడేస్తుంటే అతను "థ్యాంక్యూ మధూ" అని వెళ్ళిపోయాడు.

మున్నీ మినపసున్ని ఒకచేతో తేగ ఒకచేతో పట్టుకుని టేబిల్‌మీద కూర్చోనుంది

"దాన్ని నువ్వు గారాబంచేసి పాడు చేస్తున్నావు" మైథిలి విసుక్కుంటూ అతనికి వక్కపొడి యిచ్చింది

అతను కుర్చీలో కూర్చుని "దాని కిష్టమనే అమ్మచేత మినప సున్ని చేయించాను" అన్నాడు

మున్నీ తల్లిని చూసి కన్నుగీటింది. మినప సున్ని తినటం అయిపోయి, తేగ నోట్లో పెట్టుకుంది.

"దీనిపనులు, చేష్టలు అన్నీ ఆయన్నే గుర్తుకు తెస్తాయి. మినపసున్నితో సహా..."

మైథిలి పంటిబిగువున అంది.

రజని నవ్వుతూ "జీన్స్..." అన్నాడు.

అతను లేచి బ్యాగ్‌లో లుంగీ తీసుకుంటూ "ఈ రాత్రి నా నిద్ర ఇక్కడే" అన్నాడు.

నిజానికి పర్మిషన్ అడగాల్సింది యిలాటి విషయాల్లోనే

'ఓ. కే. అంకుల్" మున్నీ అరిచేసింది

"చాలా నిద్రవస్తోంది. గుడ్‌నైట్" మున్నీ గదిలో నవారుమంచం వాల్చుకుని పరుపు పరుస్తూ అన్నాడు.

"మరి లేదంకుల్."

"పడుకో నువ్వు" మైథిలి కోప్పడింది.

"పడుకోమ్మా మున్నీ. మీ మమ్మీకి కోపం వస్తే

టి.సుబ్బిరెడ్డి సమర్పించు



జయకృష్ణ మూవీస్

# పాపే మా ప్రాణం



జయకృష్ణ వి.మధుసూదనరావు

ఇద్దరికీ నాలుగు వడ్డిస్తుంది" అన్నాడు పడుకుంటూ. మున్నీ దోమతెర కట్టింది.

మైథిలి లైట్ తీసేసి తలుపులు చేరవేసి వెళ్ళిపోయింది

★ ★ ★

మైథిలి రిక్షా దిగి వెళ్ళబోతుంటే రిక్షారాములు "ఇరవై రూపాయ లివ్వండి అమ్మగారు కూతురికి పానం బాలేదు' అన్నాడు.

మైథిలి ఇరవయి రూపాయ లిచ్చి ఇంట్లోకి వచ్చింది ఈ రోజు ఆఫీస్‌లో పై ఆఫీసర్‌తో మాట్లాడుతూండిపోయేసరికి ఆలస్యమైంది.

అప్పటికి దీపాలు పెట్టేశారు ఇంట్లోకి రాగానే మురళి కనబడ్డాడు

"ఎప్పుడు వచ్చావురా? రాధ కూడా వచ్చిందా? అమ్మ బావుందా? నాన్న ఆరోగ్యం ఎలావుంది?" వస్తూనే ప్రశ్నల వర్షం కురిపించింది

'ఆఫీసు పనిమీద వచ్చాను. అంత ఆలస్యం అయిందేమిటి?" అన్నాడు.

"ఆఫీస్‌లో పనివుండి" 'మున్నీ' అని కేకేసింది

"సినిమాకి వెళ్ళిందటగా ఎవరో రజనీ బాబు తీసికెళ్ళాడంటో ందేమిటి మీ గౌరమ్మ. రజనీ అంటే " మురళి సందేహంగా అడిగాడు.

"మన రజనీయే. ఇప్పు డిక్కడే ఉద్యోగం చేస్తున్నాడు "

గౌరమ్మ కాఫీ తెచ్చింది

"ఇదివరకు నా ప్రాణం తీసేది. రజని వస్తున్నప్పటినుండి నాకు కొస్త తెరిపిగా వుంది" రిలాక్స్‌డ్‌గా వెనక్కివాలి అంది.

మురళి కాఫీ తాగుతూ అక్కనే పరీక్షగా చూస్తున్నాడు. అక్కలో ఏదో మార్పు కనిపిస్తోంది.

అలా కబుర్లు చెప్పుకుంటూ వుండగానే కారు చప్పుడు వినిపించింది

"అబ్బో! కారు కూడా కొన్నా డేమిటి? నన్ను చూస్తే గుర్తుపడతాడా?" మురళి అంటుండగానే మున్నీ గాలిలా దూసుకొచ్చింది

"మమ్మీ! మేము ఇంగ్లీష్ పిక్చర్ చూశాము ఏమిటో తెలుసా? అరే మురళీ మామయ్యా!" మున్నీ మురళి చేతులు పట్టుకుని వూపేసింది. "అమ్మమ్మ రాలేదేం? బాబీని ఎందుకు తేలేదు?"

"అబ్బబ్బా వుండవే! ఇంతకీ రజనీ యేడీ?" మురళి తలతిప్పి చూశాడు.

లోపలికి వచ్చి మురళినే సందేహంగా చూస్తున్న రజని "హలో" అన్నాడు.

"అబ్బ వుండవే మున్నీ. రజనీ నన్ను గుర్తుపట్టావా? ఇదిచూడు" మురళి మున్నీని లాగి ప్రక్కన కూర్చోపెట్టాడు.

మురళి చెవులుపట్టుకుని ఆడిస్తుంది మున్నీ. నెమ్మదస్తుడైన మురళి వేగలేక "అబ్బ రాక్షసి నువ్వు మీ నాన్న అంశవేనే" అంటాడు.

రజని మున్నీని తనప్రక్కన కూచో బెట్టుకున్నాడు.

చెదిరిపోయిన క్రాఫ్ సరిచేసుకుంటూ "నీకు అసలు జంతికలు పెట్టనులే. మామయ్య పెద్దవాడు. ఏడిపించకూడదనే జ్ఞానం లేదు" అన్నాడు బెదిరింపుగా.

అప్పటికే మున్నీ లోపలికి పరిగెత్తి జంతికల పొట్లం పట్టుకొచ్చింది

"చాలా మారిపోయావురా మురళీ, గుర్తుపట్టలేకుండా" జంతికలు నోట్లో వేసుకుంటూ అన్నాడు.

"నవ్వో! సన్నగా వుండేవాడివి. కాస్త లావయ్యావు. పొడా పెరిగింది".

అరగంట తర్వాత భోజనాలు చేసేటప్పుడు మురళి "అమ్మ నిన్ను చూడాలని కలవరిస్తోందే రారాదూ" అన్నాడు.

"సెలవులు చూసుకుని. ."

"నేను వెడతాను మమ్మీ" మున్నీ మురళి చెయ్యి గిల్లుతూ సైగచేసింది.

"అబ్బ" అనబోయి "పోనీ దాన్ని తీసుకువెడతాను. నువ్వు తర్వాత రావచ్చు. దాని కెలాగూ నాలుగు రోజుల్లో క్వార్టర్లీ సెలవులు వస్తాయిగా" అన్నాడు.

"ఇప్పుడు ట్రాన్స్‌ఫర్‌మీద విజయవాడ వచ్చేశాను



## రచయితలకి సూచనలు

ఆంధ్ర సచిత్రవారపత్రికకి పరిశీలనార్థం తమ రచనలని పంపే వారు ఈ కింది సూచనలని గమనించ కోరుతున్నాము

రచనలు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి కాగితానికి రెండు వైపులా రాసి ఉన్న రచనలని పరిశీలించటం జరగదు

పరిశీలనకి పంపే రచనలు కథలైతే 10 అరఠావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది. వ్యాసాలు 3. అరఠావు పేజీలు మించరాదు వ్యాసాలు పంపేవారు వాటికి సంబంధించిన బొమ్మలు లేదా ఫొటోలు జతపరిచి పంపటం అవసరం

రచనలు స్వంత రచనలై ఉండాలి అనువాదాలు, అనుసరణలు, కాపీ రచనలు పంపరాదు ఆ మేరకి రచయిత(త్రి) హామీ పత్రం రాసి సంతకం చేసి రచనతో పాటే పంపాలి

రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే రాసి ఉండాలి వ్రాత ప్రతి మీద రచయిత(త్రి) పూర్తి చిరునామా స్పష్టంగా పిన్‌కోడ్‌తో సహా రాయాలి

కథల పరిశీలనకి 1–2 నెలలు, నవలల పరిశీలనకి కనీసం 6 నెలలు పట్టవచ్చును పరిశీలన అయిన తర్వాత ఏ విషయం ఆయా రచయిత(త్రు)లకి తెలియచేయటం జరుగుతుంది ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపకోరేవారు తమ రచనతో పాటే స్వంత చిరునామా కల, తగినన్ని తపాలా బిళ్ళలు అతికించిన కవరు జత పరచి పంపాలి. లేకపోతే వాటిని తిప్పి పంపటం సాధ్యం కాదు రచనలు తిప్పి పంపే విషయంలో తగిన జాగ్రత్త తీసుకోటం జరుగుతుంది కానీ పోస్టులో పోయే వాటి విషయంలో మేము బాధ్యతని స్వీకరించలేము వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ ఆవకాశం లేదు

రచనలు పంపిన వారు తమ చిరునామా మారిన సందర్భంలో వెంటనే ఆ విషయాన్ని మా కార్యాలయానికి తెలియ చేస్తూ ఒక కార్డు రాయటం అవసరం

ఉత్తరాలు, తదితర పాఠకుల శీర్షికలకి రాసే వారు కూడా తమ పేరు, పూర్తి చిరునామా ఇవ్వాలి. రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే ఉండాలి లేకపోతే వాటిని పరిశీలించటం జరగదు.

పరిశీలనకి పంపే రచనలని "సంపాదకుడు, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003" అనే చిరునామాకి పంపాలి కవరు పైభాగంలో శీర్షిక పేరు రాయటం మంచిది. – సంపాదకుడు

# 'రెయిన్‌మాన్' ఉత్తమ చిత్రం!

ప్రపంచ చలనచిత్రరంగంలో అత్యంత ప్రతిష్ఠాత్మకమైన ఉత్తమ చిత్రంగా ఆస్కార్ అవార్డు 'రెయిన్‌మాన్' చిత్రానికి లభించింది

ఈ చిత్రంలో నటించి ప్రశంసలు పొందిన డస్టిన్ హాఫ్‌మాన్ ఉత్తమ నటుడిగా ఈ అవార్డు అందుకున్నారు

'ది ఎక్యూజ్‌డ్' చిత్రంలో నటించిన జోడీ ఫాస్టర్ ఉత్తమ నటిగా ఈ అవార్డు చేజిక్కించుకుంది

'రెయిన్‌మాన్' చిత్ర దర్శకుడు బారీలెవిన్సన్‌కు



డస్టిన్ హాఫ్‌మన్
(ఉత్తమనటుడు)

ఉత్తమ దర్శకుడిగా ఆస్కార్ అవార్డు లభించింది.

ఉత్తమ నటుడు, ఉత్తమ చిత్రం, ఉత్తమ దర్శకుడు, ఉత్తమ స్క్రీన్‌ప్లే అవార్డులు ఈ 'రెయిన్‌మాన్' చిత్రానికి అందజేయబడినాయి

గత ఏడాది 9 అవార్డులతో 'ది లాస్ట్ ఎంపరర్' చిత్రం ఆస్కార్ అవార్డు కొట్టేసింది



జోడీ ఫాస్టర్
(ఉత్తమనటి)

డస్టిన్ హాఫ్‌మన్‌కు ఆస్కార్ అవార్డు లభించడం యిది రెండవసారి. పదేళ్ళ క్రితం "క్రామర్ వర్సెస్ క్రామర్" (1979) చిత్రంలో అత్యద్భుతంగా నటించి మొట్టమొదటి ఆస్కార్ అవార్డును హాఫ్‌మన్ గెలుపొందాడు.

'ఎ ఫిష్ కాల్డ్ వాండా' చిత్రంలో నటించిన కెవిన్‌క్లిన్ ఉత్తమ సహాయ నటుడిగాను, 'ది యాక్సిడెంటల్ టూరిస్ట్' చిత్రంలో నటించిన గీనాడేవిస్ ఉత్తమ సహాయ నటిగాను ఈ అవార్డులు గెలుచుకున్నారు

కార్టూన్ చిత్రం "హూ ఫ్రేమ్‌డ్ రోజర్ రాబిట్'కు మూడు అవార్డులు లభించాయి

'మిస్సిసిపీ బర్నింగ్'కు సినిమాటోగ్రఫీ అవార్డు లభించింది

కళా దర్శకత్వంలో 'డేంజరస్ లైజాన్స్'కు ఆస్కార్



బారీ లెవిన్సన్
(ఉత్తమ దర్శకుడు)

అవార్డు వచ్చింది.

ఉత్తమ ధ్వనికి 'బర్డ్' చిత్రం, 'మిల్‌వగ్రో బెన్‌ఫీల్డు వార్' చిత్రానికి సంగీతం సమకూర్చిన దేవ్‌గ్రూసిన్, 'వర్కింగ్ గర్ల్' చిత్రంలో 'లెట్ ది రివర్ రన్' ఉత్తమ పాటగా ఆస్కార్ అవార్డులను దక్కించుకున్నాయి.

– తిలక్

అభ్యంతరం ఏమిటి?"

"దాని కీమధ్య చదువు తప్ప మిగతా యాక్టివిటీస్ ఎక్కువైనయి ఇలాఅయితే అది టెన్త్ గట్టెక్కినట్టే."

"గాలి నామీదకి తిరిగింది" నవ్వాడు రజనీ.

మొత్తానికి మున్నీ మురళితో వూరు వెళ్ళలేదు.

కానీ తర్వాత రజని పిల్లలని తీసుకురావడానికి వూటీ వెడుతూ ఇద్దర్నీ బయలుదేరమన్నాడు.

"ఊటీ ఎప్పుడూ చూడలేదుగా మధూ?" అని రజని ఎంత చెప్పినా మైథిలి ఒప్పుకోలేదు

మున్నీ మూతి ముడుచుకుని అన్నం తినకుండా అలిగి కూర్చుంది అప్పుడు రజని వచ్చి మున్నీ బట్టలు కూడా తన సూట్‌కేస్‌లోనే సర్ది "రెండు రోజులేనమ్మా ఆ బట్టలు చాలు" అని మున్నీకి నచ్చచెప్పి తీసికెళ్ళాడు. ఎక్కడికైనా వెడితే ఒక్క మున్నీకే చాలా లగేజీ అవుతుంది.

"అబ్బాయిది బహు దొడ్డమనసమ్మా" గౌరమ్మ మెటికలు విరిచింది.

రెండు రోజులని చెప్పి నాలుగు రోజులకు గానీ రాలేదు తిరిగి

మైథిలి ఆఫీస్ నుండి వచ్చేసరికి ఇల్లు హోరెత్తిపోతోంది

రజని సోఫాలో పడుకుని చూస్తున్నాడు టేప్‌రికార్డర్‌లో పాప్ మ్యూజిక్ వస్తోంది. పిల్లలు ముగ్గురూ డాన్స్ చేస్తున్నారు.

అంత సందడి జన్మలో తనింట్లో చూడని మైథిలి గుమ్మంలో నే నిలబడి చూడసాగింది.

చివరికి పెద్దపిల్లయిన మున్నీ కూడా ఆ పిల్లల్తో సమానంగా ఆటలాడుతోంది.

ఎందుకో తల త్రిప్పి చూసిన రజని టేప్‌రికార్డర్ ఆపేశాడు

"ఏమిటి డాడీ ఆపేశావు?" పిల్లలు డాన్సాపేసి తండ్రి దగ్గరికి పరిగెత్తారు.

"మమ్మీ" మున్నీ పరిగెత్తుకొచ్చి తల్లిని ముద్దెట్టుకుంది.

"ఉండండిరా" మీదపడిన పిల్లల్ని విడిపించుకుని కూర్చున్నాడు రజని.

"ఇదుగో మధూ నా వంశోద్ధారకులు. వీడు పెద్దాడు. నాన్న పేరేపెట్టాను ప్రకాష్ వాళ్ళ అమ్మలా నెమ్మదస్తుడు. ఇదుగో వీడు నా అంశతో పుట్టాడు మహా కొంటికోణంగి. పేరు అరవింద్ ముద్దుపేరు బుజ్జాయి" అని ఇంట్రడ్యూస్ చేశాడు

"నమస్తే' పిల్లలు బుద్ధిగా చేతులు జోడించారు.

"ఊటీలో అంకుల్ బట్టలు కొనిపెట్టారు" అంటూ బట్టలు చూపించింది మున్నీ. "మమ్మీ ఈ చీర నీకోసం కొన్నారు."

మైథిలి బిత్తరపోయింది రజని డబ్బు ఖర్చుపెడుతుంటే తనెందుకు వారించలేదా అని ఇప్పుడు బాధ కలిగింది మున్నీ కోసం అతను చేసే ఖర్చుకు అంతులేదా!

"నువ్వా వాణే ఎంత బాగుండేదో తెలుసా?" కంచా . ఎడుతున్న మైథిలి తలెత్తి చూసింది

జగ్‌తో మంచినీళ్ళు తెచ్చి గ్లాసులో పోస్తున్న రజని అదే సమయంలో తను కూడా చూశాడు

ఆ చూపుల్లో అంతర్లీనంగా దాగివున్న అభిమానం మైథిలి మనస్సుని బలంగా తాకింది.

# మైథిలి

"నువ్వు మున్నీ కోసం ఎంత ఖర్చుపెట్టినా నే నిన్నాళ్ళు పట్టించుకోలేదు రజనీ. కానీ దేనికైనా హద్దుండాలి సుమా" కూరవేస్తూ అంది.

రజని వడియాలు వేస్తూ చిరునవ్వుతో అన్నాడు "అదే వాళ్ళ నాన్న ఖర్చుపెడితే ఇలా అనేదానివేనా?"

మైథిలి దెబ్బతిన్నట్టు చూసింది.

"దాని పసిమనసు తండ్రి పంచే ఆప్యాయతల కోసం ఎంత తల్లడిల్లుతుందో నీకు తెలుసా? కనీసం నువ్వు దానిస్కూల్లో జరిగే యానివర్సరీకి కూడా వెళ్ళవు. అదొక్కతే బిక్కుబిక్కుమంటూ వెళ్ళి రాములు రిక్షాలో తిరిగివస్తుంది. నేను ఎలాగూ దానికి తండ్రిని కాను కాలేను. కనీసం ప్రియమైన అంకుల్‌గానైనా బిహేవ్ చేయ్యకూడదా?"

మైథిలి చేతిలో గరిట వదిలేసి కుర్చీలో స్థాణువులా కూర్చుంది అతనే అన్నం కూడా పెడుతూ అన్నాడు

"నీ కోసం నే నేమైనా ఖర్చుపెడితే అణా పైసల్తో సహా వసూలుచేసుకుంటాను ఆ చీర ఖరీదు రెండువందలు ఇచ్చేయి. కానీ మున్నీకి సంబంధించినంతవరకు ప్రకాష్‌తో, బుజ్జాయితో సమానంగా చూస్తాను నీకు కోపం వచ్చినాసరే నా పిల్లలకన్నా కూడా బాగా దగ్గరికి వచ్చింది మున్నీ ఇప్పు డొక్కరోజు దాన్ని చూడకపోయినా ఏదో వెలితిగా ఫీలవుతాను "

పిల్లలు బిలబిలా వచ్చేశారు "చేతులు కడుక్కురండి" హెచ్చరించాడు రజని

"బుజ్జాయి నా ప్రక్కకు రారా కలిపిపెడతాను."

"నేను కలుపుతాలే అంకుల్" అంది మున్నీ.

పిల్లలు వడియాలు లెక్కవేస్తున్నారు.

"ఆంటీ నాకు సిక్సే వున్నాయి" అన్నాడు ప్రకాష్

"ఆ! నాకు ఫైవే" అన్ని కంచంలోవి లాగేసుకున్నాడు బుజ్జాయి. ఏడేళ్ళ ప్రకాష్‌ని కూడా డామినేట్ చేస్తాడు వాడు

"డాడీ.."

"అబ్బబ్బా! వీళ్ళక్కడ హాస్టల్లో ఎలా వుంటారో కానీ ఇంటికి వస్తే కురుక్షేత్రమే."

మైథిలి ముఖంలో నవ్వు వచ్చింది. వాళ్ళకి వడియాలు వేసి అలకతీర్చింది.

ఎప్పుడూ అల్లరిచేసే మున్నీ ఆరిందలా "గోల చెయ్యకండి. మమ్మీకి కోపం వస్తుంది" అంది

"మమ్మీ. నాకింకో వడియం."

మైథిలి ఉలిక్కిపడింది. ఏమీ తెలియని పసివాడు ఆత్రంగా కళ్ళు విప్పార్చుకుని చూస్తున్నాడు.

"ఆంటీ నాకు .."

మైథిలి తన కంచంలో వడియాలు ఇద్దరికీ వేసింది

"ఇప్పుడిహ ఆ యిద్దరి కంచాల్లో అన్నం నువ్వు తిను" రజని వెక్కిరించాడు.

మైథిలి నవ్వింది ముందు చిన్నగా... తర్వాత . అంబరాన వుండే నక్షత్రాలు గలగలా క్రింద రాలినట్టు

రజని ముగ్ధుడైనట్టు చూస్తుంటే మైథిలి చప్పున నవ్వాపేసింది. బుజ్జాయి నోట్లో వడియం క్రిందపడేలా నవ్వుతున్నాడు.

మున్నీ కళ్ళల్లో బోలెడు ఆశ్చర్యం!

వాళ్ళకి కావల్సినవి అందిస్తున్న గౌరమ్మ ముసిముసిగా నవ్వింది

భోజనాలు పూర్తయినాయి.

మైథిలి ఏదో పుస్తకం చూస్తూ కూర్చుంది రజని పిల్లలకు కథ చెప్తున్నాడు. ఏళ్ళు వచ్చినయ్యేగానీ మున్నీ ఇప్పటికీ కథలంటే చేవి కోసుకుంటుంది.

బుజ్జాయి మైథిలి వళ్ళోనే నిద్రపోయాడు.

"ఏమిటీ వాడు నిద్రపోయాడా ఇంటికి వెళ్ళిపోతాం మధూ" రజనీ లేనాడు

మైథిలికి ఏం అనాలో తోచలేదు "ఈ పూట వుండండి అంకుల్" మున్నీ గారాలుపోయింది "పక్కవేస్తాను" అంటూ లోపలికి పరిగెత్తింది.

"నీకు చాలా యిబ్బంది కలిగిస్తున్నాను కదూ? అయామ్ సారీ మధూ" రజని నొచ్చుకుంటూ అన్నాడు.

"నువ్విలా మాట్లాడితేనే యిబ్బంది" చిరుకోపంగా అంది. అతను తన మనసులోని సందేహం కనిపెట్టినందుకు సిగ్గుపడింది

దాదాపు గంట తర్వాత తలుపులు వేసి, డ్రాయింగ్ రూం కిటికీలు మూసి మున్నీ రూమ్‌లో కొచ్చింది

ప్రకాష్, మున్నీ డొక్కలో దూరినట్టుగా పడుకుని నిద్రపోతున్నాడు కిటికీ పక్కగా గౌరమ్మ సన్నగా గురకపెడుతోంది

ఈ పక్కగా నవారుమంచంమీద రజని పడుకునివున్నాడు. అతని గుండెమీద బుజ్జాయి బోర్లాపడుకుని నిద్రపోతున్నాడు

రజనీ చేతులు వాడిని గట్టిగా పెనవేసుకుని వున్నాయి ప్రయాణపు బడలికతో ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్నారు

మైథిలి గుండెల్లో నుండి గాఢమైన నిట్టూర్పు వచ్చింది. నీలం సబ్‌ద్యూడ్ కాంతిలో అతని ముఖం అమాయకంగా వుంది. మైథిలి అలాగే చూస్తోంది... నిస్తేజంగా!

(ఇంకావుంది)

## గడుసులోకం

— బాపు






# భగవాన్ శ్రీరమణ మహర్షి

తమిళనాడు రాష్ట్రంలోని మధురై పట్టణానికి ముప్పయి మైళ్ళ దూరంలో గల తిరుచ్చుళి, అనే శివక్షేత్రంలో సుందరమయ్యర్, అళగమ్మ అను పుణ్య దంపతులకు రెండవ కుమారుడుగా భగవాన్ శ్రీ రమణ మహర్షి 1879వ సంవత్సరం డిసెంబరు 30వ తేదీన జన్మించాడు.




## బాల్యం

శ్రీ రమణమహర్షి విద్యాభ్యాసమంతా తిరుచ్చుళి, మధురైలలో జరిగింది. ఆయనకు పదహారవ ఏట మరణం వచ్చి మీద పడింది. మరణానుభవం ద్వారా "తాను" శరీరం కాదని కేవలం ఆత్మనని అనుభవపూర్వకంగా గ్రహించాడు. అసలు "నేను"ను గుర్తించి, మాయా "నేను" నుండి విడుదలై అమృతసిద్ధిని పొందాడు. ప్రపంచ ఆధ్యాత్మిక చరిత్రలో ఈ పద్ధతిలో జ్ఞానము పొందిన వ్యక్తి పూర్వపు యుగంలో కూడా కనిపించడు.

## అరుణాచలం పయనం

శ్రీ రమణమహర్షి తాను పొందిన ఆత్మానుభవమును, ఆత్మ జ్ఞానమును, ఆత్మ శాంతిని లోకమునకు పంచి ఇవ్వడానికి 1896వ సంవత్సరం సెప్టెంబరు ఒకటవ తేదీన మధురై పట్టణం నుండి పుణ్యక్షేత్రమయిన అరుణాచలం చేరుకొని అరుణాచలేశ్వరునికి తనను నివేదించుకున్నాడు. అరుణాచలంనే తిరువణ్ణామలై అని కూడా అంటారు. కౌపీనము ధరించాడు. తపోనిష్ఠలో ఉన్నాడు. ఆయన దివ్యమూర్తిని చూసి అనేకమంది ఆకర్షింపబడ్డారు. అట్టి వారిలో మహాకవి శ్రీ కావ్య కంఠగణపతి శాస్త్రి ఒకరు.

## భగవాన్

శ్రీ రమణమహర్షి గణపతి మునికి "నేను" అను తలంపు ఎక్కడ ఉద్భవించునో పరిశీలించిన మనస్సు అందులో లీనమగును అదియే తపస్సు అని తపస్సు స్వరూపం గురించి ఉపదేశించారు. మోక్షమునకు నూతన మార్గమును చూపిన ఈ సద్గురువునకు 'భగవాన్ శ్రీ రమణమహర్షి' అని గణపతి శాస్త్రిగారు నామకరణం చేశారు. శ్రీ రమణమహర్షి ఆధ్యాత్మిక బోధన లన్నింటిని క్రోడీకరించి "రమణ గీత" అను పేరుతో గణపతి శాస్త్రిగారు ఒక అద్భుతమైన గ్రంథమును రచించారు.

## ఆశ్రమ స్థాపన

1922వ సంవత్సరంలో శ్రీ రమణ మహర్షి తల్లి అళగమ్మ నిర్యాణానంతరం అరుణాచలంలో శ్రీ రమణమహర్షి ఆశ్రమం స్థాపించబడినది.

భారతదేశ నలుమూలల నుంచి పాశ్చాత్య దేశముల నుంచి అనేక మంది శాస్త్రవేత్తలు, రచయితలు, భక్తులు, రాజకీయ నాయకులు, సంగీత విద్వాంసులు, సంస్కర్తలు భగవాన్ శ్రీ రమణమహర్షిని దర్శించి ఆయన నుండి కాంతిని, శాంతిని పొందారు. శ్రీ బి. వి. నరసింహస్వామి అనే ప్రముఖ అడ్వకేటు భగవాన్ జీవిత విశేషములను సేకరించి ఆంగ్లములో "ఆత్మ దర్శనము" అను పేరుతో ఒక గ్రంథమును రచించారు. పాశ్చాత్య దేశాల నుండి పాల్‌బ్రంటన్ అను గొప్ప పత్రికా రచయిత ఆయనను దర్శించి ఆయన సమక్షములో తాను పొందిన అంతరంగిక అనుభూతిని గూర్చి ఒక గొప్ప ఆంగ్ల గ్రంథమును వ్రాసి పాశ్చాత్య ప్రపంచమునకు శ్రీ రమణమహర్షిని పరిచయం చేసాడు.

శ్రీ రమణ మహర్షి బోధ సహజమైనది, సరళమైనది, సూటియైనది. ఆయన బోధనలకు బూజు పట్టదు. భగవత్ గీతలో వర్ణించిన స్థితప్రజ్ఞుడు ఎలా ఉండాలో మనము భగవాన్ శ్రీ రమణమహర్షిని చూసి తెలుసుకోవచ్చు. ఆయన ప్రేమమూర్తి, కరుణామయుడు, జ్ఞాన మార్గాన్ని సుస్థిరం చేసిన మహాత్ముడు. 1950వ సంవత్సరం ఏప్రిల్ 14వ తేదీన శుక్రవారం రోజున ఆయన నిర్యాణం చెందారు.

అన్ని జీవుల హృదయ గుహల్లో ప్రకాశిస్తున్న పరమాత్మయే అరుణాచల రమణుడని ఒక భక్తుడు అడిగిన ప్రశ్నకు సమాధానముగా ఆయన చెప్పినారట.

ఆత్మ తత్వమే రమణతత్వం రమణ జ్యోతి వెలుగుతూనే ఉంది. ఆయన బోధామృతం చిరకాలం స్మరింపదగినది.

- భూపతిరాజు
వెంకటలక్ష్మీనర్సింహరాజు

# సంయుక్త సమస్య

## శ్రీకంఠస్ఫూర్తి

రిక్షా హెడ్ పోస్టాఫీసు ముందు ఆగింది...!

రామనాథం రిక్షా వాడికి బాడుగ చెల్లించాడు. నెమ్మదిగా మెట్లు ఎక్కి ఎత్తైన పోస్టాఫీసు భవనంలోకి నడిచాడు. కౌంటర్లన్నీ దాటుకుంటూ లోపల ఆఫీసు కేబిన్ వైపు అడుగులు వేశాడు.

"ఎవరు కావాలండీ!" ఎదురుగా మంచి నీళ్ళ గ్లాసుతో ఎదురయిన అటెండరు అడిగాడు.

"బాబూ! జూనియర్ అకవుంటెంట్ శేషగిరిగారు కావాలి- నాయనా!"

"మీరెవరండీ...?" అటెండరు అడిగాడు.

"ఆయన మా అల్లుడే నాయనా..!"

"వెళ్ళండి సార్... అదిగో... ఆయన సీట్లోనే ఉన్నారు...!"

రామనాథం అటెండరుతో మాట్లాడు తూండడం, అప్పటికే సీట్లోంచి చూశాడు శేషగిరి. అయినా మావగారిని చూడనట్లే తన పనిలో తాను మునిగి పోయాడు.

"బాబూ...!"

శేషగిరి మావగారి పిలుపుతో తలెత్తి... అప్పుడే ఆయన్ని చూసినట్టు "ఎప్పు డొచ్చారు? కూర్చోండి" అంటూ కుర్చీ చూపించాడు.

రామనాథం కుర్చీలో కూర్చున్నాడు.

"ఉదయం గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వచ్చాను బాబూ! ఇంటికి వెళ్ళాను... అమ్మగారితో మాట్లాడాను... నీతోనూ పది నిముషాలు...."

"రండి! అలా క్లబ్బు రూముకెళ్దాం!" శేషగిరి క్లబ్బు రూం వైపు దారితీశాడు. పూర్తిగా క్లబ్బు వైపు వెళ్ళకుండానే అక్కడ- టెన్నిస్ కోర్టు దగ్గర ఆగి సిగరెట్ వెలిగించు కున్నాడు.

అల్లుడి ముఖం, ముభావం, మాటతీరు రామనాథానికి మరింత మనోక్లేశాన్నే కలిగించాయి... కూతురు 'సంయుక్త' కళ్ళల్లో కదిలింది. ఆమె ప్రవర్తనా గుర్తొచ్చింది. ఏం జరిగిందో- వీళ్ళిద్దరి మధ్యా... జరగకూడనిదే... ఏదో జరిగింది! మనసు మరోసారి దిటవు పరచుకున్నాడు రామనాథం.

"ఏమిటో చెప్పండి!" శేషగిరి ఎటో చూస్తూ అన్నాడు.

"అసలేం జరిగింది బాబూ? ఎన్నిసార్లు, ఎంత తరచి అడిగినా అమ్మాయి సంయుక్త సమాధానం చెప్పటం లేదు... ఎప్పటికప్పుడు నువ్వు వస్తావనే... మీ అత్తయ్యా, నేనూ అనుకుంటున్నాం... నువ్వు రాలేదు... నీకు నాలుగు ఉత్తరాలు రాశాను. ఒక్కదానికీ నువ్వు జవాబు రాయలేదు..." అల్లుడు ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగాడు రామనాథం!

"ఆ విషయమై నన్నేమీ అడక్కండి... అదేదో మీ అమ్మాయినే నిలదీసి అడగండి... వస్తాను... నాకు అర్జంటు పని ఉంది...!" శేషగిరి విసురుగా వెనక్కి తిరిగాడు.

"బాబూ! నా మాట విను... సంయుక్త చిన్నపిల్ల... అదేమైనా తప్పుచేస్తే నువ్వు సర్దుబాటు చేసుకుంటావనే నా ఆశ... ఏదో పెద్దవాడ్ని..." రామనాథం అభ్యర్థనగా అల్లుడి వెంట నడవబోయాడు.

"మీరింకేమీ చెప్పొద్దు... ఏమైనా మాట్లాడదలచుకుంటే మా అమ్మగారితో మాట్లాడండి...!" శేషగిరి చరచరా లోపలికి వెళ్ళి పోయాడు.

రామనాథం హతాశుడై అక్కడే నిలబడి పోయాడు. ఆయనకు ఏం చేయాలో పాలుపోలేదు... అల్లుడు మితభాషి... నలుగురితో కలవని మనస్తత్వం అనుకున్నాడు గాని... పిల్లనిచ్చిన మావగారితో ఇంత మొండిగా మాట్లాడతాడని ఊహించ లేదు... అల్లుడి ప్రవర్తనా, తీరు, సంస్కారం... వీటి గురించి ఆలోచించక పోయినా... ఆడపిల్ల తండ్రికి ఈ మాత్రపు అనుభవం అనివార్యమని సరిపెట్టుకున్నా... ఆయన హృదయం బాధగా మూల్గింది- అదీ కూతురు సంయుక్తని తలచుకుని...!

"ఇక చేసేదేమీలేదు... ఇంటికి తిరిగి వెళ్ళి జరిగిందేమిటో గట్టిగా సంయుక్తనే అడగాలి...."

రామనాథం భారంగా నిట్టూరుస్తూ పోస్టాఫీసు ఆవరణ దాటాడు. బయట రోడ్డు మీదకు వచ్చాడు... సాయంత్రం ఆరు గంటలు దాటితే గాని తమ ఊరుకు సరాసరి ట్రైను లేదు... అప్పటివరకూ ఏమిటి చెయ్యడం...? బస్సుస్టాండుకు పోతే ఏదైనా బస్సు దొరకవచ్చు...

రామనాథం బస్టాండుకు రిక్షా మాట్లాడుకుని అందులో ఎక్కి కూర్చున్నాడు... రిక్షా ముందుకు కదిలింది...!

శేషగిరి తల్లి వర్ధనమ్మగారు ఉదయం తను వెళ్ళగానే ఆప్యాయంగానే మాట్లాడింది... వంటయి పోయింది అన్నయ్యగారంటూ భోజనం వడ్డించింది. అబ్బాయి ఆఫీసుకు వెళ్ళి పోయాడంటూ వర్తమానం చెప్పింది... కాని- కోడలు సంయుక్త మాట ఎత్తలేదు.

"సంయుక్తకి కాస్త నీరసంగా ఉందమ్మా! అందుకని వెంట బెట్టుకుని రాలేదు...!" ఏదో సర్ది చెప్పాలన్న ఉద్దేశ్యంతో అలా అన్నాడు.

ఆవిడ కొద్ది క్షణాలు మాట్లాడలేదు....

"ఏమిటో అన్నయ్య గారూ! ఈ కాలపు పిల్లలకి మనం చెప్పగలమా...? అంతావాళ్ళ ఇష్టం... నేనెంత చెబితే మాత్రం నా మాట ఖాతరు చేసిందా? అర్థాంతరంగా పుట్టింటి కెందుకూ? ఏం జరిగిందమ్మా- అంటూ బ్రతిమాలి అడిగాను... జవాబు చెప్పిందా? సూట్‌కేస్ సర్దుకుని ఆటో మాట్లాడుకుని విసవిసా వెళ్ళిపోయింది... ఎందుకు



వెళ్ళిపోయిందిరా కోడలు పిల్లా... అంటే వాడూ మాట్లాడడు..."

"అదేనమ్మా! నాకూ అర్థంకావటం లేదు... నేనూ వాళ్ళమ్మా పనిగట్టుకుని పోరుపెడుతున్నా... సంయుక్త నోరు విప్పటం లేదు..."

"అదికాదన్నయ్యగారూ! ఇద్దరూ దెబ్బలాడు కున్నారా... వాడేమన్నా చేయి చేసుకున్నాడా అంటే... ఆ రకమైన గొడవ ఏదీ నా చెవిన పడలేదు... ఆ ముందు రోజు రాత్రికాబోలు... కోడలు తనకు నీరసంగా ఉంది రానంటున్నా పట్టుబట్టి రెండవ ఆట సినిమాకు తీసుకు వెళ్ళాడు వాడు... మళ్ళీ ఎప్పుడు వచ్చి పడుకున్నారో ఇద్దరూ నాకు తెలియనే లేదు... తెల్లారి లేవగానే ఈవిడగారి ప్రయాణం..."

వర్ధనమ్మగారు విడ్డూరంగా బుగ్గలు నొక్కుకుంది. ఇంత విచ్చలవిడితనం ఎక్కడా లేదంది... ఏదో చదువుకున్న పిల్ల కదాని తనే సర్దుకుంటున్నానంది... అత్తగారు ఆడిపోసు కుంటున్నదనే మాట తనకు అక్కరలేదు అంది...."

రామనాథం ఆమాటా, ఈమాటా చెప్పి... "వెళ్ళొస్తానమ్మా! ఆఫీసులో అబ్బాయిని కూడా కలిసి విషయం కనుక్కుంటాను. ఒక వారం రోజుల్లో సంయుక్తని తీసుకొచ్చి దిగబెడతాను..." అంటూ వర్ధనమ్మ వద్ద శెలవు తీసుకున్నాడు... తీసుకొచ్చి దిగబెడతానని ఆవిడతో అన్నాడేగాని సంయుక్త ఒప్పుకుంటే కదా!అత్తవారింటికి తను వెళ్ళనని ఖచ్చితంగా చెబుతోంది... ఏం జరిగిందమ్మా– అంటే మాట్లాడదు... ఏదో పుస్తకం ముందేసుకుని తన గదిలో ఒంటరిగా గడిపేయడం అలవాటు చేసుకుంది... ఏమిటి చెయ్యడం?

"దిగండి సాబ్! బస్టాండు కొచ్చినం..." రిక్షావాడి పిలుపుతో – ఉలిక్కిపడి వాడికి డబ్బులిచ్చి గబగబా బస్టాండు లోపలికి నడిచాడు– రామనాథం... తినడానికి ఒక అరడజను పచ్చ అరటిపళ్ళు కొనుక్కొని– సంచిలో వేసుకున్నాడు... అదృష్టవశాత్తు తమ ఊరుపోయే ఎక్స్‌ప్రెస్ బస్సు బయలు దేరడానికి సిద్ధంగా ఉంది.... బస్సు నిండా జనం... ఎక్కడా కూర్చోవడానికి సీట్లు లేవు... కండక్టరును బ్రతిమాలి నిలబడటానికి ఒప్పుకుని టిక్కెట్టు తీసుకున్నాడు. నాలుగు గంటలకు పైగా ప్రయాణం... ఎప్పటికి సీటు దొరుకుతుందో– ఏమిటో అనుకుంటూ బస్సు మధ్య స్టీలు రాడ్ను పట్టుకుని నిలబడ్డాడు. వయసుభారం.... తోడు ఆలోచనల భారం.... రామనాథం ఆలోచనల్లో కూతురు సంయుక్త... అర్థంకాని పజిల్‌గా.... అపారమైన ఆయన అధ్యాపక జీవనానుభవాన్ని, మేధని ప్రశ్నిస్తూనే ఉంది...!

కూతురయినా, కొడుకయినా రామనాథానికి సంయుక్త ఒక్కతే. బారసాల సంరంభంలో ఏముహూర్తాన, సంయుక్త పేరును ముచ్చటపడి పెట్టాడో గాని ఆ నాటి నుంచి సంయుక్త దినదిన ప్రవర్ధమవుతూ దీపకళికలా పెరిగింది. చదువులో సంయుక్తకు దీటైన విద్యార్థిని ఏ తరగతిలోనూ ఉండేదికాదు. ఏడవ తరగతిలో ఉత్తమ విద్యార్థినిగా అత్యధిక మార్కులు వస్తే.... పదవ తరగతిలో రాష్ట్రానికి రెండవ ర్యాంకు వచ్చింది. ఇంటర్‌లోనూ డిగ్రీలోనూ ప్రథమ స్థానమే. ఆటల్లో పాటల్లో అన్నిట్లోనూ అగ్రగామిగానే వచ్చింది. డిగ్రీ తరువాత ఎంత పట్టుబట్టినా సంయుక్తని చదివించడానికి రామనాథం పరిస్థితులు అనుకూలించలేదు. పైగా సంయుక్తకు పెళ్ళి చేసి ఆ ముచ్చట కాస్తా చూసుకోవాలనే కోరిక రామనాథం దంపతులకు బలపడింది. దాని ఫలితమే సంయుక్త పెళ్ళి....

"మాస్టారూ! మీరిలా కూర్చోండి". నల్లగా గెడ్డం పెంచుకున్న యువకుడు ఒకతను రామనాథాన్ని పిలిచి తన ప్రక్కన చోటిచ్చాడు. ఏదో ఊళ్ళో బస్సు ఆగింది. ఇద్దరు ముగ్గురు దిగి పోయారు..! రామనాథం సీట్లో కూర్చుని రెండు అరటి పళ్ళు నోట్లో వేసుకున్నాడు.

సంయుక్త పెళ్ళికి అసలు సుముఖురాలు కాదు. పైగా అభిమానం ఎక్కువ. తనను చదివించలేదనే ఉక్రోషంతో.... కొన్ని నెలలు తల్లి దండ్రులు తమ ఇద్దరితోనూ మాట్లాడడం మానేసింది. శేషగిరి సంబంధం మంచిదీ, పిల్ల సుఖపడుతుందీ అనుకోగానే సంయుక్తని బలవంతంగా ఒప్పించక తప్పలేదు. రిటైరయి వచ్చిన సొమ్ముతో పెళ్ళి ఘనంగానే చేశాడు రామనాథం. పెళ్ళయి ఆరు నెలలయిందేమో కాపురానికి వెళ్ళింది మూణ్నెళ్ళ క్రితమే. వారం తిరగలేదు. సంయుక్త పుట్టింటికి తిరిగి వచ్చింది. పెళ్ళి సలక్షణంగానే జరిగింది. ఏ గొడవలూ జరుగలేదు. కట్నం కూడా పూర్తిగా పెద్దల సమక్షంలో ఇవ్వబడింది. అత్తగారూ సాధించే మనిషి కాదు. మరి ఏమయినట్టు? వారం తిరక్కుండా సంయుక్త పుట్టింటికి రావడంతో

# సంయుక్త సమస్య

అంతరార్థం...? ఆడపిల్లలు సహజంగా సున్నిత మనస్కులయి ఉంటారు. ఏరకమైన బాధని, సమస్యని ఎక్కువకాలం తమలో దాచుకోరు. కాని సంయుక్త అంత పిరికిది కాదని, ఏ సమస్య నైనా తను పరిష్కరించుకో గలదని రామనాథం నమ్మకం. గతంలో అనేక సందర్భాలు, సంఘటనలు- సంయుక్త ధైర్యాన్ని, చొరవని, తెగువనీ నిరూపించాయి. డిగ్రీ చదువు తూండగా కాబోలు- తన స్నేహితురాల్ని ఏడిపిస్తున్నాడని డి. యస్. పీ కొడుకుని రెండు చెంపలూ వాయించింది. ఆడపిల్లలందర్నీ సమీకరించి పోలీసులతోనే తలపడింది. పెద్ద గొడవ చేసి ఆకుర్రాడితో క్షమాపణ చెప్పించింది. అలాంటి సంయుక్తకు ఏం సమస్య వచ్చి పడినట్టు....? రామనాథం ఆలోచించ లేక కళ్ళు మూసుకున్నాడు.

కూతురు సంయుక్త ఆలోచనలతో రామనాథానికి చిన్నగా కునుకు పట్టింది. అలా కళ్ళు మూసుకుని ఎంత సేపు నిద్రపోయాడో కాని, ఉలిక్కిపడి కళ్ళు తెరిచే సరికి బస్సు తమ ఊరు చేరుకుంది. ప్రయాణీకులు వరుసగా దిగిపోతున్నారు. రామనాథం కూడా బస్సు దిగి- జనంలోంచి.... ఆర్. టి. సి. వారి ఆవరణ దాటి రోడ్డు మీదకు వచ్చాడు.

రాత్రి తొమ్మిది గంటలయిందేమో...! సినిమాల నుంచి వచ్చే జనం, వాహనాలతో రోడ్లన్నీ రద్దీగా ఉన్నాయి. కాలినడకనే ఇంటికి బయలు దేరాడు రామనాథం. ఆలోచిస్తూ ఇంటికి చేరేటప్పటికి అరగంట పట్టింది. బయటి తలుపులు దగ్గరగా వేర్చి ఉన్నాయి. వీధి గదిలో సంయుక్త ఇంకా చదువు కుంటున్నది కాబోలు లైటు వెలుగుతోంది. రామనాథం నెమ్మదిగా ఇంటి ముందు డ్రైనేజీ కాలువ దాటాడు. అక్కడంతా చీకటి. అరుగు మెట్లు ఎక్కుతూంటే కూతురు గదిలోంచి ఘర్షణగా ఏవో మాటలు వినబడసాగాయి. సంయుక్త గొంతుతో బాటు, మరో గొంతు తన భార్య సోమిదేవమ్మది!

"రాత్రి నుంచి నాన్న కనిపించటం లేదు ఎక్కడికెళ్ళారంటే మాట్లాడ వేం?" సంయుక్త స్వరం బాధపడుతున్నట్టుగానే ఉంది.

"ఏం తల్లీ! కన్న తండ్రి ఇప్పుడు గుర్తుకు వచ్చారా నీకు. పుస్తకాల్లో తల దూర్చి కూర్చుంటున్నావు. ఇంట్లో వాళ్ళు ఎలా మసలు తున్నారో నీకెందుకూ.. ?"

"అమ్మా! నస పెట్టకుండా నాన్న ఎక్కడి కెళ్ళాడో చెప్పవే..."

"ఎందుకు చెప్పాలి నీకు? మూడు నెలలయ్యింది నువ్వు పుట్టింటికొచ్చి. కారణం నువ్వు చెప్పావా? మీ ఆయనా నువ్వూ దెబ్బలాడు కున్నారా? ఆ అబ్బాయి కొట్టాడా? అత్తగారు కక్ష బూని కాల్చుకు తింటోందా? ఒక్క మాట సవ్యంగా చెప్పగలిగావా?"

"అమ్మా... ప్చ్... అది.. నీకు నేను ... చెప్పినా అర్థంకాదు". సంయుక్త ఏదో బాధగా, గొక్కి పెట్టినట్టుగా అంది.

"ఏమిటమ్మా అది? అంత చెప్ప లేని కష్టం. కన్న తల్లితోనూ చెప్పుకోలేని సమస్య. ఏమిటి తల్లీ అది. నువ్విలా ఉన్నావనే ఆయన మనసు పాడు చేసుకుని ఎక్కడెక్కడో తిరుగుతున్నారు. పెళ్ళి చేసి, అత్తవారింటికి పంపించిన కూతురు, వారం తిరగకుండానే పుట్టింటి కొచ్చి ఉలుకూ పలుకూ లేకుండా కూర్చుంటే, కన్నవాళ్ళం మాకు కడుపు కోతకాదూ"

"అమ్మా! నా మనసులోని బాధ మీకు అర్థంకాదు. నేను... నేను... రేప్ చేయ బడ్డానమ్మా.! అదీ దారుణంగా..."

ఆ గదిలో నిశ్శబ్దం. భరించ లేని నిశ్శబ్దం. బయట మెట్ల మీద నిలబడ్డ రామనాథం కొయ్య బారి పోయాడు. కాళ్ళు కూలబడినట్లు మెట్ల మీద దబాలున కూర్చుండి పోయాడు.

ఎంత ఘోరం జరిగిపోయింది? సంయుక్త.... నా చదువుల తల్లి.... గారాల పట్టి.... నా ముద్దుల కూతురు.... చిన్నారి కొమ్మ.... నా పసిడి బొమ్మ.... దారుణంగా.... అందుకే నాతల్లీ... పెదవి విప్పకుండా నీలో నువ్వే కుమిలి పోతున్నావు. మాతో మాట మాత్రం చెప్పకుండా మథనపడి పోతున్నావు. ఎంత అన్యాయం జరిగిపోయిందమ్మా. అల్లుడు నిన్ను ఏలుకోనని.. అవసరం లేదని పంపించి వేశాడామ్మా. అయ్యో నా తల్లీ!"

రామనాథం మెట్ల మీద మౌనంగా తల పట్టుకుని భోరున విలపిస్తున్నాడు!

"అమ్మా! నా బంగారు తల్లీ! నీ కెంత కష్టం వచ్చిందమ్మా! ఎలా జరిగిందమ్మా ఆ ఘోరం? ఎవరమ్మా. .. ఎవరు? ఎవరు తల్లీ..."

సోమిదేవమ్మ దుఃఖంతో వెక్కి వెక్కి పడుతూనే అడిగింది!

"ఎవరో కాదమ్మా. ఆయనే... ఆయనేనమ్మా... నన్ను..."

"ఏమిటే నువ్వు మాట్లాడుతోంది. నీకు పిచ్చి గాని పట్టిందా?" సోమిదేవమ్మ గొంతులో కోపం కట్టలు త్రెంచుకుంది. రామనాథం నిటారుగా నిలబడ్డాడు.

"పిచ్చి పట్టడం ఏమిటి? అవును. నన్ను ఆయనే .. నా భర్తే... నా ఇష్టం లేకుండా... నా ఆరోగ్యం మాట వినకుండా. తన పురుష బలంతో... పశువులా.."

"అదేమిటి తల్లీ! భర్త భార్యతో కోరిక తీర్చుకోవడం తప్పెలా అవుతుందమ్మా?"

"తప్పు కాదామ్మా! ఆడదానికి ఓ ఇష్టం ఉండదా?

సొంత అభిప్రాయం ఉండదా? ఎప్పుడు మగవాడు కోరితే అప్పుడు మరబొమ్మలా కోరిక తీర్చడమేనా? తనకు అయిష్ట మయినా.... అనారోగ్య మయినా అంతేనామ్మా! భర్త అనే హక్కుతో, భార్యని బలవంతంగా... నిస్సహాయురాల్ని చేసి... నిర్లజ్జగా... నిస్సంకోచంగా... ఏఁవిటమ్మా అది?దాన్ని ఏమంటారు?నాకూ ఆలోచించే మెదడు ఉంది. ఆ మెదడు నాకో వ్యక్తిత్వాన్నిచ్చింది... ఆ వ్యక్తిత్వం నాకో అభిమానాన్ని అలవర్చింది. ఆ అభిమానం దారుణంగా నా భర్త వల్ల.... రేప్ చెయ్య బడింది. అందుకే నమ్మా నేను పుట్టింటికి వచ్చేశాను..."

సోమిదేవమ్మకు నోట మాట రాలేదు... ఆమెకు నవ్వాలో, ఏడవాలో తెలియలేదు... కూతురు మాటలు కొత్తగా వింతగా ఉన్నాయి... "భార్యకు ఇష్టంలేనప్పుడు భర్త ఆమెను తాకకూడదా...! ఇది సాధ్యమేనా...? మగవాడి నీడలో అణగి... లొంగి బ్రతకడమే తనకు తెలుసు... తరతరాలుగా స్త్రీ జాతి అనుభవిస్తున్నది అదేకదూ...! ఇదేమిటి ఈ పిల్ల ఇలా ఆలోచిస్తోంది... ఇది విపరీతం కాదూ..." సోమిదేవమ్మ ఆలోచనలు ఒక కొలిక్కి రాలేక పోతున్నాయి...!

రామనాథం తథాలున తలుపులు తెరుచుకుని లోపలకు వచ్చాడు... సంయుక్త దగ్గరగా వచ్చి తలమీద చేయివేశాడు... కూతుర్ని అలా చూసుకుంటూ ఉంటే ఏదో గర్వంగా ఉంది రామనాథానికి...!

ఈనాటి ఆడపిల్ల ఎంత ఎదిగింది...? తనదైన వ్యక్తిత్వం నిలబెట్టుకోవడంలో... స్వేచ్ఛను కోరుకోవడంలో ఎంత సంచలనంగా, చైతన్యవంతంగా ఆలోచిస్తోంది... "నస్త్రీ స్వాతంత్రమర్హసి" అన్న నాటి స్త్రీ కాలం నుంచి... నా ఇష్టం లేనిదే నన్ను తాకవద్దనే నేటితరం యువతివరకూ స్త్రీ స్వేచ్ఛాపథంలో... ఎంత నిరసన...? ఎంత ఘర్షణ...? ఎన్ని ముళ్ళు...? ఎన్ని రాళ్ళు...? ఎన్ని కడగళ్ళు...? స్త్రీని విలాస వస్తువుగానే పరిగణించే పురుషుని దృక్పథంలో సంయుక్త నిరసన ఎంతవరకూ నిలబడుతుంది...? భార్యాభర్తల దాంపత్య జీవనం బహు సున్నిత మైనది... నాలుగు గోడల మధ్య... తమకు మాత్రమే పరిమితమయిన, పరస్పర పరిమళ అవగాహన అది... ఒకరి ఇష్టాన్ని ఒకరు భరించాలి... ఒకరి కష్టాన్ని మరి ఒకరు అర్థం చేసుకోవాలి... ఇది ఇద్దరి "సంయుక్త సమస్య"... దీనికి పరిష్కారం...? అల్లుడు శేషగిరికి ఏం చెప్పాలి...? అతని అహాన్ని ఎలా తృప్తిపరచాలి...? సంయుక్తకు ఎలా నచ్చ చెప్పాలి...? ఆమె అభిమానాన్ని ఎలా రక్షించాలి.. ఎలా...?"

రామనాథం ఆలోచిస్తూనే ఉన్నాడు...!

# విభిన్నాభిప్రాయాలు




మనిషికి బాహ్యావయవాలైన కాలు, చేతులు, కన్ను, ముక్కు మున్నగు వాటిలో భేదం లేకపోయినా అంతరింద్రియాలైన మనస్సు, బుద్ధి మున్నగు వాటిలో భేదం ఉంటుంది. అభిరుచులు వేరువేరుగా ఉంటాయి. ఒకరికి తీపి యిష్టమైతే మరొకరికి పులుపు ఇష్టం. ఇలాగే అభిప్రాయాలూ విభిన్నంగా ఉంటాయి. కొన్నిటి పట్ల "ఎవరి అభిప్రాయం వారిది. దానితో మనకు పని లేదు" అని అనిపించినా, కొన్ని సందర్భాలలో అవి పరస్పర విరుద్ధాలయి తీవ్ర రూపం దాల్చి అపాయాలకు దారి తీస్తాయి.

అభిప్రాయ భేదాలు తీవ్రములైతే పట్టుదలలు ఎక్కువయి, ఎదుటి వారిని పడగొట్టవలెననే సంకల్పాన్ని పెంచు తాయి. అందువల్ల ద్వేషం కలుగు తుంది.

వ్యక్తిగతాలయిన అభిప్రాయాలు దేశ పురోగతికి, జన సామాన్య క్షేమానికి భంగం కలిగించేవిగా ఉండదు. అట్టి విషయా లలో పట్టుదలను మాని సమైక్యంగా కృషి చెయ్యడం సహృదయుల లక్షణం. ఉదా రాశయాలు లేని కారణం వల్లనే కొందరు వ్యక్తుల మూలంగా దేశ క్షేమానికి భంగం కలుగుతూ ఉంటుంది. అట్టి వ్యక్తుల ప్రబోధం వల్ల మంచి చెడ్డ తెరుగని జనుల మూకలు సమ్మెలు చెయ్యడం ఉమ్మడి సంపదలయిన భవనాలకూ, వాహనాలకూ నిప్పంటించి వానిని దగ్ధం చెయ్యడం, హింసలకు పాల్పడడం జరుగు తున్నది. ఆ సంపదలో తమకు కూడా భాగం ఉన్నదనే సంగతి వారు విస్మరిస్తారు. దానికి వారి ఉద్రేకమే ప్రధాన కారణం. అందులో స్వార్థానికి స్థానం ఉండ కూడదు. దేశ సమైక్యతకు భంగం కలగని పద్ధతిలో ఉండాలి.

ప్రతి పక్షాలు కొన్ని సందర్భాలలో ప్రభుత్వ ప్రతిపాదనలను విమర్శిస్తూ ఉన్నా, ప్రజా క్షేమానికి సంబంధించిన వాటితోనూ, దేశ సమైక్యతా కృషిలోనూ సహకరిస్తున్న సంగతి అందరూ ఎరిగి నదే!

అభ్యుదయ మార్గాల ఆలోచనలతో కూడా అందరి అభిప్రాయాలూ ఒక్క మాదిరిగా ఉండక పోవచ్చు. బాగా ఆలోచించి, భేదం లేకుండా ఒక నిర్ణయం తీసుకోవడం సహృదయుల లక్షణం.

– బులుసు వేంకట రమణయ్య

మంజుల అలా వెళుతూవుంటే కళ్ళు జిగేల్ మన్నాయి. నిజంగా మెరపు తీగెలాగా వుంది. ఆ కట్టు, ఆ బొట్టు, ఆ కేశ సౌందర్యం అంతులేని అందాన్ని తెచ్చిపెట్టాయి.

"అబ్బ! ఆ అమ్మాయి ఎంతో అందంగా వుంది కదూ?" అని అనిల్ లొట్టలువేశాడు ఆ అమ్మాయి అందాన్ని మనస్సునిండా నింపేసుకుంటూ.

"భూలోక సుందరి అంటే ఈమే నేమో!" మరింత హై మూడ్‌లో అన్నాడు ఆనంద్.

"వదులుగా వేసుకున్న వాలుజడ, ముఖాన దోబూచులాడుతున్న ముంగురులు, లేత గులాబీరేకుల్లా ముద్దొచ్చే లిప్‌స్టిక్ పెదవులు, కళ్ళన్నీ జిగేలనిపించే ముక్కుపుడక, మనస్సుని ఓలలాడించే చెవుల రింగులు, మెరిసిపోతున్న బ్లూ శారీ, దానికి మాచింగ్ బ్లౌజు, లో నెక్ బ్లౌజునుండి కనిపించీ కనిపించకుండా వున్న నిండైన చనుకట్టు....." అలా తనని మత్తెక్కించిన మంజుల సెక్స్‌అప్పీల్‌ని కామాతే తప్ప, ఫుల్‌స్టాప్‌లు లేకుండా వర్ణించుకుపోతున్నాడు అనిల్.

బాహ్యసౌందర్యంతో మతులు పోగొట్టుకున్న అనిల్, ఆనంద్‌ల సంగతది అయితే దారిని పోతున్న



# సెక్సప్పీల్ కేవలం ముడిపడి వుందా?

గోపాల్‌ని ఆపి, అదీ యిదీ మాట్లాడిన తరువాత "ఒరేయ్! నేను కోతిని పెళ్ళిచేసుకున్నానని అన్నావు. డబ్బు కోసమా, ఆడదే దొరక్క అని గేలి చేశావు గుర్తుందా?" అడిగాడు గణేష్.

"అవున్రా! మళ్ళీ అంటాను. నా డియరిస్ట్‌వి కనుక యింకా అంటాను. ఆ కురూపిలో నీకు సెక్స్ ఏం కనబడిందిరా" అన్నాడు గోపాల్.

"అది తరువాత చెబుతాగాని, అంత అందమైన భార్యని పెట్టుకుని రాధికే నా సర్వస్వం అంటూ దాసోహం అయిపోయి దాని కొంగుపట్టుకునే తిరుగుతున్నావు. బండ పెదవులు, నల్లటి ముఖం దాని ముఖంలో ఏం ఆకర్షణ కనబడింది? ఏ సెక్స్ 'సౌందర్యం నిన్ను ఆకట్టుకుంది?" అని వున్నది వున్నట్లు ముఖంమీద అడిగేశాడు గణేష్.

గణేష్ మాటలకి గోపాల్ ఒక్క క్షణంపాటు ఖంగుతిన్నా రాధిక నల్లగా వుంటే ఏమైంది, బండపెదవులు వుంటే ఏమైంది? శృంగారం ఒలకబోస్తూ మాట్లాడిన రెండు మాటలే నన్ను తన వాడిగా చేసేసుకున్నాయి. ఆమె నోటి నుండి జాలువారే శబ్దాలు ముత్యాల మూటలు. ఆమె నవ్వితే నల్లని మబ్బుల చాటు నుంచి మెరుపు తీగ మెరిసినట్లు వుంటుంది. ఆమె కళ్ళు నాకు కైపు ఎక్కిస్తాయి." చెప్పుకుంటూ పోసాగాడు గోపాల్. అందమైన భార్యలో కనబడని సెక్స్‌పీల్ 'కురూపి' అయిన రాధికలో కనబడింది.

అందుకే అనుమానం వస్తుంది. అందరూ అనుకునేరకంగా సెక్స్‌పీలు కేవలం బాహ్యాలంకరణతోనే లేదు, మనసు అల్లే మాటల్లో కూడా వుంది. అందమైన భార్య వున్న వాడిని అనాకారి అయిన అమ్మాయి యిట్టే చిత్తుచేసి తనమీద ఆకర్షణ కలిగించుకుందంటే శృంగారం జాలువారే పలుకు, క్రీగంటి చూపు కూడా సెక్స్‌పీలేనని చెప్పుకోవచ్చు.

## సెక్సు అప్పీలు మండలాలు

ఎంతైనా సెక్స్‌పీల్‌లో శరీరంలో కొన్ని జోన్స్ ప్రాధాన్యతవహిస్తాయి. కైపుగా కనిపించే కళ్ళు, ఉబ్బెత్తుగా వుండే వక్షోజద్వయం, బొడ్డుకి అతి దిగువుగా కట్టిన చీర, పల్చటి చీరచాటున దొప్పల లాంటి పిరుదులు సెక్స్‌పీల్‌కి దోహదం చేసేవే. వీటికి తోడు అందంగా మేకప్ అయిన ముఖారవిందం, కేశాలంకరణ, వస్త్రధారణ

స్త్రీలలో రహస్యాంగ దృశ్యాదృశ్య ప్రదర్శనవల్ల ఏమి ప్రయోజనం?



# బాహ్య సౌందర్యంతోనే మనస్సు ప్రమేయం లేదా?

మగవాని సెక్స్‌ప్పీల్ అంటే మూతిపైన అందమైన మీసం, కండలు తిరిగిన జబ్బలు, విశాలమైన ఛాతీ, చక్కని హెయిర్ స్టయిల్, వాడిగా – వేడిగా కనిపించే కళ్ళు, తీవైన నడకా? యివా? ఇందులో ఏది సెక్స్‌ప్పీల్ అని అమ్మాయిని అడిగితే యిది అని దేనినీ ప్రత్యేకంగా చెప్పదు సరికదా, "అన్నీ" అనేస్తుంది. అయితే పహిల్వాన్‌లాగా ఒళ్ళంతా కండలు



డా. జి. సమరం

తిరిగివుంటేమాత్రం "బాగుండడు" అంటుంది. అంటే మాన్‌లీ ఎపియిరన్స్‌లో కొంత లాలిత్యం కూడా వుండాలనే భావం కాబోలు. ఆకర్షణీయమైన ముఖవర్చస్సు, ధీరోదాత్తత, నీటైన దుస్తులు, కొంత చిలిపితనం, కొంత హుందాతనం యివన్నీ రంగరించి మగవాని సెక్స్‌ప్పీల్ అని చెప్పుకోవచ్చు.

**అందుకని సెక్స్‌ప్పీల్ కేవలం బాహ్య సౌందర్యంతోనే ముడిపడ లేదని, మనస్సు ప్రమేయం కూడా వుందని తెలుతుంది.**

ఈ రెండు ప్రశ్నలకి
...క్ జవాబు ఈ వ్యాసం

సెక్స్‌ప్పీల్‌ను ఎంతో యినుమడింప చేస్తాయి. కనిపించీ కనిపించని చనుద్వయం, మర్మావయవాలు కనిపిస్తాయేమోనని భ్రమ కల్పించే చీరకట్టు లేదా వస్త్రధారణ సెక్స్‌ప్పీల్‌లో ప్రాధాన్యత వహిస్తాయి. స్త్రీలలో యిటువంటి ఎపియిరన్స్ సెక్స్‌ప్పీల్ కనుక మగవాళ్ళెవరైనా తమ సెక్స్‌ప్పీల్‌గా తమ మర్మావయవాలని ఎత్తుగా కనబడేటట్లుగానో, మరోకరకంగానో కనబడేటట్లు వస్త్రధారణ చేసుకుంటే అది స్త్రీలకి ఏవగింపు కలిగిస్తుందే తప్ప సెక్స్ ఆకర్షణ కలిగించదు. స్త్రీమర్మావయవాలు పురుషునిలో సెక్స్ ప్రేరణ కలిగిస్తాయి కాని పురుషుని మర్మావయవాలు ఏ విధంగానూ స్త్రీలో సెక్స్ ప్రేరణ కలిగించవు.

## ఎలా వుంటుందో

పురుషుల్లో సెక్స్‌ప్పీల్ అంటే ఎలా వుంటుందని అడిగితే చెప్పడం కష్టమే. అదే ఓ అమ్మాయిని మగవానిలో ఏది చూస్తే సెక్స్‌ప్పీల్ అనిపిస్తుందని అడిగితే చటుక్కున "మాన్‌లీ ఎపియిరన్స్" అని జవాబిస్తుంది. "మాన్‌లీ ఎపియిరన్స్ అంటే?" అని మళ్ళీ ప్రశ్నిస్తే ఒక్క క్షణం ఏం చెప్పాలో, ఏది చెప్పాలో తికమకై "అదే చెప్పానుగా, మగతనం వుట్టిపడటం" అంటుంది. ఇంగ్లీషు పదాన్ని తెలుగులో తెనిగించి చెపుతుంటే తప్ప, ఫలానా అది అని చెప్పలేకపోతుంది.



మరి పురుషులలో 'మర్మాంగ' దృశ్యాదృశ్య ప్రదర్శనవల్ల సెక్స్ అప్పీలు వుంటుందా?

సీరియల్

# ఈ అబ్బాయికి పెళ్ళవుతుందా?

కె. గోదావరి శర్మ

(గత సంచిక తరువాయి)

సోమవారం ఉదయం పది గంటలకి ముందే ఇంటర్వ్యూ జరిగే ఆఫీసుకి వచ్చారు, కృష్ణ, ప్రసాద్. ఏడుపు మొహంతో దిగాలు పడి నిలుచున్న కుర్రాడే శ్రీనివాస్ అని సులువుగానే గుర్తించారు.

ప్రసాద్ అతని దగ్గర కెళ్ళి "మీరేనా బి. శ్రీనివాస్?" అనడిగాడు.

అతడు ఆశ్చర్యంగా చూశాడు, ఈ ఊళ్ళో తనని ఎరిగిన వాళ్ళెవరా అనుకుంటూ. తలూపేడు.

"ఈ సర్టిఫికెట్లూ అవీ మీవేనా?" కృష్ణ చేతిలోంచి కవరు అందుకుని అతనికి చూపించాడు ప్రసాద్.

శ్రీనివాస్ మొహం వెయ్యి వోల్టుల బల్బులా వెలిగింది. ఉద్యోగమే వచ్చేసినంత ఆనందం కలిగింది అతడికి. నోటంట మాట రాలేదు. కళ్ళంట నీళ్ళు మాత్రం వచ్చేయి.

ఒక్క ఉదుటున ఆ కవరు ఆత్రంగా లాగేసుకుని, ప్రసాద్ చేతులు పట్టుకుని, "ఏమండీ, దేవుళ్ళా ఒచ్చేరండీ! మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేనండీ! పోయేయనుకున్నానండీ..." అంటూ గబగబా తడబడుతూ చెప్పేస్తున్నాడు శ్రీనివాస్.

కృష్ణకీ ప్రసాద్‌కీ చాలా సంతోషంగా ఉంది. వీడెవడో మరీ అర్భకుడిలా ఉన్నాడు. అమాయకంగా ఉన్నాడు. వాళ్ళకి ఆ పని చేసినందుకు సంతృప్తిగా ఉంది.

"ఈ ఉద్యోగానికి ఖమ్మం నుంచి ఇంత దూరం వచ్చారా?" అనడిగాడు ప్రసాద్.

ఖమ్మం. శైలజదీ ఆ ఊరే. ఇతనికి తెలిసే అవకాశం ఏమైనా ఉందా? ఎలా అడగాలి? ఆలోచిస్తున్నాడు కృష్ణ.

"అవునండీ! ఎంత దూరమైనా తప్పదు కదండీ! రెండేళ్ళైట్రై చేస్తున్నా ఏదీ తగలడం లేదండీ. దీని మీద ఎంతో ఆశ పెట్టుకుని వస్తే ఇలా అయిందండీ. నేనెంతో భయపడి పోయానండీ! ఏదో సమయానికి మీరొచ్చి...." మళ్ళీ రికార్డు ప్రారంభించాడు శ్రీనివాస్.

"ఖమ్మంలో మీ ఫాదర్ ఏం చేస్తుంటారు?" అనడిగాడు కృష్ణ. ఏదైనా లింకు దొరుకుతుందేమోనని. ప్రసాద్ కృష్ణ ప్రయత్నాల్ని చిరునవ్వుతో గమనిస్తున్నాడు.

"మా ఫాదర్ లేరండీ. చిన్నప్పుడే పోయారు. నేనూ మా అమ్మా అంతే... అంటే, ఖమ్మంలోనే మా మామయ్య ఒకాయన ఉన్నాడు లెండి, ఎ. నారాయణమూర్తి గారని...."

కృష్ణ ఉలిక్కి పడ్డాడు. ఆయన ఇతనికి మామయ్యా? కుర్రాడి కాగితాలు పడవలసిన చేతిలోనే పడ్డాయి! ఇతని దగ్గరు నుంచి కొంత వివరం లాగవచ్చు. ఎంత అమాయకుడైనా మనం కొంత తెలివిగా, జాగ్రత్తగా వ్యవహరించాలి. ప్రసాద్ వంక చూసి అర్థవంతంగా నవ్వాడు కృష్ణ.

"నారాయణమూర్తి గారా...." జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్టు అన్నాడు. "అంటే... హెల్త్ డిపార్ట్‌మెంటు...."

"అవునండీ! హెల్త్ డిపార్ట్‌మెంటే మా మామయ్య! మీకెలా తెలుసు? అన్నాడు శ్రీనివాస్ ఆశ్చర్యంగా.

"ఆఁ! మా స్నేహితుడొకాయనకి మీ మామయ్యగారు తెలుసు లెండి. మా ఫ్రెండు కొన్నాళ్ళు ఖమ్మంలో ఉన్నాడు కూడా... ఆయనకి... ఓ అమ్మాయి ఉండాలనుకుంటాను...." అనుమానంగా అడిగాడు కృష్ణ.

"ఔను. మా శైలజ. సెకెండ్ బి. యస్‌సి. చదువుతూంది ఇప్పుడు" అన్నాడు శ్రీనివాస్ ఉత్సాహంగా.

దొరికేడు. ఇక విజృంభించాలి.

మిత్రుడి ఉత్సాహాన్ని గమనించాడు ప్రసాద్. కృష్ణ చేతి మీద చెయ్యి వేసి, "కృష్ణా, అతనికి ఇంటర్వ్యూ టైమ్అవుతున్నట్టుంది. సర్టిఫికెట్స్ అవీ వెరిఫై చేయించుకోవద్దూ? ఈలోగా మనం కాఫీ తాగొద్దాం రా" అని, శ్రీనివాస్ వైపు తిరిగి, "బాగా చెయ్యండి ఇంటర్వ్యూ. గుడ్‌లక్. మీ టర్న్ అయ్యేవేళకి మేం కాఫీ తాగి మళ్ళీ వస్తాం" అన్నాడు.

"అలాగేనండీ" అని ఆనందంగా వాళ్ళకి నమస్కరించాడు. "తప్పకుండా రండీ. మీతో ఇంకా మాట్లాడాలనుంది నాకు. ఇంతకీ మీరెవరో తెలియలేదు నాకు" అన్నాడు.

"చెప్తాం చెప్తాం. అవన్నీ తరవాత మాట్లాడుకుందాం. ముందు వెళ్ళి రండి" అని అతడిని పంపించేశాడు ప్రసాద్.

★ ★ ★ ★

ఇంటర్వ్యూ తర్వాత శ్రీనివాస్‌ని రూమ్‌కి తీసుకువెళ్ళేరు. అతడితో సంభాషణ వల్ల మిత్రులిద్దరూ తెలుసుకున్న దేమిటంటే శైలజ అందమైనదే కాక తెలివైనదనీ. ఆ ఇంటి పరిస్థితి కూడా కొంత అవగతమైంది. శ్రీనివాస్ ప్రమాదకరమైన వాడు కాదు. పైగా సరిగ్గా వాడుకుంటే పనికొస్తాడు కూడాను.

అందుచేత జరిగిన సంగతి అతనికి చెప్పడం మంచిదనిపించింది. జాగ్రత్తగా, దశలవారీగా చెప్పేరు. శైలజ జవాబు రాసిన సంగతి కూడా చెప్పేరు.

శ్రీనివాస్ ఆశ్చర్యపోయాడు. "ఇదంతా ఏదో సినిమా కథ లాగుందే" అన్నాడు. ఈ సంగతేమీ శైలజ తనతో చెప్పనందుకు మనసులో బాధపడ్డాడేమో గాని, బయటకేమీ అనలేదు. పైకి ఆనందాన్ని, ఆశ్చర్యాన్నే ప్రకటించాడు. ఈ మధ్య కొన్ని నెలలై శైలజ అతడికి తనకంటె ఉన్నతంగా కనిపిస్తూంది. కాని తనకంఠనంత ఎత్తుగా ఉందని అతనెప్పుడూ గుర్తించలేదు. అసలా విషయం ఆలోచించలేదు. కాని తనకి తెలియకుండానే ఆమె పట్ల ఒక గౌరవం, భయం పెరుగుతూంది అతడిలో.

ఇప్పుడు ఈ కాబోయే డాక్టర్ శ్రీనివాస్ కళ్ళకి ఒక హీరోలా కనిపిస్తున్నాడు. శైలజని చేసుకుంటే ఇలాంటి వాళ్ళు చేసుకోవాలి. ఇతనే తగిన వాడు. ఇలా అనుకోవడం బాధగానే ఉంది. కాని, ఇతని ముందు తనెంత? తనకి శైలజ మోయలేని బరువు అయిపోతుంది. శ్రీనివాస్ మెదడంతా గజిబిజిగా ఉంది.

కృష్ణ కూడా ఆలోచిస్తున్నాడు. ఇతడి ద్వారానే మనం దౌత్యం నెరపవచ్చు. ఆ అమ్మాయి వాళ్ళన్నయ్యని మన మీదకి స్పైగా పంపిస్తూంది కదూ! అంతకంటె ముందు ఈ అబ్బాయి ద్వారా ఫేవరబుల్ రిపోర్ట్ వెళ్ళేటట్టు మనం చేద్దాం. ఇతడు ఇప్పుడు మనం ఏం చెప్పినా వినే స్థితిలో ఉన్నాడు. ఈజీగా ఇన్‌ఫ్లుయెన్స్ చెయ్యొచ్చు.

"జరిగిన కథ- 4: విశాఖలో కృష్ణ, ప్రసాద్‌లు కలిసి ఒకే గదిలో వుంటుంటారు. ప్రసాద్ సహాయంతో కృష్ణ ఖమ్మంలోని శైలజ అనే అమ్మాయికి ప్రేమలేఖ వ్రాస్తాడు. ఊహలో కాల్చో తెలిపోయే శైలజ తన అన్నయ్య త్వరలో వచ్చి కలుసుకొని అన్ని విషయాలు మాట్లాడతాడని జవాబు వ్రాస్తుంది."

అక్కడికి వెళ్ళి తగిన గ్రౌండ్ ప్రిపేర్ చేస్తాడు. ఆమెతో మన హీరోయిజమ్ గురించి, అతడికి సాయపడిన సంగతీ భక్తి శ్రద్ధలతో వర్ణించడం, ఆ అమ్మాయి దృష్టిలో కూడా మనం హీరోలం కావడం చాలా అవసరం.

ఆ రోజు కృష్ణ క్లాసులు మానేసి శ్రీనివాస్‌తో గడిపాడు. ప్రసాద్ ఆఫీసుకి వెళ్ళిపోయాడు, 'జాగ్రత్త సుమా' అని కృష్ణని హెచ్చరించి. కృష్ణ, శ్రీనివాస్ కలిసి భోం చేశారు. వైజాగ్ మెయిన్ రోడ్డంతా తిప్పి చూపించాడు కృష్ణ, శ్రీనివాస్‌కి. అతడికి కృష్ణంటే గురుభావం ఏర్పడిపోయింది.

సాయంత్రం మిత్రులిద్దరూ శ్రీనివాస్‌కి గోదావరి ఎక్స్‌ప్రెస్ దగ్గర వీడ్కోలు ఇచ్చారు. అప్పటికి చాలా బ్రెయిన్ వాష్ జరిగింది.

రైలు కదిలాక ప్రసాద్ కృష్ణకి షేక్‌హాండ్ ఇచ్చాడు, 'కంగ్రాట్స్' అంటూ. "కాగల కార్యం గంధర్వులే చేస్తారు" అన్నాడు కృష్ణ.

## 6

ఉత్తరం వచ్చి వారం రోజులు కావస్తున్నా రెండో లెటర్‌లో ఏం రాయాలో తేలలేదు కృష్ణకి. ఏయే విషయాలు ప్రస్తావించాలో నిర్ణయం కాలేదు. వాళ్ళన్నయ్య రాలేదు ఇంకా. పన్నెండునే వస్తాడని రాసింది. ఇవాళ పద్ధాలుగు. ఎందుకు రాలేదో? అతన్ని కలిసేదేమిటి, వెళ్ళి చెల్లెలికి నాలుగు చీవాట్లేసి మనసు మళ్ళిస్తే చాలుననుకున్నాడా? ఒకవేళ వచ్చినా, శ్రీనివాస్ ద్వారా తెలిసినవికంటె ఎక్కువ విషయాలు తెలుస్తాయా, అతని ద్వారా? ఇక అతని రాక కోసం వెయిట్ చేస్తూ శైలజకి ఉత్తరం ఆలస్యం చెయ్యకూడదనిపించింది కృష్ణకి.

ఏం రాయాలి? తన అభిప్రాయాలు, తన ఆదర్శాలు, తన ఫిలాసఫీ ఆఫ్ లైఫ్– అన్నీ క్రమంగా తెలియజెయ్యాలి. కాని అన్నీ వీలైనంత నేర్పుగా, సున్నితంగా రాయాలి. లేకపోతే వీడెవడో హార్డ్ నట్ లాగున్నాడని భయపడే ప్రమాదం లేకపోలేదు. ప్రసాద్ చెప్పినట్టు, వీలైనంత వరకు కవిత్వం మానేసి ప్లెయిన్‌గా, క్రమంగా ఇంజక్ట్ చెయ్యాలి ఏ విషయమైనా!

ఇంతకీ ఈ శ్రీనివాస్ వెళ్ళి ఏం చేశాడో! తన గురించి వాళ్ళింట్లో చర్చలు జోరుగానే సాగుతూ ఉంటాయి ఈ పాటికి. మిస్ ఇంటర్‌ప్రెటేషన్స్ ఏవీ లేకుండా ఉంటే చాలు. తల పంకించాడు కృష్ణ.

★ ★ ★ ★

మర్నాడు పగలంతా కాలేజిలో బిజీగా గడిచిపోయింది. ఛీఫ్ ఒక మేజర్ ఆపరేషన్ చేస్తూంటే ఫైనల్ ఇయర్స్ అంతా ఎటెండై చూశారు. పేషెంట్ ముప్ఫయి ఏళ్ళ స్త్రీ. ఇద్దరు చిన్నపిల్లలూ భర్తా బయట దేవుడికి దండాలు పెడుతూ కూర్చున్నారు.

ఆపరేషన్ జరుగుతున్నంత సేపూ కృష్ణకి మనసంతా కలచి వేసినట్టయింది. అతనికి అలాంటి



దృశ్యాలు కొత్త కాదు. కాని ఈ సారి ఎందుకో ఒళ్ళంతా చెమటలు పట్టి గుండె బరువెక్కిపోయింది. ఒకటి రెండు సార్లు కళ్ళలో నీళ్ళు తిరిగాయి కూడా.

ఒకేసారి అతడి మెదడులో ఎన్నో భావాలు కదలాడేయి. ఎన్నో తలా తోకా లేని ప్రశ్నలు. కొన్ని అద్భుత సత్యాలు ఆ అలజడిలోనే స్ఫురిస్తాయి. 'ప్రాణం మీద ఎందుకంత మమకారం? ఎప్పుడైనా పోవలసిందే కదా! పోతేనేం? పోయేదాన్ని ఆపాలని ఎందుకంత ప్రయత్నం?' అనుకునేవాడు కొన్ని సార్లు. కాని ప్రాణం పోవడం ఎంత సులువో, ప్రాణం పొయ్యడం ఎంత కష్టమో కళ్ళారా చూశాక దాని విలువ తెలిసింది. ఎప్పటికైనా తప్పని మృత్యువు గురించి ఎప్పుడూ ఎందుకంత భయపడతామో బోధపడినట్టనిపించింది. ఈ జీవితం మనకి లభించిన అపూర్వమైన అవకాశం. అశాశ్వతమైన ఈ జీవితంలో మనిషి పొందవలసిన అనుభవాలెన్నో! అందుకోగలిగే ఎత్తులెన్నో! తెలుసుకోవలసిన విషయాలెన్నో! సమయం ఎంత విలువైనది! విద్యాధనాలు సంపాదించేవాళ్ళు జరామరణాలు లేనివాళ్ళలా సంపాదించాలని చెపుతారు పెద్దలు. అందుకే చావుని జయించాలని, వీలయినంత వరకు వాయిదా వేయాలనీ మనిషి ప్రయత్నం. మనిషి ఆశాజీవి. ఆఖరు క్షణంలో కూడా ఇంకా ఇంకొంత సేపు బతకాలని, ఇంకొంత జీవితం అనుభవించాలని, ఇంకొంత ఆనందాన్ని జుర్రుకోవాలనీ మనిషి తాపత్రయం. వయసుతో నిమిత్తం లేకుండా ఈ తాపత్రయం మనుషులందరిలోనూ ఉంటుందేమో! దీన్ని జయించిన వాళ్ళే మనుషులు, మహర్షులు. జీవన్ముక్తులు.

ఆపరేషన్ ఫెయిలయింది. కృష్ణ మెదడు మొద్దుబారిపోయింది. మరేమీ ఆలోచించలేకపోయాడు. మృతశరీరం ముఖం మీద నుంచి తెల్లటి బట్ట కప్పేస్తూ ఉంటే మనిషి అల్పత్వం, అశక్తత మరోసారి అవగతమయింది. అతడికి మనిషి ఆరాటం, ప్రయత్నం, శాస్త్ర విజ్ఞానం, మనం ప్రతీ పనీ సీరియస్‌గా చెయ్యడం— అంతా అర్థవిహీనం అనిపించింది. అతడికి ఒక్కసారి గట్టిగా నవ్వాలనిపించింది. అంతా నిశ్శబ్దంగా బయటికి నడిచారు.

చచ్చిపోయిన ఆవిడ తాలూకు భర్త, పిల్లల్ని చూస్తే అతడికి గుండె నీరయింది. ఏం చెయ్యగలడు? ఎవరైనా ఏం చెయ్యగలరు? ఎవరైనా ఎప్పుడైనా ఏమైనా చెయ్యగలరా? ఏదేదో సాధించామన్న గర్వం ఎంత హాస్యాస్పదం! ఆదిమకాలంలో మనిషి చచ్చిపోతే, ప్రాణం లేని ప్రాణేశ్వరిని ఒళ్ళో పెట్టుకుని ఆ ప్రియుడు ఏం చెయ్యాలో, ఎవరి నడగాలో తెలియక, దిక్కు తోచక, ఆకాశం వైపు చూసేవాడట దీనంగా, నిస్సహాయంగా. మనం మాత్రం? అంతకన్న ఇంకేమైనా చెయ్యగలమా మనం మాత్రం? ఏదీ మన ప్రగతి?

కాళ్ళీడ్చుకుంటూ రూమ్‌కి చేరుకున్న కృష్ణకి గది ముందు ఎవరో అపరిచిత వ్యక్తి కనిపించాడు. అతను రమణారావు. "నేను శైలజ అన్నయ్యని. హైదరాబాదు నుంచి వస్తున్నాను" అని చెప్పుకున్నాడు.

కృష్ణకి అంతా ఏమిటోగా ఉంది. ఏమిటి ఇతను ఇలాంటి సమయంలో వచ్చాడు? తన మూడ్ ఏమీ బాగాలేదు. ఒక్కసారి తనని తాను అద్దంలో చూసుకున్నాడు. ఎప్పుడో ఉదయం చేసిన భోజనం. ఆకలి నీరసంగా ఉంది. రోజంతా ఆపరేషన్ థియేటర్లో నిలబడి ఉండడం వల్ల కాళ్ళు లాగేస్తున్నాయి. జుట్టు చెదిరిపోయింది. బట్టలు నలిగిపోయాయి. ముఖం అలసటగా, జిడ్డుగా, నీరసంగా ఉంది. మెదడులోని పరిస్థితికి ప్రతీకలా గ్లూమీగా ఉంది. కృష్ణకి చికాగ్గా ఉంది. వేళకి ప్రసాద్ కూడా లేడు. ఈ రోజు ఆఫీసు నుంచి ఆలస్యంగా వస్తానని చెప్పేడు ఉదయం.

ఓపిక తెచ్చుకుని రమణారావుని పలకరించేడు కృష్ణ. "కూర్చోండి. ఇప్పుడే ముఖం కడుక్కుని వస్తాను" అని బాత్‌రూమ్ కెళ్ళి ముఖం కడుక్కున్నాడు. చల్లటి నీళ్ళు ముఖానికి కళ్ళకి తగలగానే ఎంతో ఉపశమనం కలిగింది. స్నానం చేస్తే బాగుండుననిపించింది. కాని టైమ్ లేదు. అవతల అతను వెయిట్ చేస్తున్నాడు. గదిలో కొచ్చి డ్రెస్ చేసుకున్నాడు కృష్ణ.

అంత సేపూ నిశ్శబ్దంగా కృష్ణనీ, గదినీ, గదిలో వస్తువులనీ, పుస్తకాలనీ పరిశీలనగా చూస్తూ కూర్చున్నాడు రమణారావు. "పదండి. అలా బయటికి పోయి మాట్లాడుకుందాం" అని దారి తీశాడు కృష్ణ.

రోడ్డు మీదకొచ్చాక ఎపాలజిటిక్‌గా అన్నాడు కృష్ణ. "ఈ రోజు నా మనసేమీ బాగుండలేదండీ! రోజంతా ఓ మేజర్ ఆపరేషన్ ఎటెండ్ అయ్యాం. పాపం ఆ పేషెంటు చచ్చిపోయింది. తల్చుకుంటే ఏమిటో బాధగా ఉంది" అన్నాడు.

సానుభూతిగా చూశాడు రమణారావు. "డాక్టర్లు కదా, ఇలాంటి వాటికి అలవాటు పడిపోవాలి" అన్నాడు చిరునవ్వు తెచ్చిపెట్టుకుని.

కృష్ణ జవాబివ్వలేదు. నీరసంగా నవ్వి ఊరుకున్నాడు.

కాఫీ తాగుతున్నప్పుడు రమణారావు కొన్ని అనవసర ప్రశ్నలు వేశాడు.

"ఫైనలియరా?

"రూమ్‌లో మీరు కాక ఇంకొకాయన ఎవరో ఉన్నట్టున్నారు?

"మీ చదువు ఎలా ఉంది?

"ప్రాక్టీస్ ఇక్కడే పెడతారా?" వగైరా వగైరా. అప్పుడు రంగంలోకి దిగాడు.

"మా సిస్టర్‌కి ఏదో లెటర్ రాశారట" అన్నాడు.

"ఊఁ" అని ఊరుకున్నాడు కృష్ణ. ఎందుకో రమణారావుని చూస్తే అంత సదభిప్రాయం కలగడం లేదు. అకాలంలో వచ్చి తన మూడ్ బాగా లేనప్పుడు ఏవో చెత్త ప్రశ్నలు వేసి తన గురించి చెడు ఇంప్రెషన్ మోసుకెళ్తాడేమోనని ఓ మూల చికాగ్గా ఉంది. అందుచేత అతను ఏం అడిగినా పెడసరంగా జవాబివ్వాలనిపిస్తోంది గాని మర్యాదగా, సిన్సియర్‌గా మాట్లాడాలనిపించడం లేదు. అవును. రాశాడు. ఆ అమ్మాయి జవాబిచ్చింది. మధ్య ఇతనికెందుకు భయపడాలి తను?

రోడ్డెక్కాక రమణారావు కృష్ణ తల్లిదండ్రుల గురించి, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళ గురించీ ప్రశ్నలు వేశాడు. ఇంకేవేవో అడిగాడు. ముక్తసరిగా, నిర్భయంగా, మేటర్ ఆఫ్ ఫేక్ట్‌గా వచ్చాయి జవాబులు.



"మా చెల్లి ఫోటో చూశారు కదూ మీరు?" అనడిగేడు రమణారావు.

చూశానన్నాడు కృష్ణ. తనది అడుగుతాడేమో! సిద్ధంగానే ఉంది. కాని ఇవ్వాలని లేదు. అవసరమైతే పోస్టులో ఆ అమ్మాయికే పంపించవచ్చు. ఇంకా ఆ పరిస్థితి వస్తే తానే వెళ్తాడు ఆ ఊరు. ఇతని దగ్గర తను పూర్తిగా రివీల్ అయిపోనక్కర్లేదు. వెళ్ళి ఏం చెప్పుకుంటాడో చెప్పుకోనీ! తన అభిప్రాయాలన్నీ ఇతనికి ఎక్స్‌పోజ్ చెయ్యడం అనవసరం!

రమణారావు ఫోటో అడగలేదు ఎందుకనో! విశాఖపట్నంలో అతను 'ఏ పని మీద' వచ్చాడో, ఎక్కడ దిగాడో, ఎన్ని రోజులు ఉంటాడో, అతను చెప్పనూలేదు, కృష్ణ అడగనూ లేదు. వాళ్ళ చెల్లెల్ని గురించి ఏవో వివరాలు చెప్పేడు. వాటిలో పనికొచ్చేవీ కృష్ణకి తెలియనివీ ఏదీ లేవు. అనుకున్నట్టుగానే, శ్రీనివాస్ దగ్గర్నుంచే ఎక్కువ సమాచారం వచ్చింది.

కాసేపయ్యాక "వస్తానండీ" అని షేక్‌హాండ్ కోసం చెయ్యి చాచాడు రమణారావు. "మంచిది" అని షేక్ ఇచ్చాడు కృష్ణ.

ఇద్దరూ విడిపోయారు.

రూమ్ కెళ్ళాక కృష్ణ శైలజకి ఉత్తరం రాశాడు. పెద్దదే వచ్చింది. రఫ్ డ్రాఫ్ట్ తయారు చెయ్యడానికే గంట పైగా పట్టింది. మరి బయట కెళ్ళి భోజనం చెయ్యాలనిపించలేదు. ఒకటికి రెండు సార్లు ఆ ఉత్తరం చదువుకుని, సంతృప్తిగా ఉందనుకున్న తరవాత కాగితాలు పక్కన పెట్టి నిశ్చింతగా నిద్రపోయాడు. రోజంతా బడలిక వల్ల ఉత్తరం రాసేసిన రిలీఫ్ వల్లా వెంటనే నిద్ర పట్టింది.

ప్రసాద్ ఎప్పుడు వచ్చి పడుకున్నాడో అతనికి తెలియనే లేదు.

★ ★ ★ ★

ఉదయం లేచి చిత్తు ప్రతీ తెల్ల కాగితాలూ ముందేసుకు కూర్చున్నాడు కృష్ణ. ప్రసాద్ స్నానం చేసి వచ్చాడు అప్పుడే.

"ఏమిటి, ఆ చెత్తంతా ఫెయిర్ చేసి పంపిస్తావా ఆ అమ్మాయికి?" అనడిగాడు.

అంటే చదివేడన్నమాట.

"ఊఁ! ఉన్నదున్నట్టుగా! -ఏం? నీకేమైనా అభ్యంతరమా?" అన్నాడు కృష్ణ, రాయడానికి ఉద్యుక్తుడవుతూ.

"నాకేం అభ్యంతరం? కాని పాపం ఆ అమ్మాయిని అలా బెదరగొట్టేసి, ఏడిపించెయ్యడం... నీకే మంచిది కాదేమోనని నా అభిప్రాయం. అయినా నా నోటితో నేనెందుకులే అనడం? ఆపైన ఏమయినా అయితే నన్నంటావు!" తప్పుకుంటూ అన్నాడు ప్రసాద్.

ఇది కొంచెం ఆలోచించవలసిన విషయమే. సీరియస్‌గా తను తన అభిప్రాయాలు, ఆదర్శాలు, అన్నీ ఉద్ఘాటించి సుదీర్ఘ లేఖ రాసేశాడు గాని, ఆ

## మన శాస్త్రవేత్తలు

# 'అటామిక్' హోమీ బాబా!

హోమీ జహంగీర్ బాబా పేరు వినని వాళ్ళు చాల అరుదుగా ఉంటారు. బాబా అటమిక్ రీసర్చ్ సెంటర్ గురించి తెలియనివాళ్ళు ఎంతమంది ఉంటారు? మనదేశంలో న్యూక్లియర్ ఫిజిక్స్ వికసించడానికి కారణభూతుడైన వ్యక్తి, బాబా. ఈయన అణుశక్తి పరిశోధనలు మొదలుపెట్టాడు. అంతేకాదు అణుశక్తి ప్రయోజనాలు విశ్వశాంతికే పరిమితం కావాలని వాంఛించాడు కూడా!

అక్టోబర్ 30, 1909న పుట్టిన బాబా సంపన్నమైన పారశీ కుటుంబానికి చెందిన వ్యక్తి. చిన్ననాటి నుంచే సైన్స్ అంటే ఎక్కువ ఆసక్తిని చూపేవాడు. తండ్రికి మాత్రం ఈయన గొప్ప ఇంజనీర్ కావాలని ఉండేది. అయితే యావత్ప్రపంచం గర్వించదగ్గ శాస్త్రజ్ఞుడయ్యాడు బాబా మహామహులు ఎన్‌రికో ఫెర్మి, ఉల్ఫ్‌గాంగ్ పౌలి వంటి మేధావులతో కలిసి పనిచేసే అదృష్టం ఈయనకు కలిగింది.



1940 లో ఇంగ్లాండ్ నుంచి స్వదేశానికి తిరిగివచ్చి బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో చేరాడు. అప్పటికే కాస్మిక్ కిరణాల మీద పరిశోధనలు చేసి లబ్ధ ప్రతిష్టుడైన వ్యక్తి బాబా. ఈయన ఆవిష్కరించిన "మీసాన్" అయిన్‌స్టీన్ సాపేక్షతా సిద్ధాంతానికి నిరూపణగా కూడా ఉపకరించింది. 1937 లో బాబా, జర్మన్ శాస్త్రజ్ఞుడు హైట్లర్ కలిసి వెలువరించిన కాస్మిక్ కిరణాలకు సంబంధించిన పరిశోధనలు- ఆయనను జగత్ప్రసిద్ధుణ్ణి చేసాయి. కాస్మిక్ కిరణాలు, క్వాంటమ్ మెకానిక్స్- ఈ అంశాలలో ఈయన చేసిన పరిశోధనలను గుర్తించి బాబాను 'ఫెలో ఆఫ్ రాయల్ సొసైటీ"గా కూడా ఎన్నుకోవడం జరిగింది.

న్యూక్లియర్ ఫిజిక్స్ ప్రాముఖ్యాన్ని వివరించి చెప్పి అణుశక్తి పరిశోధనల వైశిష్ట్యాన్ని స్పష్టం చేసి 1945 లో "టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రీసర్చ్" ఆవిర్భావానికి మూలకారకుడయ్యాడు బాబా. అప్పటి ప్రధాని కీ. శే. జవహర్‌లాల్ నెహ్రూ అణు పరిశోధనలకు సంబంధించి బాబాకు పూర్తి స్వేచ్ఛనివ్వడంతో మనదేశంలో అణుశాస్త్రం బహుముఖంగా వికసించగలిగింది. 1948 లో అటమిక్ ఎనర్జీ కమిషన్ రూపొందింది. దానికి బాబా ఛైర్మన్ కాగలిగాడు.

బాబా నేతృత్వంలో అప్సర, సైరస్, జెర్లీనా అని పిలువబడుతున్న అటమిక్ రియాక్టర్‌లు రూపొందాయి. అంతేకాదు న్యూక్లియర్ ఫిజిక్స్ వికాసానికి అవసరమైన యురేనియం ఖనిజం కోసం పెద్ద ఎత్తున గాలింపులు కూడా మొదలయ్యాయి. 1963 లో మనదేశంలో మొట్టమొదటిసారిగా తారాపూర్‌లో అటమిక్ పవర్ స్టేషన్ ప్రారంభమైంది. ఇందుకు ప్రధాన కారకుడు హోమీ బాబాయే. ఈయన పరిశోధనలు ఎలక్ట్రానిక్స్, స్పేస్ సైన్స్, రేడియో అస్ట్రానమి, మైక్రోబయాలజి రంగాలకు కూడా విస్తరించింది. ఉదకమండలం (ఊటీ)లో ఈయన రూపొందించిన రేడియో టెలిస్కోప్ ఇప్పటికీ ఉంది. 1974 మే 18 న రాజస్థాన్‌లోని పొఖ్రాన్ వద్ద అణు పరీక్ష శాంతియుతప్రయోజనం కోసం విజయవంతంగా జరగగలిగిందంటే అందుకు కారణం బాబా చొరవే అని చెప్పాలి. అయితే దురదృష్టవశాత్తు ఆ దృశ్యం చూడడానికి బాబా నోచుకోలేదు. 57 ఏళ్ళ వయస్సులోనే 1966 లో విమాన ప్రమాదానికి గురై ఈయన మరణించడం దురదృష్టకరం. 1967 లో ట్రాంబేలోని అటమిక్ ఎనర్జీ ఎస్టాబ్లిష్‌మెంట్ సంస్థను బాబా అటమిక్ రీసర్చ్ సెంటర్‌గా తీర్చిదిద్దడం జరిగింది.

బాబా మేధావిగా ఎంత గొప్పవాడో సహృదయుడిగా అంతకు మించినవాడు. జీవితాంతం బ్రహ్మచారిగా ఉన్న ఈయన "నేను సైన్స్‌నే పెళ్ళి చేసుకున్నాను" అని పదే పదే చమత్కరించేవాడు. ఈయన చిత్రకారుడు కూడా. ఈయన ఎంతో అందంగా ఉండేవాడు. రూపమే కాదు, వ్యక్తిత్వం కూడా అందమైనదే. అందుకే అందరివాడై, అమరుడై నిలిచిపోగలిగాడు హోమీబాబా.

- డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

అమ్మాయి ఇదంతా అరిగించుకోగలదా? పాపం కన్ఫ్యూజ్ అయిపోదు కద! ప్రసాద్ చెయ్యి లేకపోవడం వల్ల ఉత్తరం మీద, శైలి మీద కేవలం తన ముద్రే ఉంది, కవిత్వాన్ని పరిహరించడానికి ఎంత ప్రయత్నం చేసినా. అయితే, ప్రసాద్ సలహా తీసుకుని దీన్ని ఒక్కసారి తిరిగే రాస్తే?

కాని ఇలా ఎన్నాళ్ళు? స్వంత ఉత్తరాలకి మరొకరి సలహాలూ సహాయాలూ అడగడం సిగ్గుచేటు కాదూ? ఏమైతే అయింది. రాత్రి సిన్సియర్‌గా, ఉద్రేకంగా తన మనసంతా విప్పి రాశాడు ఆ ఉత్తరం. తన ఆలోచనలూ అభిప్రాయాలూ ఉన్నవి ఉన్నట్టే చెప్పాలి గాని స్నేహితుడి సెన్సారింగ్ ఏమిటి? అది నిజానికి ముసుగు తొడగడం కాదూ? ఆ అమ్మాయే చూసుకుంటుంది, తనని ఎలా అర్థం చేసుకోవాలో. తను ఈ విషయమై పెద్ద ఆశలేం పెట్టుకోలేదు, మరీ శ్రద్ధ తీసుకోవడానికి. ఎలా జరగాలో అలా జరుగుతుంది.

అదీకాక, ఆ అమ్మాయిని మనం తక్కువగా ఎందుకు అంచనా వెయ్యాలి? తెలివైనదే అని చెప్పాడు శ్రీనివాస్. ఆమె కూడా అలాగే ఆలోచిస్తుందేమో! కవిత్వం అంటే ఇష్టమేనేమో! తను ఉత్తరాలు కవితాత్మకంగా రాస్తేనే ఎక్కువ ఇష్టపడుతుందేమో! సాధారణంగా అమ్మాయిలకి

**ప్రశ్న**

బొడ్డుమల్లె
బొట్టుబిళ్ళ
ఆడపిల్ల
మగాడి కొలిక గలవా?
'ముడి' లేకుండా మనవా?
మనిషికి మనిషే జోడు
అవసరమయ్యే ఈడు
మగువకు మగడొకతోడు
అంతకు మించేంకాదు!

–పోతరాజు రామకృష్ణప్రసాద్

కొంచెం ముస్తాబు చేసిన వాక్యాలంటేనే ఇష్టం. తనకి చేతనై ఉండి కూడా అది వదిలేసి ప్రయత్న పూర్వకంగా 'బాల్డ్'గా ఎందుకు రాయాలి ఉత్తరాలు?

శ్రద్ధగా ఉత్తరమంతా చక్కగా మళ్ళీ రాశాడు కృష్ణ. ఒకటి రెండు చోట్ల శైలిని అలంకరించాడు కూడా తిరిగి రాస్తున్నప్పుడు ఉత్తరం చక్కగా కుదిరినట్టనిపించింది అతడికి. సంతృప్తిగా సంతకం పెట్టేడు. తను ఇప్పటికి రాసిన రెండు ఉత్తరాల చిత్తు ప్రతులు, అటునుంచి వచ్చిన జవాబు ఒక కవరులో భద్రపరిచాడు.

"నిన్న వాళ్ళన్నయ్య వచ్చాడా?" అడిగాడు ప్రసాద్. రాస్తున్న కృష్ణని గమనిస్తూ.

"ఊ" అన్నాడు కృష్ణ, తలెత్తకుండా.

"ఏమిటి విశేషాలు?"

"విశేషాలేమీ లేవు."

"సుఖం లేదా?"

"ఏమిటి?"

"అదే... మీ బామ్మర్ది..."

"పరిచయం పెంచుకునేది అతనితో కాదు కదా!"

"అయితే పక్కకి పెట్టెయ్యాల్సిన బాపతే అన్నమాట! కాని రుక్మి బాపతు కాదు కద! ఏడిపించెయ్యడా మనని?"

"అప్పుడు రుక్మికి పట్టిన గతే పడుతుంది."

"ఔనౌను నువ్వు కృష్ణుడివే కదా! అయితే ఘనుడాభూసురుడు శ్రీనివాస్ మళ్ళీ వస్తాడేమో!" అన్నాడు ప్రసాద్.

"ఎనాలజీ మరీ అంత పెంచెయ్యకు" అన్నాడు కృష్ణ నవ్వుతూ.

ఉత్తరం పని పూర్తి చేసి హాయిగా బద్ధకంగా కాళ్ళు చాపుకుని మంచం మీద పడుకున్నాక అతనికి చాలా ఉల్లాసంగా అనిపించింది.

(ఇంకా ఉంది)

# జయలలిత పాలిట ధావన్‌గా మారిన నటరాజన్?



సతీమణి శ్రీమతి శశికళతో నటరాజన్



ఇటీవల వార్తల్లో కుమారి జయలలిత తర్వాత అతిగా కనబడే వ్యక్తి శ్రీనటరాజన్. శ్రీ నటరాజన్ మొట్టమొదటిగా ప్రభుత్వోద్యోగంలోకి ప్రవేశించడానికి కారకుడు, తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎం. కరుణానిధియే! నటరాజన్‌కు తొలుతగా ప్రజా సంబంధాల శాఖలో సహాయ అధికారిగా పదవిని కట్టబెట్టబడింది. శ్రీ నటరాజన్‌ను గృహస్థునిగా కూడా శ్రీ కరుణానిధే చేశారు. అత్యవసర పరిస్థితి దేశంలో విధించినప్పుడు శ్రీ నటరాజన్ పదవి కోల్పోయి మద్రాస్ అళ్వారుపేటలో వీడియో షాపు పెట్టుకొని నష్టంతో నడుపుకొచ్చారు.

అదృష్టవశాత్తు జయలలితకు నచ్చిన వీడియో క్యాసెట్ శ్రీ నటరాజన్ "ప్రెజెంట్" చేయడంతో జయలలితకు అతి సన్నిహితుడైనాడు. ఇక అక్కడ్నించి తిరిగింది అతని జాతకం. దీని ఫలితంగా శ్రీ నటరాజన్ సతీమణి శ్రీమతి. శశికళ జయలలిత "పర్సనల్ మేకప్ ఉమెన్"గా నియామకమైనారు. "ఇప్పుడే మేడమ్ జయలలిత ప్రధానితో ఫోన్‌లో మాట్లాడారు", "ఇప్పుడే గవర్నర్‌తో సమావేశం జరిపి జయలలితగారు వచ్చారు", "మీకు తప్పకుండా ఎన్నికల్లో సీటు ఇప్పిస్తాం", "పార్టీ ఫండ్ తేండి. తర్వాత మేడమ్ గార్ని కలువవచ్చు" అంటూ శ్రీ నటరాజన్ తన వాక్చాతుర్యంతో అందరినీ ఆకట్టుకొని మేడమ్ జయలలిత "ఇమేజ్" పెంచి పోయస్ గార్డెన్‌లో ఒక ప్రముఖ వ్యక్తిగా చెలామణి అయ్యారు.

కొన్ని అనారోగ్యాలతో బాధపడే శ్రీ నటరాజన్ జయలలిత అంగరక్షకుల దళానికి కూడా అధిపతిగా వ్యవహరించాడు.

మేడమ్ జయలలిత నుంచి శ్రీ నటరాజన్ వలన వల్ల దూరమైన ప్రముఖులెందరో ఉన్నారు. వారిలో ముఖ్యులు శ్రీయుతులు నెడుంజెళియన్, అరంగనాయకమ్ ప్రభృతులు ఉన్నారు... శ్రీ నటరాజన్‌కు మద్రాస్‌లో జెసింద్‌నగర్‌లో ఒక అందమైన, బ్రహ్మాండమైన భవంతి ఉన్నది. రోజుకు నాలుగు వేల రూపాయల అద్దె కట్టి ఒక ఫైవ్‌స్టార్ హోటల్‌లో శ్రీ నటరాజన్ కొన్ని రోజులు బస చేశారని శ్రీ కరుణానిధే ఆరోపణలు చేశారు. చివరకు శ్రీ నటరాజన్ కథ ఏ మలుపు తిరుగుతుందో!

(శాంతి)



అరెస్టు కాంగానే నటరాజన్

# ఐయామ్ సారీ!

సుజాత నవగ్రహాలకు ప్రదక్షిణం చేస్తోంది.

## ఆ రోజు శనివారం. గుడిలో చాలా రద్దీగా ఉంది.



సుజాత ఆఖరి ప్రదక్షిణం ముగించి కళ్ళు మూసుకొని నిశ్చలంగా భగవంతుని ప్రార్థించింది. పూజారి ఇచ్చిన పువ్వులు తలలో తురుముకొంటు వెనుతిరిగింది.

ఇంతలో.... అతను.... సుజాతను గుద్దుకున్నాడు. సుజాత విసురుగా కోపంగా, తలెత్తి అతని కేసి చూసింది. అతని కనుబొమ్మలు ఆశ్చర్యంతో ముడిపడ్డాయి. ఒక్కకణం సుజాతను పరిశీలనగా చూసాడు. సుజాత గుండె ఝల్లుమన్నది. "మిష్టర్, ప్లీజ్ మూవ్!" కరుకుగా అన్నాననుకుంది. కానీ మార్దవంగా పలికింది. అతను చిన్నగా నవ్వి, "ఐయామ్ సారీ మిస్"... అని పక్కకి జరిగాడు. అతని నవ్వు చూసి సుజాతకి ఒళ్ళు మండిపోయింది.

"హల్లో! సుజా ఎప్పుడొచ్చావ్?"... అడిగింది రేఖ.

"ఇప్పుడే".... కోపంగా జవాబిచ్చింది సుజ.

"వ్వాట్ హేపెన్డ్ టు యూ?"....

**ఎస్.వి. కనకదుర్గ**

"నథింగ్"... నిట్టూరుస్తున్నట్టు పలికింది.

"ఎక్స్యూస్ మీ మిస్! యువర్ హాన్కీ"... ఆమెకు అందించి దూరంగా వెళ్ళి కూర్చున్నాడు... అతను.

"హౌ! హూ ఈజ్ దట్ హేండ్సమ్ గై???... ఈజ్ హీ రిలేటెడ్ టు యూ?!!"... కనుబొమ్మలు తమాషాగా ఎగరేస్తూ అడిగింది రేఖ.

"రిలేటెడ్ టు మీ?... నాన్సెన్స్. ఇలాంటి ఇన్డీసెన్సీ వాళ్ళు నాకు రిలేషన్సు ఎలా అవుతారు? అసలు మొదటి నుంచి మగవాళ్ళకి స్త్రీలనూ చూస్తే లోకువ. గుడ్డివాళ్ళలాగా డాష్ ఇవ్వడాలు, పైగా సిగ్గు లేకుండా బాగా పరిచయస్తుడిలాగా నవ్వడం... ఐ హేట్ సచ్ పీపుల్స్... దేబిరి మొహంలాగా "జూ"లో జంతువుని చూసినట్టు పరీక్షగా చూడడం... వీళ్ళ ఆగడాలకు అంతులేదు... మగ మహారాజులని గర్వం... రాస్కెల్స్"... అతనిపైన ఉక్రోషమంతా వెళ్ళగక్కింది.

ఆమె ఉపన్యాసంతో జరిగిన విషయం అర్థం చేసుకుంది రేఖ.

"స్టాప్ దేర్, స్టాప్ దేర్... డియర్. మరీ మగాళ్ళందరిని అలా తిట్టేయకు. మగవాళ్ళలో మంచివాళ్ళు లేరనా నీ ఉద్దేశం?... నో! నో! నెవర్ థింగ్ లైక్ దట్... అయినా అతనిని చూస్తూంటే నీ కళ్ళకి "రోగ్"లాగా కనపడుతున్నాడా?... ఎంతో మంచివాడిలాగా ఉన్నాడు. నువ్వు అనవసరంగా నోరు పారేసుకోకు. కాస్త పరీక్షగా చూసినంత మాత్రాన దేభ్య మొహం అంటావా? ఒకవేళ అతను యిదివరలో నిన్నెక్కడైనా చూసాడేమో? అందుకే అనుమానంగా నీకేసి పరీక్షగా చూసి ఉండచ్చు! సమ్టైమ్స్... మనం కూడా ఏదో ఆలోచిస్తూ ఎదుటి వాళ్ళకి డాష్ యిస్తాం... అది కూడా తప్పేనా?... నిజానికి మగవాళ్ళలో చాలామంది ఇన్డీసెంట్గా బిహేవ్ చేస్తారు... కాదనను... బట్... రిమెంబర్... నాట్ ఆల్! ఒ. కే!... అసలు వాళ్ళ ప్రవర్తనకు తగ్గట్టుగా మన స్త్రీలలో నూటికి ఎనభై మంది అనుమానస్తులు... ఇంతవుంటే... అంత అనుకునే రకం... బస్సులో ఎవర్నో చూసి నవ్వితే మన్నిచూసే నవ్వాడనుకొని కోపం తెచ్చుకుంటాం... ఎవరో చిన్న పిల్లకి "టాటా" చెప్తే మనకే చెప్పాడనుకొని రుసరుస లాడుతాం... ఎక్కడో వాల్పోస్టర్లు చూస్తుంటే మనల్నే చూస్తున్నాడనుకొని ఉరిమి చూస్తుంటాము. నమ్మదిగా... పరిశీలనగా చూస్తే నిజం బయట పడుతుంది... అంతేగానీ మగవాళ్ళలో మంచి వాళ్ళు లేకపోలేదు... కొంత దరవాటు, ఖంగారు... మిస్అండర్స్టాండింగ్తో మనం వాళ్ళను నేరస్తులుగా చిత్రిస్తున్నాము?... నీకో నిజం చెప్పనా?... అందమైన వాళ్ళు కనబడితే ఒకటికి రెండుసార్లు చూడడం మానవ నైజం... అంతెందుకు... అతను చాలా స్మార్టుగా ఉన్నాడని ఇప్పటికిమూడుసార్లు చూసాను... కాబట్టి నేను కూడా.... "రోగ్" వంటి దాన్నా?... ప్రశ్నార్థకంగా చూస్తూ అడిగింది రేఖ.

"అబ్బబ్బబ్బా.... అయిందా నీ లెక్చరు... దీన్ని దేవాలయ మంటారు... ఇది వేదికా కాదు... నువ్వు లెక్చరరు కాదు.... ఒ. కే చీకటి పడుతోంది... బయల్దేర్దాం... పద..." అంటూ రేఖ ఉపన్యాసాన్ని త్రోసిపుచ్చింది సుజాత. ఎందుకో అతనికేసి ఒకసారి చూడాలని పించింది సుజాతకు... చిర నవ్వుకుంటున్న నెపంతో మెల్లగా వెనక్కి తిరిగి చూసింది... అతడు ఆమె కేసి శ్రద్ధగా చూస్తున్నాడు... చూపులు కలిశాయి... అతడు చిన్నగా నవ్వేసాడు. విసురుగా జడ వెనక్కి వేసుకొని అడుగులు ముందుకు వేసింది. "ఇడియట్"... మనసులో అనుకోకుండా ఉండలేక పోయింది సుజా!... గట్టిగా అంటే మళ్ళీ రేఖ "క్లాసు" తీసుకుంటుందని భయమేసింది.

* * * * * * *

"సుజా! రామ్మా... పెళ్ళి కొడుకు నిన్ను తీసుకు రమ్మంటున్నాడు... నా బంగారు తల్లి... అప్పుడే పెళ్ళి కూతురు కళ వచ్చేసింది... అతను ఎంత మంచివాడనీ... ప్రతి శుక్రవారం... గుడికి వెళ్తాడుట... ఈడుజోడు... మీ యిద్దరు ఎంత బావుంటారో?..." శాంతమ్మ మురిసి పోయింది.

"అబ్బా! చాల్లేమ్మా... నువ్వు మరీను"... సిగ్గుపడింది సుజాత. మెల్లిగా అడుగులో అడుగేస్తూ అణకువగా సోఫాలో తండ్రి పక్కన కూర్చుంది. పరిచయాలు మొదలు పెట్టారు రామారావుగారు.

"ఇతనే పెళ్ళి కొడుకు విజయ్... బ్యాంకులో మేనేజరుగా పని చేస్తున్నాడు. తల్లీ, తండ్రీ శ్రీకాకుళంలో వుంటున్నారు"... చెప్పడం ఆపారు రావుగారు.

"నమస్తే"... మెల్లిగా తల పైకెత్తి రెండు చేతులు వినయంగా జోడించింది సుజాత... "అతను"... చిన్నగా నవ్వేసాడు... అతని కళ్ళు కొంటెగా మెరుస్తున్నాయి. సుజాత ఆశ్చర్య పోయింది.

"ఇడియట్... నువ్వా?!!... ఎంత ధైర్యం... ప్రొద్దున గుడిలో అసహ్యంగా చూసింది చాలక పైగా పెళ్ళి చూపులకు వస్తావా... ఎంత పొగరు"... కసిగా అనుకుంది. పది నిముషాలు తండ్రి అతనితో ఏదో పిచ్చాపాటీ మాట్లాడారు. సుజాతకు ముళ్ళమీద కూర్చున్నట్టుంది.

"మిస్ సుజాత! ఇఫ్ యూ డోన్ట్ మైండ్, మీతో పర్సనల్గా మాట్లాడచ్చా?" సూటిగా అడిగాడతను.

"హుఁ! పర్సనల్గా మాట్లాడాలా... రాస్కెల్... ఏం చెప్తాడు?... ఐయామ్ సారీ... మీరని తెలియదు...

## శ్రీదేవి నామమెంతో రుచిరా



హిందీ చలన చిత్రరంగాన్ని ఏలుతున్న అందాల రాణి శ్రీదేవిని పడగొట్టేందుకు డింపుల్, రేఖ, మాధురీ దీక్షిత్ల వంటి నటీమణులు ఒక వైపు తంటాలు పడుతూ వుంటే, మరో వైపు శ్రీదేవి తన ఆధిక్యతను నిలుపుకుంటూనే వుంది. నిర్మాతలు, దర్శకులు, ఆఖరికి పాటల రచయితలు సైతం శ్రీదేవికే వంత పాడుతున్నారట. అంతేకాదు... పాటల రచయితలు, మాటల రచయితలు శ్రీదేవి పేరు వచ్చేట్టుగా పాటలు, మాటలు సృష్టించేందుకు నానా అవస్థ పడుతూ ఎట్టకేలకు సఫలమవుతున్నారట.

ఇదిట్లా వుంటే శ్రీదేవి పేరులోని శ్రీ అని పెట్టుకుంటే ఆమెలా పేరొస్తుందని కాబోలు చాలా మంది శ్రీధన, శ్రీవద, శ్రీరేఖ, శ్రీమళ అని పేర్లెట్టుకుంటున్నారు. ఇదెక్కడి చోద్యమో మరి!

# నలభీమపాకం

నలభీమపాకం

## తోటకూర పెరుగు పచ్చడి

మేమున్న ప్రాంతంలో కూరగాయలు అంతగా దొరకవు మా దొడ్లో తోటకూర బాగా ఉంది. దాంతోనే తరచు, తోటకూర పప్పు, తోటకూర పులుసు చేస్తూ ఉంటాము ఎప్పుడూ పాత రకాలేనా ఈ రోజు తోటకూర, పెరుగు పచ్చడి చేస్తానన్నాడు మా అబ్బాయి. పెరుగు పచ్చడా, అదెలాగా అన్నాను నేను. చేసి చూపిస్తాగా



అన్నాడు. సరే అన్నాను.

కావలసిన వస్తువులు : తోటకూర కట్టలు - 2 (చిన్నవి)




ఉల్లిగడ్డ - 1 పెద్దది, పచ్చిమిర్చి- 2, పెరుగు పెద్ద కప్పుడు, చిటికెడు పసుపు, పోపు గింజలు (ఆవాలు, మినపప్పు), ఎండుమిర్చి- 2, తగినంత ఉప్పు.

చేయు విధానము:- ముందుగా తోటకూర బాగా కడిగి, తరిగి, పసుపు తగినంత ఉప్పు చేర్చి, కొద్దిగా నీరు పోసి, ఉడకబెట్టాలి. వార్చి నీరు పారబోయకూడదు. తగినంతగానే నీరు పోయాలి. ఉల్లిగడ్డ సన్నగా తరిగి, బాణలిలో నూనె వేసి, పోపుగింజలు, ఎండుమిర్చి చిక్కవేసి, అవి వేగాక, ఉల్లి చెక్కు, పచ్చిమిర్చి ముక్కలు దోరగా వేయించాలి. పెరుగులో కొద్దిగా ఉప్పు వేసి, ఉడకబెట్టిన తోటకూర, వేపిన ఉల్లి చెక్కు మిశ్రమమును కలపాలి. తోటకూర పెరుగు పచ్చడి తయారు కారం మన అభిరుచిని బట్టి మార్పు చేసుకోవచ్చును. ఇష్టముంటే వెల్లుల్లి రెక్కలు కూడా నూనెలో వేయించి కలుపుకోవచ్చును. మీరు కూడా చేసి చూస్తారు కదూ!

– డి. విజయలక్ష్మి

మగవంటలు – నల"భీమపాకం" శీర్షికకి–

ఈ కూపన్ తప్పక జత చేయాలి ------

## ఐయామ్ సారీ!

అందుకే. అలా చూసాను"... అంటాడా?"... ఆలోచిస్తోంది సుజాత.

"వెళ్ళు తల్లీ... నీ స్టడీ రూములో కూర్చోండి".. తండ్రి పూర్వపంగా పలికాడు. తండ్రి మాట కాదనలేక సుజాత స్టడీ రూముకి దారి తీసింది. విజయ్ ఆమెను అనుసరించాడు.

అతను కుర్చీలో కూర్చొని... మరో కుర్చీ చూపిస్తూ......

."ప్లీజ్ బీ సీటెడ్"... అన్నాడు.

"షటప్! నా యింటికి వచ్చి నాకు మర్యాదలు చేస్తావా?..." అనాలనుకుంది... అనలేక పోయింది. కుర్చీ విసురుగా లాగి కూర్చుంది. ఐదు నిమిషాలు నిశ్శబ్దంగా దొర్లి పోయాయి. అతను స్టడీ రూమును పరిశీలనగా చూసాడు.

"వెరీ నైస్"– అన్నాడు నవ్వుతూ...

"ఏమిటీ"- అన్నట్టు కళ్ళు పైకెత్తి కోపంగా చూసింది.

"మీ స్టడీ రూమ్ బావుందన్నాను"...

"....." విసురుగా మొహం తిప్పుకుంది సుజాత.

"ప్రొద్దున జరిగిన సంఘటనకు... ఐయామ్ వెరీసారీ... బట్"...

చురుగ్గా చూసింది... "ఛీ! నీచుడా.... సిగ్గులేదూ?"... అన్నట్టున్నాయి ఆమె చూపులు.

ఒక్క క్షణం అతను నిట్టూర్చాడు... మళ్ళీ చెప్పడం మొదలు పెట్టాడు. "బట్... మీరనుకొన్నట్టు నేను దేభ్య మొహాన్ని కాను"...

సుజాత ఆశ్చర్యంగా చూసింది... "అంటే.. అంటే... ఇతను అంతా విన్నాడా?"... ఆమెకు ముచ్చెమటలు పోసాయి.

"మీ ఫాదర్ రెండు రోజుల క్రితం నా రూముకు వచ్చారు. మీ డీటయిల్స్ చెప్పి మిమ్మల్ని నా కివ్వాలని ప్రపోజ్ చేసారు... మీ ఫోటో నాకిచ్చి... "శనివారం మంచి రోజు... పిల్లని చూడ్డానికి వస్తారా?"... అని అడిగారు. మీ డీటయిల్స్... మీ ఫోటో నాకు నచ్చాయి... తప్పక పెళ్ళి చూపులకు వస్తానని మాట యిచ్చాను... బట్... ఏక్సిడెంటల్‌గా మీరు గుడిలో కనిపించారు... నాకు ఆశ్చర్యం వేసింది. ఫోటోలో అమ్మాయి... మీరు... ఒకటా, కాదా... అనుమానం వేసింది... అందుకే... పరీక్షగా చూసాను... మీరు నన్ను మిస్అండర్‌స్టాండ్‌చేసుకున్నారు?..." అతను ఆగి క్షణం వూపిరి తీసుకున్నాడు....

సుజాత ఆశ్చర్యంగా వింటుండి పోయింది.

"మైగాడ్... డాడీ నా ఫోటో యిచ్చారా.... అందుకే అతను... అలా చూసారా... ఎంత షేమ్... చదువుకున్నదాన్ని నేను... ఎంత విపరీతంగా ఆలోచించాను..." ఆమె కళ్ళలో గిర్రుమని నీళ్ళు తిరిగాయి.

"ఐయామ్ సారీ... ఎక్స్ట్రీమ్లీ సారీ"... ఆమె గొంతు పూడుకు పోయింది.

"నో! నో! మీ పొజిషన్లో వుంటే ఎవరైనా చెడుగానే భావిస్తారు. కాకపోతే కొద్దిగా తొందరపడి ఎప్పుడు ఎదుటి వాళ్ళని తప్పుగా అంచనా వేయకూడదు"... ఆమె కళ్ళలోకి పరీక్షగా చూసాడు.

కన్నీళ్ళతో ఆమె కళ్ళు బరువుగా క్రిందకి వాలాయి.

"సుజా! ప్లీజ్ ఫర్ గెట్ ఇట్... స్మైల్... స్మైల్ ఫర్ మీ!".... ప్రాధేయపడు తున్నట్టు అడిగాడు.

"విజయ్.... ఐ లైక్ యు!"... అంటూ చిన్నగా నవ్వేసింది మిస్ సుజాత. ఆమె కళ్ళలో నీరు ఆనందంతో కాబోలు తళుక్కుమని మెరిసింది. ●

# క్రిస్టీన్ కీలర్ శృంగార లీలలు-2

## వార్డ్ జట్టులో కీలర్ ఇవనోవ్‌ల ప్రవేశం

17. వింపోల్ మ్యూస్ అపార్ట్‌మెంటులో డ్రాయింగురూము దీపం సన్నగా వెలుగుతోంది. సున్నితమైన చేతులు వళ్లో మడిచి పెట్టి కూర్చున్నాడు డా. వార్డ్. అతని వాలకం 'ఓరియంటల్'గా కనిపించింది నాకు. గోడమీద తగిలించిఉన్న బుద్ధుడి బొమ్మ వాలకంలాగ కనిపించింది...

## మంచి - చెడు

"మంచి చెడ్డ అన్నవి మనం ఏర్పరచుకొన్నవి కదా! మంచి తెలుసుకోవాలంటే ముందు చెడుని అర్థం చేసుకోవాలన్న విషయం ఇండియన్ ఋషులకి తెలుసు. 1940 ప్రాంతాలలో మీ దేశం వచ్చి అందమయిన చెక్కడాలు చూశాను.కోణార్క్, అజంతా, ఎల్లోరా. ఖజురహోలలో!

"ఇంగ్లీషువారు వట్టి 'ప్రూడ్'లు (కామం విషయంలో బెరుకుదనం చూపేవారు) ఆ అద్భుత శిల్పాలలోని తత్వం తెలుసుకోలేక అవి పాప పూరితాలు అంటాము.

అసలు ఇంగ్లీషువారు ప్రూడ్‌లు గనుకనే లండన్‌ని ప్రపంచ కామ రాజధాని (సెక్స్ కాపిటల్ ఆఫ్ ది వరల్డ్)గా చేసే అవకాశం ఉంది నాకు. కామం, కో సెక్సిస్టెన్స్‌లమీద నమ్మకం అన్నాడు వార్డ్.

"ఈ సిద్ధాంతాలు బాగానే ఉన్నాయి కాని ఇన్ని నిషేధాలు చేసిన సమాజంలో మీ సెక్సు విచ్చలవిడితనం నాగరికత నెగ్గుతుందా?" అనడిగాను.

బ్రిటన్‌లో 'పెద్ద' కుటుంబాలలోని స్త్రీలు చాలామంది బీద గృహాలలోంచి వచ్చినవారేనన్నాడు డా. వార్డ్. తన గురుత్వం క్రిందనే ఎందరో అమ్మాయిలు జీవితంలో పైకి వచ్చారన్నాడు.

పదేళ్ల క్రింద ఇక్కడ సొసైటీలో చాలా అందకత్తెలుగా పేరు పొందిన విక్కీ మార్టిన్ మీకు జ్ఞాపకం ఉండచ్చు. ఆమెను చూసి ఎందరో మహానుభావులు సమ్మోహితులైనారు.

"అయినా విక్కీ పాపం, ఒక రాత్రి కారు ప్రమాదంలో చచ్చిపోయింది" అన్నాడు మళ్లీ పరధ్యానంగా ఎటో చూస్తూ.

"అందంలో ప్రమాదం ఉంది, అపాయం ఉంది. దాని కోసమేకదా ప్రపంచంలో అందరూ తాపత్రయపడేది. దానిలో ఎంత శక్తి దాగి ఉంది! ఈ సంగతులన్నీ మీ ప్రాచీన ఋషులకి తెలుసు. వారి తర్వాత నశించిన ఆ నాగరికతనే లండన్‌లో, ఆధునిక ప్రపంచంలో నెలకొల్పుతాం మేము" అన్నాడు.

(గత సంచిక తరువాయి)

డా వార్డ్‌లో ఏదో విచిత్రమైన ఆకర్షణ ఉంది. ఆయన ఇదంతా చెపుతూ ఉంటె ఈ నింఫెట్‌లు, లోలిటాలు, పిగ్ మాలియన్‌లు నా చుట్టూ ఉన్నట్లే అనిపించింది.

('నింఫెట్' 'లోలిటా' పదాలు ఇటీవలే "నాబకోవ్" అనే రచయిత నవల 'లోలిటా' ద్వారా ప్రచారంలోకి వచ్చినవి )

## కీలర్ రంగ ప్రవేశం

వార్డ్ ఇంటికి తాళం వేసే అలవాటు లేనివాడు. అతనికి టెలిఫోన్ కూడా లేదు. కావాల్సిన వాళ్లంతా నేరుగా, వెళ్లిపోవడమే- "అందరికీ సుస్వాగతం" అనేవాడు వార్డ్. అలాగే ఒక వెన్నెల రాత్రి క్రిస్టిన్ కీలర్ వచ్చేసింది వార్డ్ మాట ఆమెకి వేద వాక్కు.

## ఇవానోవ్

రష్యన్ రాయబార వర్గంలో ఎసిస్టెంట్ నావల్ ఎటాచ్ కెప్టెన్ యూజన్ ఇవానోవ్ గురించి అడిగాను "గారిక్ క్లబ్బులో ఒక జర్నలిస్టు మా ఇద్దరినీ పరిచయం చేశాడు" అన్నాడు డా. వార్డ్.

"ఆ జర్నలిస్టు పేరేమిటి డాక్టర్ వార్డ్?" అని అడిగాను.

డా. వార్డ్ సమాధానం చెప్పలేదు. అయితే, ఆ జర్నలిస్టు "ఇలస్‌-ట్రేటెడ్ లండన్ న్యూస్" సంపాదకుడు సర్ బ్రూస్ ఇన్‌గ్రామ్ తప్ప వేరెవరూ కారన్న విషయం అందరికీ తెలుసు. ఆయనే డా. వార్డ్‌ని ప్రిన్స్ ఫిలిప్, ప్రిన్సెస్ మార్గరెట్, ఆమె భర్త (లార్డ్ స్నోడెన్) మొదలయిన వారికి పరిచయం చేశాడు. వీరందరూ డా. వార్డ్ బొమ్మలు గీస్తానంటే అరగంట అరగంట చొప్పున 'పోజు" యిచ్చినవారే.

"కెప్టెన్ యూజన్, నేను మంచి స్నేహితులయిపోయాము. తరుచు బిల్ ఆస్టర్ ఇచ్చిన కాటేజికి వస్తూ ఉండేవాడు, కట్టెలు కొట్టడం, పడవ షికారు వెళ్లటం అతనికి సరదా!

"యూజన్‌కి ప్రిన్సెస్ మార్గరెట్‌తో పరిచయం నా ద్వారానే. ఆమె జుట్టు రంగు వేసుకుందనేశాడట తమాషాకి. ఆమెకి చాలా కోపం వచ్చింది.

"యూజన్ చాలా సరదా మనిషి. పార్టీలలో బాగా పనికొస్తాడు".

క్లయిన్‌డెన్‌లో డా. వార్డ్ కాటేజ్‌లో మాత్రమేకాదు అసలు ఆ ఎస్టేట్‌లోనే చాలామంది ప్రముఖులు, ప్రబుద్ధులు పోగయ్యేవారు.

డా. వార్డ్‌కి అతిథి ప్రీతి చాలా ఉంది. ఇంటికి (కాటేజికి) తాళం వేసేవాడు కాదు టెలిఫోన్ లేదు.

**కీలర్ ప్రపంచం :**

కెప్టెన్ ఎఫ్. కొలబా వాలా



"కావలిస్తే నేరుగా వచ్చేస్తారు అందరికీ స్వాగతం" అన్నాడు డా వార్డ్.

## క్రిస్టిన్ కీలర్ ఆగమనం

ఒక వెన్నెల రాత్రి క్రిస్టిన్ మార్గరేట్ కీలర్ విచ్చేసింది. ఈ 21 ఏళ్ల ఎర్ర జుట్టు అమ్మాయి ఒక మాడల్. ఇటువంటివారిని ఎందరినో "సొసైటీ"కి పరిచయం చేస్తాడు డా. వార్డ్. మాడల్ అంటారే కాని ఈ పేరు గల అమ్మాయిలంతా పడుపు వృత్తి చేసేవారు. "కాల్ గరల్"లు (అంటే ఆమెని టెలిఫోన్ 'కాల్' చేసి రప్పించుకోవచ్చునన్నమాట )

లండన్ 'అధో లోకం'లో ఈమెని 'ఫరెవర్ అంబర్' అని పిలిచేవారుట.

ఒకసారి డా. వార్డ్ ఆమెని నగ్నంగా సరస్సు (లార్డ్ ఆస్టర్‌ది!)లో ఈత కొట్టమని సవాలు చేశాడుట. ఆమె అలాగే ఈదింది.

ఆ రాత్రే లార్డ్ ఆస్టర్, అతని అందాల భార్య క్లయివ్‌డెన్‌లో పెద్ద పార్టీ చేశారు.

ఆ రాత్రే మిస్టర్ జాన్ డెన్నిస్ ప్రొఫ్యూమో (బ్రిటిష్ రక్షణ మంత్రి) 'గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్' చిత్రంలో ప్రఖ్యాతి గడించిన ఆయన నటీమణి భార్య వాలరీ హాబ్సన్‌లు పార్టీకి వచ్చారు.

డిన్నర్ జాకెట్‌లో ఉన్న ప్రొఫ్యూమో వొంటి చుట్టూ చుట్టుకున్న తువ్వాలు తప్ప మరే వలువలేని క్రిస్టీన్ కీలర్‌ని కలుసుకున్న సందర్భం అదే.

సిల్కు దుప్పట్లమీద శయనించి, మంత్రులు, అధ్యక్షులు, ధనవంతులూ మొదలయిన వారితో తిరుగుతూ, లండన్‌ని ఉడికించి వేసిన రంకు పుకార్లను పుట్టించి, ప్రొఫ్యూమోని మంత్రివర్గం నుంచి పడిపోయేటట్లు చేసి, గూఢచారుల ఉదంతాలతో ప్రధానమంత్రి మాక్మిలన్‌ని ఆడించి పారవేసిన ఈ అమ్మాయి కీలర్ డాక్టర్ వార్డ్ జట్టులోకి హైవిధంగా ప్రవేశం చేసిందన్నమాట.

(3-1-64 ఆంధ్ర సచిత్ర వార పత్రిక) (సశేషం)

# వికృతి

## డి. విశ్వేశ్వరి



**నా మనసంతా చికాగ్గా ఉంది. ఆ చికాకు ముఖంలో కన్పిస్తున్నట్టుంది. రెండుసార్లు మా ఆవిడ "అలా వున్నారేం" అని కూడా అడిగింది.**

"ఏం లేదులే" అన్నాను గాని, నాలో చెలరేగే భావావేశాన్ని అణుచుకునే ప్రయత్నం ఏదీ చెయ్యలేదు.

పనంతా ముగించుకున్నట్టుంది, మళ్ళీ ఆవిడ వచ్చి ఎదురుగా కుర్చీలో కూర్చుంది. కొంచెంసేపు అలాగే నావంక చూసి,

"జ్యోతి, శేఖరాల గురించేనా మీ ఆలోచన" అంది ఈవిడ నాకు సహధర్మచారిణి మాత్రమే కాదు, సహభావచారిణి కూడాను, చాలా సందర్భాలలో నా మనసుని ఇట్టే చదివేసే ఆ నేర్పు ఎలా సంపాదించిందో నా కింతవరకూ అంతుబట్ట లేదు. ఏం మాట్లాడలేదు నేను. దీర్ఘంగా నిట్టూర్చి.

"ఏ విషయంలో అన్నయ్యగార్ని సమాధాన పరచగలిగాం గనుక! ఇప్పుడు మాత్రం ఏం చెయ్యగలం, ఆ తండ్రీ పిల్లల సమస్య వాళ్ళే తేల్చుకోవాలి. మీరూరికే బుర్ర పాడు చేసుకోకండి." తన ధర్మం నిర్వర్తించి మంత్రాంగం నెరిపింది.

"అంతేలే! ఇంకేం చెయ్యగలం" అన్నానే గాని నా ఆలోచనలు నన్ను పదల్లేదు. మధ్యాహ్నం పాండు పిల్లలిద్దరూ వచ్చి, నా నెత్తి మీద పెద్ద భారం పెట్టి వెళ్ళిపోయారు. వాళ్ళ భవిష్యత్తు విషయంలో వాళ్ల ఇష్టా ఇష్టాలు కూడా చూడాలని నేను వాళ్ల నాన్నతో చెప్పి ఒప్పించాలి. ఇదెంత దుస్సాధ్యమో నాకూ వాళ్ళకీ కూడా తెలుసు. అయినా ఈ భారం నా మీద పెట్టారు. అప్పటినించే నాకీ ఆలోచనలు. పాండుని, పిల్లలిద్దర్నీ ఎలా రాజీపరచాలి?

నిక్కర్లు వేసుకునే నాడు నుంచీ అల్లుకున్న స్నేహం నాది, పాండురంగానిది. ఇద్దరం భిన్న ధ్రువాల లాంటి వాళ్ళం. ఏ పనైనా నిదానంగా ఆలోచించి, పరిస్థితులు అంచనా వేసుకుని నిశ్శబ్దంగా చేసుకుని పోవటం నా నైజం, హడావిడిగా, పెద్ద ప్రచారంతో. భూమ్యాకాశాలు ఏకం చేసేటంత సందడితో ఆర్భాటం చెయ్యటం పాండు స్వభావం. ఏ పనిగాని తను చెయ్యదల్చుకుంటే చర్చలు జరిపి, తనా పని చెయ్యబూనటం ఎంత తెలివైన విషయమో, వివరించడం, తన సామర్థ్యాన్ని, ఆత్మాభిమానాన్ని, ఆత్మ విశ్వాసాన్ని తానే వెల్లడించుకోవడం పాండు అలవాటు. స్కూల్లో ఉన్నప్పుడు నా ఫస్ట్ రాంక్ విషయం, మేష్టారు చెప్పడం వల్ల క్లాసులోను, ఇంట్లోను, దగ్గర స్నేహితులకి మాత్రమే తెలిసేది. ఆటల పోటీలలోను, డిబేట్లలోను ముందుండే పాండుకి ఫస్టువస్తే స్కూలు. వీధి వీధంతా, ఇల్లు అంతా హడావిడితో, చాక్‌లెట్ల పంపకాలతో హోరెత్తి పోయేది.

ఈ తత్త్వమే వాడిలో అంతులేని అహాన్ని, తిరుగుబాటు లక్షణాన్ని పెంచింది. పాండు మాట కాదన్న వాళ్ళెవరైనా సరే వాడి వాగ్ధాటికి బలై పోవలసిందే. అలా అని ఎదుటివార్ని తిట్టడు. తన ఆలోచనలు ఎంత ఉన్నతమైనవో, అవి సాధించటానికి ఎంత ఆత్మవిశ్వాసం కావాలో వివరించి, చివరికి తన మాట వ్యతిరేకించిన వాళ్ళు అసమర్థులు, పిరికివాళ్ళు అని స్ఫురించేటట్టు వాదిస్తాడు. చాలాసార్లు వాడిది వితండవాదం అని తెలిసినా వాడి వాగ్ధాటి ముందు ఎవ్వరూ నోరెత్తేవారు కాదు. చాటుగా నవ్వుకునేవారు. కొందరు "ఉత్త పొగరుమోతు" అని తిట్టుకునేవారు. "ఎందుకురా ఈ వాదనలు" అని అంటే, "పోరా! నీలాగా ఎవరేది చెప్తే దానికి గంగిరెద్దులా బుర్ర ఊపడం పిరికివాళ్ళ లక్షణం. ఇన్నేళ్ళుగా నా స్నేహితుడివై వుండి నువ్విలా ఎలా ఉండిపోయావో నా కర్థం కావటం లేదు" అని తోసి పారేశేవాడు.

పి. యు. సి.లో ఇద్దరికీ క్లాసు వచ్చింది. వాడికన్నా నాకు ఎక్కువే మార్కులు వచ్చాయి. అయినా నాకు అయిదేళ్ళు మెడిసన్ చెప్పించటం మా నాన్నకి అసాధ్యం అని నాకు తెలుసు. అందువల్ల బి. యస్సి.లో చేరాను. కావలసినది సాధించలేని పిరికివాణ్ణని పాండు నా మీద మండిపడ్డాడు. పిల్లల ఆశలు తీర్చటం తల్లిదండ్రుల విధి అన్నాడు. అలా తీర్చలేని అసమర్థులైన తల్లిదండ్రులు తెలివైన పిల్లల్ని కనకూడదనేంత వరకు వాడు ఆవేశపడి పోయాడు. వాడి వాదనకి ప్రతివాదం నా దగ్గర లేదు. అయినా వాడి ఆవేశానికి, మూర్ఖత్వానికి నాకు బాధ కలిగిందిగాని వాడిమీద కోపం రాలేదు.

పాండు మెడిసన్‌కి వెడతానన్నాడు. "సీటు రావటం కష్టమేమోనని, ఆ కోర్సు చేసే ఓర్పు నీలో లేదని" వాళ్ల నాన్న అన్నందుకు ఆయనతో వారం రోజులు మాట్లాడ లేదు. "సరే నీ యిష్టం" అనిపించుకున్నాకే ఇంట్లో మామూలుగా తిరిగాడు. రెండేళ్ళు తీవ్ర ప్రయత్నాలు చేసినా సీటు రాలేదు. డొనేషన్ కట్టి చదవటం పరువు తక్కువగా పాండు అనుకోటం వాళ్ల నాన్నకి ఎంతో రిలీఫ్ ఇచ్చింది. నేను బి. యస్సి. ఆఖరి సంవత్సరంలో ఉండగా వాడు కెమిస్ట్రీ బి. యస్సి.లో చేరాడు. అప్పుడు వాడి వాదన తీరు మారింది.

"మెడిసన్ సీట్ల విషయంలో అన్నీ అన్యాయాలే, అవకతవకలే. వాడికాళ్ళు, వీడికాళ్ళు పట్టుకుని ఇప్పటి వాళ్లంతా సీట్లు సంపాదించారు. మన కర్మకొద్దీ రేపు వీళ్లే మనకి 'వైద్యం చేస్తారు" అనేవాడు. తనతో పరీక్ష రాసి మెడిసన్‌లో చేరిన వాళ్లని చూసినప్పుడల్లా, చంపడానికి లైసెన్సు సంపాదిస్తున్నారని, కట్నం కోసం పెట్టుబడి పెట్టుకుంటున్న వాళ్లని ఎగతాళి చేసేవాడు. "మన కెందుకు లేరా" అన్నా ఊరుకునే వాడు కాదు.

లెక్చరరుగా నేను స్థిరపడ్డ రెండేళ్లకి పాండు సైంటిస్ట్‌గా లాబ్‌లో చేరాడు. వాడి స్వభావం ఎలాంటిదైనా తన కిష్టమైతే ఎలాంటి సహాయమైనా సందేహించకుండా చేసేవాడు. కాని ప్రతి విషయానికి వాదాలు పెట్టుకోవటం మాత్రం తగ్గలేదు. తనమాటే నెగ్గాలనే తత్త్వమూ మారలేదు. పెళ్ళైంది. బాధ్యతలు పెరిగాయి. ఇంట్లో వాడే తెలివైన వాడు. సమర్థుడు. వాడి శాసనం రాజశాసనం. భార్య అలవాటు పడిపోయింది. పిల్లలు శేఖరం, జ్యోతి లోపల్లోపల విసుక్కుంటూనే విధేయులుగా పెరిగారు. పదేళ్ల సర్వీసు తర్వాత ఇంక వీడిని అందరూ కలిసి భరించలేక కాబోలు ప్రత్యేకంగా ఒక సెక్షను సృష్టించి పాండుని డైరక్టర్ని చేశారు. హోదాతో పాటు పట్టుదలా పెరిగింది. నేనుతప్ప వాడికి స్నేహితు లెవరూ లేరు. బంధువులెవరైనా అవసరానికి తప్ప ఆత్మీయతతో దగ్గర చేరరు. అందుకే వాడి దూకుడికి నేనే గురౌతూ ఉంటాను. ఒకసారి–

మా ఆఖరి పినతండ్రిగారి అమ్మాయి పెళ్ళి అని ఆయన వచ్చి ఒక్క పదివేలు సర్దమన్నాడు. తను ఎదురు చూస్తున్న డబ్బు రాగానే తీర్చేస్తానని చెప్పాడు. ఆయన చాలా నిక్కచ్చి మనిషి. మేమంటే ఉండే చనువు, అభిమానం వల్ల మా దగ్గరికి వచ్చి



అడిగాడు. పదివేలు అప్పు ఇవ్వగల ఆస్తి మా నాన్నకిగాని, ఆ తాహతు నాకుగాని లేవు. ఎప్పుడూ అడగనివాడు అడిగాడు. అవసరమూ అలాంటిదే. ఏం చెయ్యాలో పాలు పోలేదు. అప్పుడు మా ఆవిడ సలహాతో ఆవిడ బంగారం బాంక్‌లో పెట్టి, అప్పు తెచ్చి, ఇచ్చాను. డబ్బు చేతికి రాగానే వడ్డీ కూడా తనే కడతానని చెప్పి మా బాబాయి సంతోషంగా వెళ్లాడు. కోడలు ఇలా ఆదుకుందని మా అమ్మా నాన్నా చాలా సంతోషించారు. నేనూ గర్వపడ్డాను. నాకూ పాండుకీ మధ్య అరమరికలు లేకపోవటంతో మాట వరసగా వాడితో ఈ మాట చెప్పాను. అంతే తాటిత్తున లేచాడు. నోటు లేకుండా నోటి మాటతో అంత డబ్బు అప్పుగా ఇచ్చిన నా అవివేకాన్ని తిట్టి పోశాడు. "ఆ డబ్బు గనుక రాకపోతే చెల్లాయి బంగారం గంగపాలే కదా, తిరిగి నువ్వు అంత బంగారం కొనగలవా అని నిలదీశాడు. పెట్టుకోడానికి, పెళ్లి చెయ్యడానికి నీకు ఆడపిల్ల లేదా" అని ఎగిరాడు. నేనెంత చెప్పినా వినిపించుకోకుండా వెళ్లిపోయాడు.

"ఈ ముక్క అన్నయ్యగారి కెందుకు చెప్పారు?" అంది నా భార్య వాడు వెళ్లాక. అది ఆక్షేపణో, విసుగో నా కర్థం కాలేదు.

"పాండు మామయ్య నీ స్నేహితుడేగాని, మనింటి విషయాల్లో గూడా ఆయన మాటే వినాలా నాన్నా?" అని ప్రశ్నించారు మా పిల్లలు. అన్నిటికీ మౌనమే సమాధానం అన్నట్టుండి పోయాను. నెల తిరిగేసరికి మా బాబాయి ఆ డబ్బు తేవడం, బంగారం ఇంటికి తెచ్చుకోవడం అయింది. ఈ మాట పాండుతో చెప్పాను. "మా చెల్లాయి అదృష్టవంతురాలు" అని ఊరుకున్నాడు.

ఇంక మా అబ్బాయి విషయంలోనూ వాడి సలహా మేం పాటించ లేదు.

మా పెద్దవాడు బి. ఎ. పాసయాక ఇంక చదవను అన్నాడు. "బాంక్ పరీక్షలు, రైల్వే బోర్డు పరీక్షలు రాస్తాను. మా స్నేహితుడికి బిజినెస్ ఉంది. అక్కడ ఎకౌంటెంట్‌గా పార్ట్ టైమ్ ఉద్యోగం చేస్తాను" అన్నాడు.

నా మనసు చివుక్కుమంది. మా నాన్న ఆరుగురు పిల్లల్ని పెంచి, చదువులు చెప్పిస్తే నేను ఎమ్మెస్సి వరకూ చదివాను. నేను నా పెద్ద కొడుక్కే చదువు చెప్పించలేని వాడినా" అనిపించింది. ఆ మాటే అన్నాను.

"అలా ఆలోచిస్తా వేమిటి నాన్నా, నాకు టీచింగ్ అంటే ఉత్సాహం లేదు. అందులో నేను రాణించలేను. అలాంటప్పుడు ఎమ్మే చదవటం అనవసరం కాదా, ఇప్పటి నుంచే ఈ పరీక్షలకి చదివితే మంచిదనిపించింది. రోజంతా ఎలాగూ చదవను. మా స్నేహితుడు నమ్మకంగా ఎకౌంట్లు చూసేవాళ్లు కావాలని వెతుక్కుంటుంటే నేనే వస్తానన్నాను. అందులో తప్పేం వుంది. అయినా ఇవి మీ రోజులు కావునాన్నా. ఇప్పుడు కాంపిటీషన్ ఎలా పెరిగి పోతోందో చూస్తూ కూడా అలా ఆలోచిస్తా

వేమిటి?" అన్నాడు.

తండ్రిగా ఆలోచించి బాధపడ్డానే గాని, నాకు మాత్రం ప్రస్తుతం పరిస్థితులు తెలియవా? వాడు చెప్పిందీ నిజమే. మా వాడు అంత ప్రాక్టికల్‌గా ఆలోచిస్తున్నందుకు లోపలే సంతోషించాను. పాండుకి ఈ విషయం తెలియగానే మా వాడికి ఒక క్లాసు తీసుకున్నాడు.

"టీచింగ్ ఇష్టం లేకపోతే, కాంపిటేటివ్ ఎగ్జామ్స్ రాయాలనుకుంటే ఐ. ఎ. యస్. గాని, ఐ. పి. యస్ గాని ఎందుకు రాయవు?" ఇది పాండు ప్రశ్న.

ఆ పరీక్షలకి చదవగల సామర్థ్యం తనకు లేదంటాడు మా వాడు.

"పరీక్షకి వెళ్ళకుండానే సామర్థ్యం లేదని ఎందుకను కుంటావని పాండు వాదం.

"కష్టపడి చదవగలిగినా పరీక్ష ఫెయిలయితే శ్రమ, డబ్బు, కాలం అన్నీ వృధాయే కదా మామయ్యా" పాండుకి నచ్చచెప్ప బోయాడు.

"ఒకసారి ఫెయిలయితే మళ్ళీ ఛాన్సు లుంటాయి. అయినా ఐ. ఎ. యస్. పరీక్షకి వెళ్ళాడంటేనే ఆ గౌరవం వేరు. అంతకన్నా చిన్న పరీక్షలు, చిన్న ఉద్యోగాలు గురించి ఆలోచించటం శుద్ధ చేతగాని తనం" అని పాండు నిర్ణయం.

మధ్యలో మాట్లాడి లాభం లేదని నాకు తెలుసు. అందుకే ఇద్దరి వాదాలు వింటూ కూర్చున్నాను. చివరికి "పిల్లల చేత ఏ పనీ చెప్పి చేయించలేని వాణ్ణని" నా మీద విసుక్కొని వెళ్ళి పోయాడు. ఏడాది తరువాత మా అబ్బాయికి రైల్వేలో ఉద్యోగం వచ్చి ట్రైనింగుకని వెళ్ళాడు.

మా అమ్మాయి రమణి మాత్రం తన విషయంలో సూటిగా పాండుతో వాదానికి దిగింది. రమణి బి. కాం. పాసవగానే ఒక ప్రైవేటు కంపెనీలో ఉద్యోగంలో చేరింది. పిల్లలకి అవసర మైనప్పుడు సలహాలు, సూచన లివ్వడమే తప్ప వాళ్ళ ఇష్టాలకి అడ్డు చెప్పే అలవాటు లేని నేను రమణి విషయంలోనూ అభ్యంతరం చెప్పలేదు. ఉద్యోగం చేస్తున్నా రమణి విషయంలో నా బాధ్యత నాకుంది గదా! పెళ్ళి సంబంధాల కోసం వాకబు చెయ్యటం మొదలు పెట్టాను. ఈ విషయంలో మా అమ్మ, మా ఆవిడల పోరు కూడా జోరుగాఉండటంచేత నేను ఆలసించ డానికి వీల్లేక పోయింది. పెళ్ళి సంబంధాల లిస్టులతో ప్రఖ్యాతుడైన ఒక పెద్ద మనిషిని ఆశ్రయించాను. ఆయనొక ఇంజనీరు కుర్రవాడి గురించి వివరాలు ఇచ్చాడు. అయితే ఆ అబ్బాయికి ఇంకా ఉద్యోగం లేదు. "ఇంజనీరు గదా, ఇవాళ లేకపోయినా, రేపైనా మంచి ఉద్యోగం తప్పకుండా వస్తుందని" ఆయన ప్రోత్సాహపరిచాడు. ఇంట్లో చెప్పినప్పుడు రమణి, నా భార్య "ఉద్యోగం లేనివాడా" అని గునిశారు. మా అమ్మ మాత్రం "నిన్ను చేసుకున్న వేళ కలిసి వచ్చి ఉద్యోగం వస్తుంది లేవే" అని "మిగతా అన్ని విషయాలు బాగుంటే ప్రయత్నించరా అబ్బాయ్" అంది. అందరం అలాగే నచ్చ చెప్పకున్నాం. నేను వాళ్ళ వూరు వెళ్ళి సంబంధం చెప్పి వచ్చాను.

అమ్మాయిని చూడటానికి వాళ్ళు వచ్చారు. పెళ్ళి చూపులకి టైము రెండు గంటల తరువాత బాగుందని, ఏదైనా హోటల్లో రూము తీసుకుంటే, అంతవరకు గడిపి, అక్కడే కాఫీ, టిఫిన్లు తీసుకుని వస్తా మన్నారు. వాళ్ళకి ఆ ఏర్పాట్లు చేసి మళ్ళీ వస్తానని చెప్పి వచ్చాను. ఈ విషయంలో నా భార్య అసహనంగా చూస్తే, రమణి మాత్రం తన చిరాకుని బాహాటంగానే వెల్లడించింది. తరువాత తతంగం అయింది. వెళ్ళేటప్పుడు మధ్యవర్తి వాళ్ళ ఆశలు, వాళ్ళు కోరే కట్నం అంకె నా చెవిలో ఊది వెళ్ళాడు. వాళ్ళు వెళ్ళాక ఉత్తరం రాస్తా మన్నారు. వాళ్ళ ఆశలు నెరవేర్చాలంటే నా పరిస్థితి అంత సుఖకరంగా ఉండదని పించింది. "సరే, వాళ్ళు ఏ విషయం రాశాక కదా, మనం అంత దూరం ఆలోచించవలసింది అని సరిపెట్టు కున్నాను. వారం పది రోజులు గడిచినా వాళ్ళ దగ్గర్నుంచి ఎలాంటి సమాధానం రాలేదు. ఈలోగా మా కొలీగ్ ఊళ్ళోదే ఒక సంబంధం గురించి చెప్పాడు. ఒక్కదాన్నే నమ్ముకుని నెలలు గడపడం కన్నా రెండు మూడు సంబంధాలు చూసుకోడం మంచిదని సలహా ఇచ్చాడు. ఇంట్లో వాళ్ళకి కూడా ఇంజనీరు సంబంధం మీద ఆశ సన్నగిల్లింది. ఈ సంబంధం వివరాలు కనుక్కున్నాను. కుర్రవాడు బాంక్‌లో క్లర్క్. తల్లి దండ్రులు, ఒక తమ్ముడు, చెల్లెలు ఉన్నారు. చెల్లెలు పెళ్ళయింది. తమ్ముడు చదువు తున్నాడు. ఒక చిన్న ఇల్లు తప్ప వేరే ఆస్తేమీ లేదు. మేం వెళ్ళినప్పుడు ఆ పిల్లవాడు, తండ్రి చాలా మర్యాదగా మాట్లాడారు. వాళ్ళకేం పెద్ద కోరికలు లేవన్నారు. అమ్మాయి వాళ్ళతో కలిసి మెలిసి ఉంటే చాలన్నారు. అమ్మాయిని చూడటానికి ఎప్పుడు వీలైతే అప్పుడే వస్తామన్నారు. పెళ్ళి చూపులకి ఆర్భాటా లేమీవద్దని, కొంచెం ముందుగా తెలియజేస్తే వాళ్ళే వస్తామని చెప్పారు. వింటుంటే నాకు ఇది కలా, నిజమా అనిపించింది. అనుకున్న రోజుకి వాళ్ళే రెండు ఆటోలలో వచ్చారు. ఇంతకు ముందు మా ఇంట్లోనేకాక, మా బంధువు లిళ్ళల్లోనూ, స్నేహితుల ఇళ్ళల్లోనూ పెళ్ళి చూపుల తతంగాలు చూసిన నాకే ఈ సమావేశం ఆశ్చర్యంగా కన్పించింది. అది రెండు కుటుంబాల మధ్య సరదాగా జరిగిన సమావేశంలాగే గడిచింది తప్ప, ఆడపిల్లని ఎదురుగా పెట్టుకుని యక్ష ప్రశ్నలు వేసే సంప్రదాయబద్ధమైన పెళ్ళి చూపులనడానికి ఎక్కడా అవకాశం లేకుండా జరిగి పోయింది.

మూడో రోజున కాలేజీకి ఆ కుర్రవాడే బాంక్ నించి ఫోన్‌చేసి, "మీకు వీలైతే ఈ రోజుగాని, రేపుగాని రాగలిగితే మా నాన్నగారితో మాట్లాడవచ్చు" అని చెప్పాడు. ఇది నన్నింకా ఆశ్చర్యంలో ముంచింది. మా కొలీగ్‌తో చెప్పాను. ఇవాళే సాయంత్రం వెడదాం, మాట్లాడుదాం అన్నాడు. ఇంట్లో అందరూ, ముఖ్యంగా రమణి ఈ సంబంధం విషయంలో సుముఖంగానే ఉన్నారని తెలుసు గనుక కాలేజి నుంచే వెళ్ళాం.

అక్కడికి వెళ్ళాక, "పెట్టుపోతలన్నీ మీ ఇష్టం. ఆ విషయంలో మేమేమీ అడగం. అమ్మాయికి బంగారం ఏదో కొద్దిగా పెడతాం. పెద్దబ్బాయి పెళ్ళి గనుక మా బంధువులంతా వస్తారు. సంతోషంగా, సరదాగా పెళ్ళి చేస్తే చాల"న్నారు. ఈ మాటలతో నాకు పూర్తిగా మతిపోయినంత పనైంది. వాళ్ళ మంచితనం, మర్యాద, అలాంటివని మా కొలీగ్ బయటకు వచ్చాక ఎంతో దూరం చెప్తే తప్ప నేను



తెరుకోలేక పోయాను.

ఇంటికి వచ్చేసరికి ఇంజనీరు సంబంధం వాళ్ల దగ్గర్నుంచి ఉత్తరం వచ్చి ఉంది. వాళ్ల కోరికలు, కట్నాలు, లాంఛనాలు అన్నీ వివరంగా రాశారు. మధ్యాహ్నమే మధ్యవర్తికి ఉత్తరం వస్తే ఆయన తెచ్చి ఇచ్చాడని చెప్పారు. ఈ సంబంధం విషయం, నేను వెళ్లి మాట్లాడిన వివరాలు అన్నీ చెప్పాను. ఇంజనీరు సంబంధం చెయ్యాలంటే అప్పు చెయ్యక తప్పదు. అది నా తాహతుకి మించినదే అవుతుంది. ఇంటికి రమణి ఒక్కతే ఆడపిల్ల కావటంచేత దానికి పెద్ద సంబంధం చెయ్యాలన్న కోరిక మా కందరికీ వున్న మాట వాస్తవమే. పెద్దవాళ్లం అంతా రకరకాలుగా ఆలోచించాం. ఎటూ తేల్చుకోలేక నిర్ణయం రమణికే వదిలేశాను. బాంక్ కుర్రవాణ్ణే చేసుకుంటానని వెంటనే చెప్పేసింది. మనసులో సంతోషించినా, నాకు కష్టం కలుగుతుందని రమణి సరిపెట్టుకుంటోందా అనే అనుమానం వచ్చింది. అప్పుడే పాండు వచ్చాడు. వాడితో సంగతి చెప్పాను.

"వేరే ఆలోచనలు పెట్టుకోకుండా ఇంజనీరు సంబంధం సెటిల్ చెయ్యి. అప్పోసప్పో చూద్దాం. అంతగా కాదంటే ఇల్లు అమ్మేద్దువుగాని, నీకున్నది ఒకే ఆడపిల్ల. ఇద్దరుంటే ఖర్చుపెట్టి పెళ్లి చెయ్యవా? ఆ మొత్తం రమణి కోసమే పెట్టు. అది ఏ లోటూ లేకుండా సుఖపడుతుంది" దృఢంగా చెప్పాడు. అప్పుడే రమణి మాకు కాఫీలు తెచ్చి యిచ్చింది. వెంటనే వెళ్లకుండా తనూ ఒక కుర్చీలో కూర్చుంది. అప్పటిదాకా రమణి నిర్ణయం చెప్పలేదు. ఇంక చెప్పక తప్పలేదు. వింటూనే ఉలిక్కి పడ్డాడు. ఒకసారి రమణి వైపు చూసి, నా వైపు తిరిగి,

"చిన్న పిల్ల దానికేం తెలుసు. నేను చెప్పినట్టు చెయ్యి. అది సుఖపడుతుంది.

"సుఖపడ్డం అంటే ఏమిటి మామయ్యా?" రమణి సూటిగా అడిగింది.

"సుఖపడ్డం అంటే దేనికీ తడుముకోనక్కర్లేకుండా బతకడం" అయినా పెద్దవాళ్లం. మేం ఏం చేసినా మీ మంచి కోసమే చేస్తాం. మేం చెప్పినట్టు వినటం మీకే లాభం. పోను పోను ఈ విషయం నీకే అర్థమౌతుంది."

రమణి ఇలా కల్పించుకుని మాట్లాడటం పాండుకి నచ్చలేదని తెలుస్తూనే ఉంది.

"ఉద్యోగం లేనివ్యక్తిని చేసుకోవడం కంటె ఉద్యోగం ఉన్న మనిషిని చేసుకోడం మంచిది కాదా?"

"ఇవాళ ఉద్యోగం లేకపోతే రేపు రాదా? ఇంజనీరు అంటే మాటలా, ఎంత సంపాదన, ఎంత హోదా! భవిష్యత్తుని గురించి కొంచెం ఆలోచించాలి."

"ఇతను మాత్రం భవిష్యత్తులో ఆఫీసరు కాడా, ఉన్న ఊళ్లో నేను కూడా నా ఉద్యోగం చేసుకుంటూ వుండవచ్చు. అయినా తల్లిదండ్రుల్ని పీడించి కట్నాలిచ్చి పెళ్ళి చేసుకోవటం నా కిష్టం లేదు". స్థిరంగా చెప్పింది.

"అవన్నీ మేం ఆలోచించే విషయాలు, నీ కెందుకు? పిల్లలు పిల్లల్లా ఉండాలి."

ఈ మాటు పాండు ముఖంలో కోపం స్పష్టంగా కన్పించింది.

"ఎంతకాలం పిల్లల్లా ఉండాలి? మా మంచి కోసం అనే భ్రమతో మిమ్మల్ని మీరు అన్యాయం చేసుకుంటుంటే నేను చూస్తూ ఊరుకోలేను."

"ఇందులో అన్యాయం ఏముంది? అవసరం గనుక పి. యఫ్. లోను తీసుకుంటాడు, కాదంటే ఇల్లు అమ్మేస్తాడు."

"పి. యఫ్. రిటైరయాక ఉపయోగ పడాల్సిన డబ్బు. ఇల్లు అమ్మితే ఎక్కడుంటారు అందరూ?" రమణి కూడా ఈ విషయాన్ని మధ్యలో వదలకుండా వాదించటానికి సిద్ధపడినట్టుంది.

"ఎక్కడేమిటి? మీ నాన్న ఉద్యోగం చేసినన్నాళ్లు ఇక్కడే అద్దె ఇంట్లో ఉంటారు. మీ అన్నయ్యకి క్వార్టర్సు ఇస్తారు గనుక తరువాత అక్కడికే వెడతారు. ఒకవేళ నీ పెళ్లయ్యాక ఇంకా చేతిలో డబ్బు మిగిలితే ఇక్కడే చిన్న ఇల్లు కొనుక్కుంటారు" పాండు కోపం పాదరసంలా పెరగటం కన్పిస్తోంది.

"నాన్న కష్టపడి స్వార్జితంతో కట్టిన ఇల్లు ఇది. ఇది అమ్మితే ఈ పెళ్లి వారి కోరికలు తీర్చాక ఇంకా ఏం మిగులుతుంది? ఉన్న నీడ అమ్మి నా పెళ్లి చేశారంటే నా కెలా సుఖం, శాంతి ఉంటాయి? అయినా నెల నెలా ఎంత అద్దెపోస్తే అందరికీ సరిపోయేంత ఇల్లు దొరుకుతుంది?"

"ఏం ఎందుకు దొరకదు వెతుక్కుంటే?" పాండు మొండి వాదంలోకి దిగాడు.

"ఎలా దొరుకుతుంది మామయ్యా? అమ్మ, నాన్న, తాతగారు, మామ్మ, తమ్ముడు ఇంత రుండాలి? నేను, అన్నయ్య వస్తూ పోతూ ఉంటాం. ఊళ్లో ఉండాలంటే ఎంత అద్దెపోస్తే ఇందరికి సరిపోయినంత ఇల్లు దొరుకుతుంది? నీకు తెలియందేముంది? రెండు గదులు, వంటిల్లు, మీ ఇంట్లో వాటా నువ్వెంతకి అద్దె కిచ్చావు?"

ఇంత సూటి ప్రశ్న ఎదురౌతుందని వాడూహించ లేదు. విస్తు పోయాడు. కొర కొరా రమణిని చూస్తూ ఉండి పోయాడు. పాండు అలా జవాబు లేకుండా ఉండిపోవడం చూడటం నాకూ ఇదే ప్రథమం. చిన్నపిల్ల– వాడిని అలా నిలదియ్యటం నాకు చివుక్కు మనిపించినా, రమణి వాదంలో న్యాయం వుందనిపించడం చేత నేను కల్పించుకో లేదు. అంతరాంతరాలలో ఎక్కడో రమణి అలా ఆలోచించడం నాకు సంతోషాన్నే కలిగించిందనాలి.

"సరే అయితే. నీ ఖర్మ అనుభవించు. అయినా పిల్లలకి ఇంతంత స్వతంత్రాలివ్వటం మంచిది కాదు. ఆ సంగతి చేతులు కాలాక గాని అర్థం కాదు" కోపంగా విసురుగా వెళ్ళిపోయాడు.

ఈ ఒక్కసారే వాడు నన్ను సూటిగా తిట్టకుండా వెళ్ళాడు. నేనేదన్నా అంటానేమోనని రమణి, తనే ఏదన్నా చెప్తుందని నేను కొంతసేపు అలా వుండిపోయాం.

నేను అప్పు చెయ్యనవసరం లేకుండానే రమణి పెళ్ళి అయింది. మా అల్లుడీమధ్యనే ఆఫీసరు అయ్యాడు. వారానికి రెండుసార్లు వాళ్ళు వచ్చి కన్పిస్తారు. అంతా సవ్యంగా, సుఖంగానే సాగిపోతోంది. ఈమధ్యనే మా ఆవిడ కొడుకు పెళ్ళి చెయ్యాలని పోరుతోంది.

ఇవన్నీ నాకు సంబంధించినవి. నేను ఎలాంటి నిర్ణయాలు తీసుకున్నా పాండుకి కోపం వచ్చేవేతప్ప, వాడికి సంబంధించిన సమస్యలు కావు. కాని ఇప్పుడు నాకు నిజంగా సమస్య వచ్చిపడింది. దీన్ని నే నెలా తీర్చాలో అర్థం కావటం లేదు. పాండుకి, వాడి పిల్లలకి మధ్య నా పాత్ర యేమిటో, దాన్ని నే

# బుల్లితెర సీత సాహసం!



ఉత్తర. రామాయణం ఒక తడిసిన టపాకాయ అని తేలిపోగానే దీపిక కొత్త జగత్తులోకి అడుగు పెట్టను సాహసిస్తోంది. ప్రస్తుతం ఆమె పలు భాషా చిత్రాలు జోడి, రహీజో రాజ్ (గుజరాతి) యమపాశం, ఇంద్రజిత్ (తెలుగు) దర్దకి ఆవాజ్ (హిందీ, భోజ్‌పురి) ఎకానె అమర్ స్వర్గ, ఆషా భాలో భాష (బెంగాలి)లలో నటిస్తోంది. ఈ విధంగా ఈ బుల్లితెర సీత తన బహుభాషా ప్రావీణ్యం చూపి దేశం అంతటా గల తన ప్రేక్షకులను అలరించాలని కలలు కంటోందేమో!

నెలా పోషించాలో అర్థం కావటంలేదు. పాండు పట్టుదల నాకు తెలుసు. అయితే ఈసారి మాత్రం వాళ్ళ జీవితాలు దిద్దుకోవడంలో వాళ్ళ ఇష్టాలే సాగాలని పిల్లలిద్దరూ కూడా చాలా పట్టుదలగా వున్నారు. కరవమంటే కప్పకి కోపం, విడవమంటే పాముకి కోపంలా తయారైంది పరిస్థితి. అందుకే నా కెటూ పాలుపోవటంలేదు. అసలు సమస్య ఏమిటంటే, పాండు కొడుకు శేఖర్ డాక్టర్ ఎం. ఎస్. కూడా చేశాడు. అతడికి ఆర్మీలో డాక్టరుగా చెయ్యాలని చాలా కాలంగా కోరిక వుంది. ఆర్మీ వాళ్ళంటే పాండుకి పిసరంత కూడా సదభిప్రాయం లేదు. పైగా ఆర్మీలో వాళ్ళు దినదిన గండంగా బతుకుతారని, వాళ్ళకి సుఖం, శాంతి వుండవని వాడి నమ్మకం. అదే భార్యకి నూరిపోశాడు. శేఖర్ తండ్రికి తెలియకుండానే ఆర్మీలో సెలెక్షన్ సంపాదించుకున్నాడు. చాలా జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ, అంగీకారం నిర్ణీత గడువులోగా తెలియచేయాలన్నప్పుడు ఇంట్లో చెప్పక తప్పలేదు. తన కొడుకే తనని ధిక్కరించడంతో పాండు ఆత్మాభిమానం దెబ్బతింది. ప్రైవేటు ప్రాక్టీసు పెట్టమని, నాలుగైదు సంవత్సరాలలో ఇంట్లోనే నర్సింగ్‌హోమ్ పెట్టుకుంటే సుఖంగా డబ్బూ, పేరూ రెండూ సంపాదించవచ్చునని వాడి సలహా. కొంతకాలమైనా ఆర్మీలో సర్వీసు చెయ్యాలని శేఖర్ పట్టుబట్టాడు. నా దగ్గర ఈ పరిస్థితి అంతా చెప్పుకున్నాడు.

ఇంక పాండు కూతురు జ్యోతికి ఎం. ఏ. సోషియాలజీ, సైకాలజీ రెండింటిలో సీటు వచ్చింది. జ్యోతికి సైకాలజీ ఎం. ఏ.చేసి, సైకియాట్రిస్ట్‌గా పేరు సంపాదించి విదేశాలకు వెళ్ళాలని ఆశ. మతిలేని వాళ్ళతోటి, పిచ్చివాళ్ళతోటీ నీ కెందుకు? హాయిగా సోషియాలజీ చదువు. ఆ సబ్జెక్ట్‌కి అవకాశాలు చాలా వుంటా"యంటాడు పాండు.

"ఇప్పుడు కూడా మేం మా నాన్న ఇష్టానికే లొంగి, మా ఇంట్రస్టు చంపుకోవాలా మామయ్యా? మీ రైనా నాన్నతో మాట్లాడి ఒప్పించండి" అంటూ ఇద్దరూ నా దగ్గరకు వచ్చారు. పాండుని ఒప్పించటం అసాధ్యమని నాకూ తెలుసు, వాళ్ళకీ తెలుసు. చిన్నప్పుడు పి.యు.సి. అయ్యాక రెండేళ్ళ చదువు వృధా కాకుండా వాళ్ళ నాన్నే వాడిని ఒప్పించలేకపోయారు. ఇప్పుడు వాడి పిల్లల విషయంలో నే నెలా రాజీ చెయ్యగలను అన్నదే నా సమస్య. ఆలోచనలతో నా తల వేడెక్కి పోయింది. చివరికి పాండుని కలిసేదాకా ఈ విషయం ఆలోచించకూడదని గట్టిగా నిర్ణయించుకున్నాక గాని నాకు నిద్ర పట్టలేదు.

కాలేజీ పని వత్తిడి వల్ల రెండు రోజులు పాండు దగ్గరకు వెళ్లటం కుదరలేదు. మూడో రోజున వెళదామని నేను సిద్ధం అవుతుండగా మహా రౌద్రాకారంతో పాండు విసురుగా వచ్చాడు. వస్తూనే పిల్లలంతా కృతఘ్నులన్నాడు. వాళ్ళ మంచి కోసమే చెప్పినా అర్థం చేసుకోలేని మూర్ఖులన్నాడు. ఇంకా ఏవేవో చాలా తిట్టాడు. విషయం అర్థమైంది. జ్యోతి, శేఖరాలు తెగించి వాళ్ళ నిర్ణయాలని చెప్పి వుంటారు. అందుకే ఇలా తాండవం చేస్తున్నాడు. కొంత దూకుడు చల్లారే దాకా ఊరుకున్నాను. కూర్చోబెట్టి, మంచినీళ్ళు ఇచ్చి, నెమ్మదిగా సంగతేమిటని అడిగాను. శేఖర్ తన అంగీకారం తెల్పుతూ ఆర్మీ ఆఫీసుకి టెలిగ్రాం ఇచ్చి, తరువాత ఆ సంగతి ఇంట్లో చెప్పాడట. పాండు పెట్టే అరుపులు, కేకలు వింటూ, తల్లి ఏడుపుని భరిస్తూ, మౌనంగా తను వెళ్లడానికి ఏర్పాట్లు చేసుకుంటున్నాడట. "ఆ వెధవని చూడు నల్లిలా ఎలా చేశాడో, నేనేం వాడి శత్రువునా, ఏది చెప్పినా వాడి మంచి కోసమే చేస్తాను గదా" అని మళ్ళీ విరుచుకుపడ్డాడు. ఇంక ఆ శేఖరం చెల్లెలే కదా జ్యోతి-సోషియాలజీలో చేరమని చిలక్కి చెప్పినట్టు చెప్పి, ఫీజు కట్టమని పంపిస్తే, తీరా యూనివర్శిటీకి వెళ్లాక సైకాలజీలో చేరి డబ్బు కట్టింది. మావాడు వీరావేశంతో ఊగిపోయాడు.

"ఈ ఫీజుతో అయిందా, రెండేళ్ల చదువు నా ఇష్టం లేకుండా ఎలా చదువుతావని" రంకెలు వేశాడు.

"ఒక ట్యుటోరియల్ కాలేజీలో ఉద్యోగం సంపాదించుకున్నానని, యూనివర్శిటీ లో క్లాసు లయ్యాక అట్నుంచే వెళ్లి పాఠాలు చెప్తానని, వాళ్లిచ్చే జీతంతో తన చదువు గడుపుకుంటానని చల్లగా చెప్పింది. ఈ తిరస్కారం, ఈ పరిణామాలు పాండు తట్టుకోలేక పోయాడు. ఆ కోపం వెళ్లగక్కడానికే నా దగ్గరకు వచ్చాడు.

ఎన్నో విధాల నచ్చచెప్పాను. రకరకాల ఉదాహరణలు చూపించాను. ఎన్ని చెప్పినా "మనం చెప్పేది వాళ్ల మంచి కోసమేకదా" అన్న ముక్క మాత్రం వదలడు.

"మంచితోపాటు వాళ్ల అభిరుచి, ఉత్సాహం కూడా మనం చూడాలి. అప్పుడే వాళ్ళు మన పెద్దరికాన్ని మన్నిస్తారు. మనం అధికారం చూపిస్తే వాళ్ళు తిరగబడతారు, మొండికెత్తిపోతారు" అంటూ ఏమేమో చెప్పాను గాని,

"నీ చిన్నతనంలో నీ మంచి కోసమే చెప్పిన మీ నాన్న మాట ఎంతవరకు విన్నావని మాత్రం అడగలేకపోయాను.

వాడిని బాధ పెట్టటం ఇష్టంలేక కొంత, ఆ మాటతో వాడు మళ్ళీ రెచ్చిపోతాడనే భయం కొంత నన్నా మాట అనకుండా అడ్డుకున్నాయి.

మూడు గంటలు ఇలా వాదాలతో, లోక ధర్మ చర్చతో యువతరం వాళ్ల స్థితిని గురించిన మాటలతో గడిచాక కొంతవరకు సర్దుకున్నాడు. ఇంక వెడతానని లేచాడు. గేటుదాకా వెంట నడిచాను. అక్కడ హఠాత్తుగా నా వైపు తిరిగి,

"ఏరా రాజూ, నా చాటున వాళ్లకి నీ ప్రోత్సాహం ఉందా?" అని అడిగాడు.

ఎదురుచూడని ఈ ప్రశ్నకి ఒక్క క్షణం బిత్తరపోయాను. వెంటనే తేరుకుని వాడి భుజాల మీద చెయ్యి వేసి,

"అదేమిట్రా నన్నలా అనుమానిస్తావు? వాళ్లతో నేనీ విషయాలు అసలు మాట్లాడందే!" అన్నాను. అంతేగాని వాళ్లే నాతో మాట్లాడారనిగాని మనసులో నేను వాళ్ల పట్ల సానుభూతి చూపుతున్నాననిగాని చెప్పలేకపోయాను. ఉన్నమాట చెప్పి పాండుని నొప్పించి, మా నలభైఏళ్ల స్నేహాన్ని భగ్నం చేసుకోటం నా కిష్టం లేదు. పాండు స్వభావంలో ఉన్న ఆవేశం, ఎదుటివాళ్ళు తన మాటే వినాలనే వాడి పంతం, తానే సమర్థుడిననీ, అన్నీ సవ్యంగా ఆలోచిస్తాననే అహంకారం వాడి ప్రకృతిని వికృతిగా మార్చినా, కోపంలో నన్నెన్ని మాటలన్నా వాడిని దూరం చేసుకోడానికి నేను సిద్ధంగా లేను. అందుకే సగం నిజం మాత్రమే చెప్పాను. నా స్పర్శ పాండుకి నామీద నమ్మకాన్ని పెంచినట్టుంది. భుజంమీద వున్న నా చేతిని ఒక్కసారి నొక్కి "గుడ్ నైట్" అని కారెక్కాడు.



## టి.వి. సీరియల్‌లో డింపుల్ కపాడియా

శశికపూర్ నిర్మిస్తున్న 'అజూ బా'లో డింపుల్ కపాడియా నటిస్తోంది. ఈ చిత్రాన్ని సైబీరియా మంచు కొండల్లో నిర్మిస్తున్నారట. ఈ చిత్రం షూటింగ్ లేని సమయాల్లో టెలి సీరియల్ షూటింగ్ కార్యక్రమాల్లో బిజీగా వుంటోందట డింపుల్. కుమార్ షహానీ నిర్మిస్తున్న 'అన్నా కరేనినా'కు సంబంధించిన షూటింగ్ కూడా అక్కడే జరుగుతోందట. సినిమా ఛాన్సులు పెద్దగా లేకనేమో... వెండి తెర తారలంతా చిన్నతెర మీదకు ఎగబడుతున్నారు.




## ఔట్‌డోర్‌లో పి. బి. ఆర్ట్ ప్రొడక్షన్స్

"ఇదొక వెరైటీ కథ. బాలకృష్ణది విభిన్నమైన పాత్ర. అనాథాశ్రమం నుంచి తప్పించుకున్న ఇద్దరు తెలివైన పిల్లలు ఒక మంచి వ్యక్తిని తండ్రిగా దత్తత తీసుకోవాలని ఉబలాటపడతారు. వారి అన్వేషణలో హీరోను తండ్రిగా ఎంపిక చేసుకుని, సెంటిమెంట్‌తో అతని హృదయాన్ని ఆకట్టుకుంటారు. ఇదే విధంగా లేడీ డాక్టర్ సుహాసినిని చూసి, ఆమెను తల్లిగా తీసుకురమ్మని ఒత్తిడి చేస్తారు. దీంతో కథ ఎన్నో మలుపులు తిరిగి, ఎంతో రసవత్తరంగా సాగుతుంది. గ్రామీణ నేపథ్యంలో జరిగే కథ. ఈరోడ్ సమీపంలోని గోపిచెట్టిపాలెం పరిసరాలలో మార్చి 1 నుంచి 15 వరకు జరిగిన షెడ్యూల్‌తో సగభాగం పూర్తయింది. ఆ గ్రామానికి ఎనిమిది కిలో మీటర్ల దూరంలో కోడివేరి ఆనకట్ట వద్ద దాదాపు యాభై మంది పది రోజులలో హీరో ఇంటి సెట్‌ను ఎంతో కళావిలసితంగా నిర్మించారు. ఈ చిత్రంలో సుప్రసిద్ధ తమిళ తార రేఖ రెండవ నాయికగా నటిస్తోంది," అన్నారు కోడి రామకృష్ణ. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎం. ఆర్. వి. ప్రసాద్ నిర్మించే పి. బి. ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రంలో ఎన్. టి. ఆర్. మనుమడు, నందమూరి హరికృష్ణ కుమారుడు నందమూరి కల్యాణరామ్ ఎంతో చలాకీగా నటిస్తున్నాడట. మోహన్‌బాబు, రావుగోపాలరావు, జగ్గయ్య, గిరిబాబు, అల్లు రామలింగయ్య, చిట్టిబాబు, జుట్టు నరసింహం, శ్రీరాజ్, లక్ష్మింశెట్టి నాగేశ్వరరావు, కుయిలీ, బేబీ విజయ తతిమా పాత్రలు పోషిస్తున్నారు. సత్యానంద్, వేటూరి, సి. నారాయణరెడ్డి, శరత్, తాతా సురేష్, శ్రీనివాసరాజు, శివ సుబ్రహ్మణ్యం, జి. సత్యం, మోహనరావు, డి. సుధాకర్, రామారావు, కె. శివకుమార్, బుజ్జి, కె. అమరేశ్వరరావు ప్రభృత సాంకేతిక వర్గంతో బి. వి. సుబ్బారావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్.

## హరి అనుమోలు దర్శకత్వంలో "పోలీస్ రిపోర్ట్"

"హాస్యం అంతర్లీనంగా సాగే సస్పెన్స్ చిత్రం. కథ మొత్తం ఒక పోలీస్ రిపోర్ట్ ఆధారంగా నడుస్తుంది. షూటింగ్ అంతా హార్స్‌లీ హిల్స్ పరిసరాలలో జరిగింది. కథా, కథనం విషయాలలో చక్కని అవగాహన గల ప్రముఖ ఛాయాగ్రాహకుడు హరి అనుమోలు దర్శకత్వం వహించిన తొలిచిత్రం. అలాగే ఇళయరాజా సోదరుడు 'అమర్' తెలుగులో తొలిసారిగా సంగీతం సమకూర్చిన చిత్రమిది. ఏప్రిల్ విడుదల," అన్నారు సుంకర మధు మురళి. ఈయన నిర్మించిన విశ్వామిత్ర ఆర్ట్ క్రియేషన్స్ "పోలీస్ రిపోర్ట్" చిత్రంలో నరేష్, మోహన్, రాళ్ళపల్లి, తనికెళ్ళ భరణి, మల్లికార్జునరావు; పొట్టి ప్రసాద్, థం, చర్చ్ ఫాదర్‌గా విజయచందర్, గెస్ట్‌గా కోట శ్రీనివాసరావు, రంజని, రాజ్యలక్ష్మి, స్మిత పాల్గొన్నారు.

"పోలీస్ రిపోర్ట్"లో స్మిత



మల్లాది వెంకటకృష్ణమూర్తి మాటలు, సీతారామశాస్త్రి పాటలు, అమర్ సంగీతం, కె. ఎల్. ధర్ శిల్పం, రఘురాం నృత్యాలు, జూడో రత్నం సాహసాలు, లెనిన్ కూర్పుతో వానపల్లి బ్రహ్మాజీ, వల్లూరి పల్లి రమేష్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ :తమ్ముడు సత్యం నిర్వాహకుడు. మండవ గోపాలకృష్ణ సమర్పణ.

## చిత్రీకరణ ముగిసిన "మౌనపోరాటం"

"గిరిజన కుటుంబ సమస్యాత్మక చిత్రం. గిరిజనుల అమాయకత్వాన్ని ఆసరాగా తీసుకుని వాళ్ళను నాగరీకులు ఎలా వంచన చేస్తున్నారో, ఆ దోపిడీకి నలిగిపోయిన ఆ గిరిజనులు ఎలా ప్రతీకారం తీర్చుకున్నారో అనే అంశాలు తెలిపే ప్రణయగాథ. నాయిక తనకు జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటిస్తూ, మౌనంగా పోరాటం జరుపుతుంది. అరకులోయ షెడ్యూల్ తర్వాత మార్చి 19 నుంచి 31 వరకు విశాఖపట్నంలో చివరి షెడ్యూల్ జరిగింది." అన్నారు ఎగ్జిక్యూటివ్ నిర్మాత అట్లూరి రామారావు. ఉషాకిరణ్ మూవీస్ 23వ చిత్రం "మౌనపోరాటం"లో యమున, వినోద్‌కుమార్, కోట శ్రీనివాసరావు, రాళ్ళపల్లి, వేలు, సంజీవి, ప్రసాద్‌బాబు, నర్రా, శ్రీపాదసోమయాజులు, భాస్కరరావు, చిదంబరం, కిరణ్, కృష్ణవేణి, నాగమణి, పావలా శ్యామల పాత్రధారులు. మరుధూరి రాజా మాటలు, ఎస్. జానకి స్వరకల్పనలో వేటూరి, జాలాది పాటలు రాశారు. డి. ప్రసాద్‌బాబు ఛాయ, సాహుల్ సాహసాలు, గౌతమ్‌రాజు కూర్పుతో ఎ. మోహన్ గాంధి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఈ చిత్రానికి రామోజీరావు నిర్మాత.

# సినిమా

## "చిలిపి రాధ – కొంటె కృష్ణుడు" త్వరలో

"కలవారింటి అందమైన అమ్మాయి కఠినుడైన తండ్రి కుదిర్చిన సంబంధాన్ని ఇష్టపడక ఇంట్లోంచి పారిపోతుంది. దిక్కుతోచని స్థితిలో ఒక బీద బ్రహ్మచారి అయిన జర్నలిస్ట్ గదిలో ఆశ్రయం పొందుతుంది. దాంతో నానా గొడవ జరుగుతుంది. ఇలా రసవత్తరంగా, ఆసక్తికరంగా సాగే ఎన్నో మలుపులు తిరిగే కథ," అన్నారు కంచర్ల బదరీనారాయణ. ఈయన నిర్మించిన శ్రీ లలితాదేవి ప్రొడక్షన్స్ "చిలిపి రాధ– కొంటె కృష్ణుడు" చిత్రానికి మూలం "నేరం వందాచ్చి" అనే సూపర్ హిట్ అయిన తమిళ చిత్రం. కార్తీక్, రాధ, సిల్క్ స్మిత, త్యాగరాజన్, కరాటే మణి, ఉష వగైరా నటవర్గం. భరత్‌కుమార్ మాటలు, పాటలు రాశారు. శంకర్–గణేష్ సంగీతం, సెల్వం ఛాయ, ఇ. అరుణాచలం కూర్పుతో కె. శంకర నారాయణ సారథ్యంలో బాబు రమణ గుప్త సమర్పించే ఈ ఆహ్లాదకరమైన టీనేజ్ లవ్ స్టోరీకి వెళ్ళస్వామి దర్శకుడు.

## "కొత్త పెళ్ళికూతురా.... రా!"

"శివాజీగణేశన్ కొడుకు ప్రభు, రాధిక నాయకా నాయికలుగా నటించిన 'మణమగళే వా' అనే మా తమిళ చిత్రం సూపర్ హిట్ అయి, మార్చి 22న ఘనంగా శతదినోత్సవం జరుపుకుంది. దీనినే తెలుగులో రాజేంద్రప్రసాద్, రాధిక చెల్లెలు నిరోషాతో తెలుగులో తీస్తున్నాం. మే నుంచి జూలై వరకు షూటింగ్. అనుభవజ్ఞుడైన కాట్రగడ్డ రవితేజను డైరెక్టరుగా పరిచయం చేస్తున్నాం," అన్నారు ప్రముఖ నిర్మాత, రచయిత, దర్శకుడు అయిన పంజు అరుణాచలం. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, సమర్పణలో రాజా ఎంటర్‌ప్రైసెస్ రూపొందిస్తున్న "కొత్త పెళ్ళి కూతురా...రా" చిత్రంలో గొల్లపూడి మారుతీరావు, పి. ఆర్. వరలక్ష్మి ఆదిగా గలవారు కూడా పాల్గొంటున్నారు. కాశీవిశ్వనాథ్ సంభాషణలు, ఆత్రేయ గీతాలు, ఇళయరాజా సంగీతం, చంద్రన్ కూర్పుతో బి. రాజన్ నిర్మాత.

## సుమన్, కోదండ రామిరెడ్డితో సూర్య తేజమూవీస్ చిత్రం

"సుమన్ పాప్ సింగర్. రాధ డిఫెన్స్ లాయర్. రజని గాయకుని ఫాన్. సస్పెన్స్‌తో నడుస్తుంది కథ. జూన్‌లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో ఎన్. కృష్ణారెడ్డి నిర్మించే సూర్యతేజ మూవీస్ చిత్రంలో సత్యనారాయణ, సుధాకర్, అల్లురామలింగయ్య, పి. ఎల్. నారాయణ ఆదిగాగల వారు పాల్గొంటున్నారు. జి. సత్యమూర్తి కథ, సంభాషణలు రాశారు. వేటూరి గీతాలు, హంసలేఖ సంగీతం, ఎన్. సుధాకరరెడ్డి ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, కె. సదాశివరావు సంయుక్త దర్శకత్వం, తార నృత్యాలు, డి. వెంకటరత్నం కూర్పు, టి. గనిరెడ్డి నిర్వహణతో ఎస్. భాస్కరరెడ్డి సమర్పణ.

## గీతాకృష్ణ దర్శకత్వంలో "కోకిల"

"ఒక దిన పత్రికలో వెలువడిన ఓ నగ్నసత్యం ఆధారంగా ఈ చిత్ర కథ రూపొందించ బడింది. ఆధ్యాత్మిక చింత గల ఒక ఆచార్యుడ్ని హతమార్చడానికి కుట్ర జరగడం ప్రధాన ఇతివృత్తం. సిక్త్‌సెన్స్ పారా సైకాలజీ వగైరా అంశాలు అంతర్లీనంగా ఉంటాయి. వ్యక్తికి వ్యక్తికి మధ్య ఉండే మానవతా దృక్పథాలను, మానసిక తత్వాలను ఇందులో పొందుపరుస్తున్నాం. జోకులతో నవ్వించే విషాదంతో కూడిన సిద్ధార్థ పాత్రను నరేష్, సి. బి. ఐ. ఆఫీసర్ ఈశ్వర్‌గా శరత్‌బాబు, ఒక చలాకి పాత్రలో మాస్టర్ రాజేష్‌తో పాటు పాప్ సింగర్‌గా నాయిక పాత్రను ఓ అందాలభామ ధరిస్తుంది. ఒక డోబర్‌మన్ జాతి కుక్క కూడా ఈ చిత్రంలో నటిస్తుంది," అన్నారు గీతాకృష్ణ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి. మహేశ్వరరావు, పి. సి. రెడ్డి నిర్మించే కల్యాణీ ఎంటర్‌ప్రైసెస్ "కోకిల" చిత్రానికి వేటూరి గీతాలు, ఇళయరాజా సంగీతం, సరోజ్ చంద్రవాడి ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, కొండలరావు సహకార దర్శకత్వం, కళ నృత్యాలు, అనిల్ మల్నాడ్ కూర్పు తెర వెనుక హంగులు. ఏప్రిల్ చివరి వారంలో ప్రారంభమై, ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగుస్తుంది.




ఇటీవల నెల్లూరులో నెఫ్జా, సిఫ్మాల ఆధ్వర్యంలో 1988-89 సంవత్సరపు ఉత్తమ సినీ కళాకారులకు అవార్డుల ప్రదానం జరిగింది. ఆ కార్యక్రమానికి హాజరైన నూతన నటీనటులు రఘు, దగ్గుపాటి రాజా, కుమారి ప్రజ్ఞ, కుమారి శ్రీదుర్గ.

# సుమన్ "బావగారు"

"సెంటిమెంట్‌తో పాటు ఎంటర్‌టైన్‌మెంట్ వాల్యూ పుష్కలంగా ఉన్న ఈ చిత్రాన్ని సూపర్ డైరెక్టర్ ఎ. కోదండ రామిరెడ్డి సమర్పించడం ఒక ఎత్తు అయితే, తెలుగుదనం ఉట్టిపడే కథానాయకుడుగా సుమన్ అపూర్వంగా నటించడం మరో ఎత్తు. గ్రామీణ వాతావరణంలో 60 శాతం పూర్తయింది. ఏప్రిల్‌లో నాలుగు పాటలు, కొన్ని సన్నివేశాలు షూట్ చేసి, మేలో విడుదల చేయాలని సంకల్పం," అన్నారు జి. సత్యమూర్తి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో ఎం. సత్యనారాయణ రెడ్డి నిర్మించే మెగా మూవీ మేకర్స్ "బావగారు" చిత్రంలో సుమన్ సరసన గౌతమి, మాధురి నాయికలు. సుధాకర్, రాజా, శ్రీలక్ష్మి, కుయిలీ, చిట్టిబాబు, గౌరవ పాత్రలో రావు గోపాలరావు నటించారు. రాజ్-కోటి సంగీతం, సురేష్ ఛాయ, తాడి రంగవరప్రసాద్ సంయుక్త దర్శకత్వం, రాజు- నారాయణ ప్రొడక్షన్, బాలు శిల్పం, శివశంకర్ నృత్యాలు, సాంబశివరావు సాహసాలు, తాతా సురేష్ కూర్పుతో ఎం. మోహన్ గాంధి రెడ్డి ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్, ఏ వెంకటేశ్వరరావు సహ నిర్మాత.



"గీతాంజలి"లో నాగార్జున, గిరిజ

## కార్తీక్, ఖుష్బూల "ప్రేమాంజలి"

"ఒక జమీందారు కుటుంబం. రాజమహల్ లాంటి లంకంత భవంతి. కుటుంబ పెద్ద తాతగారు, ఆయన తమ్ముడు చిన తాతయ్య, వీళ్ళ కొడుకులు, కోడళ్ళు, మనవలు, మనవరాళ్ళు అందరూ విహారానికి రాజమహల్‌కు వస్తారు. అప్పుడు రెండు కుటుంబాల మధ్య జరిగిన విచిత్రమైన కథ.... కార్తీక్, అతని మేనమామ కూతురు ఖుష్బూ మధ్య ప్రేమానురాగం హాస్యం, సస్పెన్స్‌తో ఉత్తేజభరితంగా సాగుతుంది. 'వరుషం-16' పేరుతో విడుదలైన ఈ తమిళ చిత్రం అఖండ విజయాన్ని సాధించింది," అన్నారు ఎ. రవి. ఈయన నిర్మించే శ్రీ శిరీష పిక్చర్స్ "ప్రేమాంజలి"లో జయభారతి, రమ్యశ్రీ, వాసుప్రియ, జనకరాజ్, వి.కె. రామస్వామి, విజయ్ ఇతర పాత్రధారులు. రాజశ్రీ రచన, ఇళయరాజా సంగీతం, ఆనందకుట్టన్ ఛాయ, ఎ. సుబ్రహ్మణ్యం- జి. మహేశ్వరరాజు నిర్వహణ, ఎ. సుబ్రహ్మణ్యం కూర్పుతో ఎం. శ్రీనాధ్ సమర్పించే ఈ మధుర మనోహర చిత్రానికి "పసివాడి ప్రాణం" చిత్ర మూలకథకుడు ఫాజిల్ కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి, ప్రతిభావంతంగా దర్శకత్వం నెఱపారు.

---



# జయలలితపై నిర్మాత దావా

శరత్‌బాబు సరసన జయలలిత నాయికగా కె. నారాయణస్వామి అనే నిర్మాత 1979లో ఒక తమిళ చిత్రాన్ని ప్రారంభించాడు. నాలుగు వేల అడుగులదాకా ఫిలిమ్ డబ్బాకెక్కింది కూడా. ఆ తర్వాత జయలలిత రాజకీయాలలో మునిగి పోవడంతో ఆ చిత్ర నిర్మాణం కుంటుపడింది. ఆమె కాల్‌షీట్లు ఇవ్వనందువల్ల ఆ చిత్రం పూర్తవక పోవడం మూలంగా తనకు నాలుగు లక్షలదాకా నష్టం వాటిల్లిందనీ, ఆ డబ్బుతో పాటు అంతకు ముందు అడ్వాన్సుగా చెల్లించిన లక్షా పాతికవేలు కలిపి, మొత్తం ఐదులక్షల పాతికవేలు చెల్లించాలనీ ఆమెపై కోర్టులో దావా వేశాడా నిర్మాత.







# ఆ నొప్పికి స్ట్రాంగ్ చికిత్స అత్యంతావశ్యం

విపరీతమైన తలనొప్పులు, వొళ్ళునొప్పులు, భరించలేని నరముల తీపులు మరియు బెణుకులు—వీటన్నిటికీ అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్‌బామ్ వుపశమనము చేకూర్చగలదు

మీకు సుపరిచితమైన అమృతాంజన్‌లో యిమిడివున్న మూలపదార్థాములే మరింత శక్తివంతంగా సమ్మిళితం చేయబడినాయి అమృతాంజన్ స్ట్రాంగ్‌లో విపరీతమైన నొప్పులను, బాధలను త్వరితంగా వుపశమింప జేయగలందులకే స్ట్రాంగ్‌గా తయారుచేయబడింది అమృతాంజన్ స్ట్రాంగ్

**అమృతాంజన్**
**స్ట్రాంగ్**

మిక్కిలి బాధాకరమైన నొప్పులకు



OBM 831 TG

# హిందీ నుంచి తెలుగు లోకి

(గత సంచిక తరువాయి)

| | |
|---|---|
| ఉస్తాదోంకాఉస్తాద్... | మొనగాళ్ళకు మొనగాడు |
| ఓ కౌన్థీ?... | ఆమె ఎవరు? |
| అర్త్... | చదువుకున్న భార్య |
| ఖైదీనెం:911... | ఖైదీ కన్నయ్య |
| చిరాగ్‌కహా-రోషినీకహా... | మా బాబు |
| గీత్... | ఆరాధన (ఎన్.టి.ఆర్) |
| దీవార్... | మగాడు |
| జంజీర్... | నిప్పులాంటి మనిషి |
| రోటీ... | నేరంనాదికాదు ఆకలిది |
| ప్యాసా... | మల్లెపువ్వు |
| సీతాఔర్ గీతా... | గంగ-మంగ |
| ఫకీరా... | దొంగలకు దొంగ |
| మజ్‌బూర్... | రాజా |
| సుజాత... | కాలంమారింది |
| ఆరాధన... | కన్నవారికలలు |
| దుష్మన్... | ఖైదీబాబాయ్ |
| శీష్‌మహల్... | జమీందారుగారిఅమ్మాయి |
| యాందోంకి బారాత్... | అన్నదమ్ముల అనుబంధం |
| అనురాగ్... | అనురాగాలు |
| కు(ంవారాబాప్... | పెళ్లికానితండ్రి |
| ఆగలేలగ్‌జా... | మంచిమనుషులు |
| విక్టోరియానెం:203... | అందరూదొంగలే |
| డాన్... | యుగంధర్ |
| కాళీచరణ్... | ఖైదీకాళిదాస్ |
| జల్సాఘర్... | జల్సారాయుడు |
| చైనాటౌన్... | భలేతమ్ముడు |
| కానూన్... | అక్కాచెల్లెలు |
| దస్‌లాఖ్... | నడమంత్రపుసిరి |
| ప్రొఫెసర్... | భలేమాస్టర్ |
| దసనంబరీ... | కే.డి.నెం1 |
| జంగ్లీ... | సరదారాముడు |
| దోస్తీ... | స్నేహం |
| మన్‌చలీ... | మొగుడుకావాలి |
| సుహాగ్... | సత్యం-శివం |
| విశ్వనాథ్... | లాయర్‌విశ్వనాథ్ |
| మొఘల్‌ఏఆజామ్... | అక్బర్‌సలీం-అనార్కలి |
| దీప్‌జలేజాయ్... | చివరకుమిగిలేది |
| నాగిన్... | దేవతలారాదీవించండి |
| తపస్యా... | సంధ్య |
| ఇన్‌సాఫ్‌కాతరాజ్... | ఏదిధర్మం-ఏది న్యాయం |
| ఆద్మీఅఖరీఖత్... | చిన్నారిచిట్టిబాబు |
| బసేరా... | తోడునీడ |
| మేరాగాఁవ్- మేరాదేశ్... | మంచి బాబాయ్ |
| సమాధి... | నా ప్రాణంలో ప్రాణం |
| మెహందీలగీ మేరాహాథ్... | గోరింటాకు |
| ముకద్దర్‌కాసికందర్... | ప్రేమతరంగాలు |
| గుమ్‌నామ్... | గుండెలుతీసినమొనగాడు |
| సాహెబ్... | విజేత |
| జవాబ్... | ఇదే-నాసమాధానం |
| లాహారిస్... | నాదేశం |
| హిమాలయ్‌కిగోద్మే... | డాక్టర్‌బాబు |
| జిందగీ... | ఆడబ్రతుకు |
| అంచల్... | మాతృదేవత |
| భాయ్‌భాయ్... | శభాష్‌రాముడు |
| ధర్మా... | నాపేరేభగవాన్ |
| చోర్‌మచాయేషోర్... | భలేదొంగలు |
| అమానుష్... | ఎదురీత |
| రోటీ- కప్డా- ఔర్ మకాన్. | జీవనపోరాటం |
| దిల్‌ఏక్‌మందిర్... | మనసేఒకమందిరం |
| ఇంతికామ్... | పగబట్టినపడుచు |
| హమ్‌దోనో... | రామునిమించినరాముడు |
| దోభాయ్... | నేనూమనిషినే |
| దోయార్... | ఇద్దరూఇద్దరే |
| జానీమేరానామ్... | ఎదురులేనిమనిషి |
| గోపి... | పల్లెటూరిచిన్నోడు |
| అన్‌హోని... | పిచ్చిమారాజు |
| గాయ్‌ఔర్‌గోరి... | పల్లెపడుచు |
| తలాష్... | ప్రేమించిపెళ్లిచేసుకో |
| హాత్‌కిసఫాయి... | మనుషులుచేసినదొంగలు |
| ప్యార్‌ఝుకానహీ... | పచ్చనికాపురం |
| ఆషా... | అనురాగదేవత |
| చేతనా... | గీత |
| ఉల్ఝన్... | జడ్జీగారికోడలు |
| అనామిక... | కల్పన |
| దాగ్... | విచిత్రజీవితం |
| అవతార్... | ఓతండ్రితీర్పు |
| మేరెజంగ్... | విజృంభణ |
| అమృత్... | ఆత్మబంధువులు |
| రాఖీ... | రాఖీ |
| జీత్... | కిరాయిదాదా |
| జనం... | ఆత్మకథ |
| అంధాకానూన్.. | మొనగాడు |
| నసీబ్... | త్రిమూర్తులు |
| మరతేధమ్‌తక్... | అగ్నినక్షత్రం |
| నవ్‌రంగ్... | సువర్ణసుందరి(సాంఘికం) |
| జాన్‌కిబాజీ... | మిస్టర్‌హీరో |
| కత్రన్‌కిఖిలాడి... | సింహస్వప్నం |
| అమర్-అక్బర్-ఆంథోని... | రామ్-రాబర్ట్ -రహీం |
| బేతాబ్.. | సామ్రాట్ |
| అర్జున్... | భారతంలో అర్జునుడు |
| హీరో... | విక్రమ్ |
| దాదా... | దాదా |
| అల్లాఉద్దీన్... | అల్లాఉద్దీన్ |
| షోలే... | దోపిడిదొంగలు |
| మిట్టీకాచూడియా... (గుల్షన్ నందా నవల) | తులసి |
| గుల్షన్‌నందానవల... | కలిమిలేములు |

–సేకరణ : ఆరిపాక సూరిబాబు

"బావగారు"లో మాధురి, సుమన్



సీరియల్

# సూపర్ గర్ల్

## వింజమూరి విజయ శాంభవి

(గత సంచిక తరువాయి)

హోటల్ రూమ్‌కి తిరిగివచ్చిన రోజ్ రూమ్ ఖాళీగా వుండటం చూసి తెల్లబోయింది.

ఏమయింది కార్తి?

ఆమెకి రూమ్‌లో కార్తికి సంబంధించిన రెడ్ సూట్‌కేస్... హేండ్‌బ్యాగూ, తన ఎర్‌బ్యాగూ కూడా కనిపించలేదు. కొంపదీసి శత్రువులుగాని తమ వునికిని పసిగట్టలేదుగదా? ఈ అనుమానంతో కార్తి ఈ రూమ్‌ని వెకేట్‌చేసి వెళ్ళిపోలేదుగదా? అదే నిజమైతే తనకి తెలియజెయ్యకుండా వెళ్ళిపోతుందా?

ఆమె అనుమానంగా కార్తి తన కేదయినా రాసి పెట్టిందేమోనని రూమ్ అంతా వెదికింది. ఆమెకి అలాంటి దేమీ కనబడలేదు. ఆమె రిసెప్షన్‌కి ఫోన్ చేసి కార్తి రూమ్ వెకేట్‌చేసి వెళ్ళిపోయిందేమో నన్న అనుమానాన్ని కూడా క్లియర్‌చేసుకుంది. అలాంటి దేంలేదు. కార్తి ఆమెకి ఏమీ చెప్పమనికూడా చెప్పలేదు.

"ఎందుకలా అడుగుతున్నారు? మీతో కలసి వచ్చిన ఆ కుర్రాడు ఏమయ్యాడు?" అడిగాడు రిసెప్షనిస్టు.

అతనికి అనుమానం కలగనివిధంగా సమాధానం చెప్పిం దామె. తరువాత రూమ్ బాయ్‌ని పిలిచి కార్తిని గురించి అడిగింది. వూహూఁ! ఆమెకి ఎలాంటి వివరాలూ తెలీలేదు.

ఏమయింది కార్తి? తన యిష్టపూర్వకంగానే ఇక్కడినుండి వెళ్ళిపోయిందా? లేక శత్రువులు ఆమెని పసిగట్టి యెత్తుకెళ్ళారా? ఈ ఆలోచనకే వులిక్కిపడింది ఆమె.

రోజ్‌కి ఖంగారుగా భయంగా అనిపించింది. మరో అరగంటపాటు అక్కడే వుండదలచుకుంది ఆమె. కార్తి వుద్దేశ్యపూర్వకంగా హోటల్ రూమ్‌ని ఖాళీచేసి వుంటే తనకి తప్పక ఫోన్ అయినా చేస్తుంది.

అరగంట గడిచినా అలాంటిదేం జరగలేదు. తరువాత ఆమె రేచల్ ఇంటికి ఫోన్‌చేసింది. కార్తి అక్కడికి రాలేదని ఆమెకోసం ఇంకా తను ఎదురు చూస్తున్నట్టు చెప్పింది రేచల్. రోజ్‌కి ఏం చెయ్యాలో పాలుబోలేదు.

ఆ వుదయం ఆమె హోటల్‌నుంచి తిన్నగా బయలుదేరివెళ్ళి ఆ వూళ్ళోవున్న తన ఫ్రెండ్ అన్నగార్ని కలుసుకుని... రంగనాథ్... లేదా రంగనాథం అన్న లాయర్‌గార్ని గురించి ఆరా తీసింది. అతిసామాన్య కార్మికుడైన అతనికి ఈ విషయం తెలిసే అవకాశం లేదు. అతను ఆమెని తన ఇంట్లో కూర్చోబెట్టి బయటికెళ్ళి అరగంట తరువాత పూర్తి వివరాలతో తిరిగివచ్చాడు. ఆ వివరాలు తెలుసుకుని ఉత్సాహంగా తిరిగివచ్చిన రోజ్, కార్తి హోటల్ రూమ్‌లో నుండి మాయం కావడంతో ఏం చెయ్యాలో... కార్తిని ఎక్కడ వెదకాలో తెలియని అర్థంగాని అయోమయావస్థలో పడింది.

సరిగ్గా ఆ సమయంలో పడిం దామె దృష్టిలో అక్కడ టేబుల్ దగ్గరవున్న సిగరెట్ బిట్ ఒకటి.

ఉలిక్కిపడి దాన్ని చూసింది రోజ్. అప్పుడు అర్థమైంది ఆమెకి కార్తి ఎలా మాయమైందో.

* * *

కార్తికోసం వెదుకుతూ హైదరాబాదు నుండి విజయవాడకివచ్చిన సోఫియా ముఠాకిచెందిన సంజయ్ బృందానికి వారికి శత్రువులైన మరో గ్రూప్‌కి ఆమె ఆచూకీ లభించలేదు. వాళ్ళు రేచల్ ఇంటి దగ్గర... బస్ స్టాప్‌లలో, రైల్వేస్టేషన్‌లలో, ఎర్‌పోర్టులో కాపువేసి వెయ్యికళ్ళతో ఆమెకోసం గాలిస్తున్నారు.

అసలు కార్తి విజయవాడ వచ్చిందా లేదా? వస్తే ఒకవేళ తిరిగి వెళ్ళిపోయిందా? అదే నిజమైన పక్షంలో ఆ పేరుగల ఈ వూళ్ళోని ఒకే ఒక్క లాయర్ ఇంటి పరిసరాల్లో రెండు ముఠాలకి సంబంధించినవారూ కాచుకునే వున్నారు. ఆ లాయర్ ఇంటికి వీళ్ళకి తెలీకుండా వీళ్ళ చెవుల్ని గప్పి ఏ ఫోన్‌కాలూ రాలేక పోతోంది. లాయర్‌గార్ని కలవడానికి వచ్చే ఏ మనిషీ వారి దృష్టిని తప్పించుకుపోవటంలేదు. లాయర్ ఇంటి నుండి బయటికివచ్చే ప్రతివ్యక్తినీ అనుసరిస్తున్నారు వారు. లాయరుగారు ఇంట్లో ఏ నిముషంలో ఏం చేస్తున్నారో తెలుసుకుంటూనే వుంటున్నారు. ఈ విషయంలో రెండు గ్రూప్‌లవారూ చాలా కేర్‌ఫుల్‌గా వుంటున్నారు.

సంజయ్‌కి పిచ్చిపట్టినట్టుగా వుంది.

అసలు ఆ పిల్ల ఈవూరు వచ్చిందా? లేక ఇంకా రాలేదా? వస్తే తమ కళ్ళుగప్పి లాయర్‌ని కలుసుకునే ఛాన్స్ అసలు లేదు. ఒకవేళ కలుసుకుందే అనుకున్నా మరుక్షణం ఆ విషయం తమకి తెలిసిపొయ్యే ఏర్పాట్లు వున్నాయి. ఒకవేళ తమని తప్పుదారిలో నడిపించడానికి ఎక్కడో దాక్కుందా? అదే నిజమైనపక్షంలో ఎంతకాలం దాక్కుంటుంది అలా?

అమ్మా అబ్బలకి తెలీకుండా కొంపవదిలివచ్చిన ఆడకుంక ఎంతకాలం ఈ వూళ్ళో దాక్కుంటుంది? తమకి తెలీని స్నేహితులు ఈ వూళ్ళో ఆ పిల్లకి ఇంకెవరున్నారు?

ఈ ఆలోచన రావటంతో వెంటనే హైదరాబాద్‌కి ట్రంకాల్‌చేసి గంటలోపల ఆ ఇన్ఫర్‌మేషన్ సంపాదించాడు సంజయ్. విజయవాడలో కార్తికి రేచల్‌గాక వున్న ఫ్రెండ్స్ ఇద్దరే ఇద్దరు. ఒకమ్మాయి శేఫాలి! ప్రస్తుతం వూళ్ళో లేదు. సెలవులు కావడంతో తల్లి తండ్రులతో కలసి వూటీ వెళ్ళింది. ఇంకో అమ్మాయి ఉజ్వల. వూళ్ళోనే వుంది. కానీ ఆమె ఇంటికి కార్తి అసలు రాలేదు. ఎక్కడ దాక్కుని వుంటుంది ఇక? అతను విజయవాడ లోని చిన్నా పెద్దా హోటళ్ళన్నీ గాలించిపారేశాడు.

ఎప్పటికప్పుడు తను ఎక్కడ వున్నా అరగంటకో సారి ఫోన్‌చేసి జాకబ్ నుండి... మిగతా తమవాళ్ళకి ఏదైనా కొత్త ఇన్ఫర్‌మేషన్ లభించిందేమోనని తెలుసుకుంటూనే వున్నాడు.

ప్రతీసారీ "ప్చ్" అంటూనే వున్నాడు జాకబ్. అది వింటూన్నకొద్దీ, టైమ్ గడిచిపోతున్నకొద్దీ వెర్రెత్తిపోతోంది సంజయ్‌కి కార్తిమీద కసి అధికమౌతోంది.

తమ శత్రువులకి కార్తి ఆచూకీ ఏమైనా లభించిందేమోనని ఆతృతతో ఇరువర్గాలవారూ ఎప్పటికప్పుడు ఆ విషయాన్ని తెలుసుకుంటూనేవున్నారు. అది జరగలేదని తెలిసి సంతృప్తిపడుతూనే వున్నారు. ఎదుటివారికి కార్తి చిక్కినపక్షంలో వారిని తెగనరికి అయినా ఆ రహస్యాన్ని, తాము చేజిక్కించుకోవాలని ఇద్దరూ పట్టుదలతో వున్నారు.

ఇలా విజయవాడ సిటీ అంతా కార్తి కోసం

**జరిగిన కథ- 13:** రాణికి సహాయం చేద్దామని కంకణం కట్టుకున్న కార్తికి అడుగడుగునా ఆటంకాలు ఎదురవుతుంటాయి. రాణి తాలూకు సూట్‌కేస్ తీసుకుని రోజ్‌తోపాటు విజయవాడకు చేరి హోటల్‌లో బసచేసిన కార్తిని ఆ సూట్‌కేస్‌తో సహా యిద్దరు వ్యక్తులు కారులో ఎత్తుకుపోతారు. వారి నుంచి తప్పించుకునే ప్రయత్నంలో కారు చెట్టుకు ఢీకొని బోల్తాపడుతుంది. కార్తిని రక్షించుకోవలసిందిగా ఒక వ్యక్తి క్యాసెట్ ద్వారా తెలియజేయటంతో చైతన్య విజయవాడ బయల్దేరుతాడు.

వలపరిచి ఎదురుచూస్తున్నారు ఆమె శత్రువులు.

సరిగ్గా పన్నెండు గంటలప్పుడు సంజయ్ జాకబ్‌కి మళ్ళీ ఫోన్‌చేశాడు. "అరే జాకబ్! కొత్త విశేషాలేమయినా తెలిశాయట్రా?"

"ప్చ్" అన్నాడు అవతల్నుంచి జాకబ్.

"ఛాంచత్! ఎక్కడ చచ్చిందిరా అది ఇందరి కళ్ళు గప్పి" అసహనంగా అరిచాడు సంజయ్.

హఠాత్తుగా "గురూ" గట్టిగా అరిచాడు అవతల్నుంచి జాకబ్.

ఉలిక్కిపడ్డాడు సంజయ్. "ఏమయిందిరా? ఎందుకలా గొంతు చించుకుంటావ్?" చిరాగ్గా అన్నాడతను.

సమాధానం చెప్పలేదు జాకబ్.

"జాకబ్... జాకబ్... అరే జాకబ్" గట్టిగా చిరాగ్గా అరిచాడు సంజయ్.

అవతల్నుంచి జాకబ్ కంఠం అయితే వినిపించలేదు గాని అతడి చేతిలో రిసీవర్ క్రింద పడ్డట్టు చప్పుడైంది.

"హల్లో జాకబ్..."

వూహూ ఁ! జాకబ్ పలకలేదు.

"ఏమయిందిరా?" అనుమానంగా అరిచాడు.

"హల్లో గురూ...." ఈసారి బొంగురు వినిపించింది జాకబ్ కంఠం.

"ఏమయిందిబే? ఏం రోగం వచ్చింది నీకు? ఎందుకు హఠాత్తుగా నోరు మూసుకున్నావ్?" అసహనంగా అరిచాడు.

"ఇక్బాల్ గాడు ఓ షాకింగ్ న్యూస్ పంపాడు గురూ అది వినగానే నోట మాటరాలేదు."



"ఏమిట్రా జాకబ్ అది?" ఆతృతగా అడిగాడు సంజయ్.

"ఆ పిల్ల మన కళ్ళుగప్పి రెండుగంటల క్రితం ట్రైన్‌లో బాంబే పారిపోయిందట!"

"వాట్?" అదిరిపొయ్యాడు సంజయ్! ఆ ఖంగార్లో అతడు జాకబ్ కంఠంలోని మార్పుని గమనించలేదు.

"అవును గురూ. ఇది రాంగ్ ఇన్ఫర్మేషన్ ఏంతమాత్రమూ కాదు. అంటున్నాడు ఇక్బాల్‌గాడు.

"గుడ్ గాడ్!" ఎలా ఇప్పుడు?" సంజయ్‌కి ఒక్క క్షణం ఏం చెయ్యాలో తోచలేదు.

ఎంత జిత్తులమారి పిల్ల? లాయర్ ఇంటి సమీపానికైనా రాకుండానే బొంబాయి ఎందుకు బయలుదేరినట్టు? మధ్యలో ఇంకోవయినా ఆదేశాలూ... సంకేతాలూ అందలేదుగదా తనకి?

క్షణాలమీద ఓ నిర్ణయానికి వచ్చేశాడు సంజయ్. "ఒరేయ్ జాకబ్ అరగంటలో బాంబే బయలుదేరే ఫ్లయిట్ వుంది. మన వెధవలు కొందర్ని ఎర్‌పోర్టు దగ్గరికి చేరుకోమను. మరి కొందర్ని గంట తరువాత బయలుదేరే ట్రైన్‌లో చావమను. నువ్వు మాత్రం ఇక్కడే వుండి ఈ విషయం సోఫియా డెవిల్‌కి తెలియజెయ్యి. ఎక్కడికి పోతుందా పిల్ల పిశాచి? బాంబేలో సమాధి కట్టేస్తాను దాన్ని! నేను పోతున్నానుబే" అంటూనే టక్కున ఫోన్ పెట్టేశాడు.

కానీ ఎంతో తెలిగ్గా శత్రువుల ట్రాప్‌లోపడ్డ సంజయ్‌కి జరిగింది తెలీదు.

* * *

ఉక్కు కడ్డీలతో కుళ్ళబొడిచినట్టు పోటు పెడుతున్న తలని రెండు చేతులతో అదిమిపెట్టుకుని కళ్ళు విప్పింది కార్తి. తిరగబడిపోయిన కారు క్రిందపడి పచ్చడైపోయ్యారు పురంధర్, జగ్గు డ్రైవర్‌లు.

దావూమియా మాత్రం దూరంగా పడివున్నాడు. ఓపికతెచ్చుకుని లేచివెళ్ళి చూసింది కార్తి. అతడి శరీరంలో నూ ప్రాణంలేదు. వేగంగా కార్లో నుంచి పచ్చిపడిన అతడి తల ఓ బండరాతికి పొడుచుకోవడం వలన తల పగిలి ప్రాణం పోయింది.

కారు తిరగబడటానికి కొద్ది క్షణాలముందు అదృష్టవశాత్తు తెరుచుకుంది బాక్ డోర్. ముందు దావూమియా... అతడివెనకనే కార్తి వేగంగా ఎగిరి వచ్చి ఇవతలపడ్డారు. అతడి తల రాతికి పొడుచుకోవడంతో ప్రాణం పోయింది. కార్తి మాత్రం వేగంగా వెళ్ళి రోడ్డుకి అవతలి ఇసుక ప్రదేశంలో పడటంతో ఆమెకి ఎలాంటి బలమైన దెబ్బ తగల్లేదు. ఘోరప్రమాదం నుండి తప్పించుకో గలిగింది.

ఆమె తను తప్పించుకుని వారిచేతిలో నుండి బయటపడాలన్న ఆవేశంలో ఆలోచన లేకుండా డ్రైవర్ చేతిలోని స్టీరింగ్ కంట్రోల్ తప్పేలా చేసిందిగాని... ఇంత ఘోర ప్రమాదం జరుగుతుందని ఆమె వూహించలేకపోయింది. ఈ విషయాన్ని గురించి ఆలోచించివుంటే అంత సాహసం చేసేది కాదేమో.

అదృష్టవశాత్తు తను ప్రాణాలతో బయటపడగలిగింది. హఠాత్తుగా ఆమెకి తన తల్లీ తండ్రీ గుర్తువచ్చారు. తనకేమయినా అయితే.... ఆ ఇద్దరూ సంయుక్తంగా ఆత్మహత్య చేసుకుంటారని కార్తికి తెలుసు. వారి ప్రాణాలన్నీ తనమీదే వున్నాయని ఆమెకి బాగా తెలుసు. ఈ వూహకే ఆమె గుండె జలదరించింది.

అసలీ ముగ్గురు వ్యక్తులు ఎవరో? వారికి తనమీద అంత శత్రుత్వం ఎందుకో? తనని ఎందుకు యెత్తుకెళుతున్నారో ఆమెకి తెలీదు. తాను తొందరపడి ఇంత ఘోర ప్రమాదానికి, వారి మరణానికి కారకురాలయినందుకు నిజంగా ఆమె పశ్చాత్తాపడింది. కానీ కార్తికి తెలీదు తను విచారపడాల్సినంత నిజాయితీ వారిలో లేదని. తన బంగారు భవిష్యత్తుని ఓ కాలసర్పం నోటికి అందించడానికేవారు తనని ఎత్తుకెళుతున్నారని.

కార్తి వారి ఆత్మశాంతికోసం ఓ క్షణం కళ్ళు మూసుకుని ప్రార్థించింది. ఆ తరువాత తెలివి తెచ్చుకుని తను ప్రస్తుతంవున్న పరిస్థితిని గురించి ఆలోచించిందామె. వెంటనే తను ఇక్కడి నుండి బయటపడాలి. ఏ వాహనం ఇటువైపుగా వచ్చినా గొడవైపోతుంది. అప్పుడు గుర్తువచ్చిం దామెకి... ఓ గాడ్! తన సూట్‌కేస్? తన ప్రాణమే పోయినంత భయపడిపోయిం దామె.

అయితే ఆమె పెద్దగా ఖంగారుపడవలసిన అవసరం లేకపోయింది. దావూమియాకి దగ్గర్లో పడివున్నాయి తన సూట్‌కేస్ – హేండ్‌బ్యాగ్. రోజీకి చెందిన ఎర్‌బ్యాగూ... ఇవిగాక మరో పర్స్ కూడా కనిపించిం దామెకి.

ఆమె దాన్ని అందుకుని జిప్ లాగి చూసింది. అందులో నోట్ల దొంతరలు కనిపించా యామెకి. ఒక్కక్షణం మాత్రం తటపటాయింపుగా ఆలోచించిందామె. తరువాత కామ్‌గా పర్స్‌లోని డబ్బు తీసి తన హేండ్ బ్యాగ్‌లో వేసుకుంది. సరిగ్గా అప్పుడే పడిందామె దృష్టి... ఈ ఘోర సంఘటనని కళ్ళారా చూసి స్పృహకోల్పోయిన ముస్లిం యువతి మీద. జరిగినదేమిటో గ్రహించి అక్కడి నుండి కదలబోతున్న కార్తికి మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

తిరిగి తను ఇప్పుడు విజయవాడ చేరుకోగానే తన కోసం వలపన్ని కూర్చున్న శత్రువుల చేతికి చిక్కిపోవడం ఖాయం. తను రూపం మార్చుకోవాలి. ఆ ముస్లిం స్త్రీ బురఖాని తీసి ధరిస్తే? ఈ ఆలోచన రావడం ఆలస్యం. చకచక ఆమె దగ్గరికి వెళ్ళి ఆ బురాఖా విప్పేసింది కార్తి. దాన్ని తను ధరించింది. ఇక ఈ సూట్‌కేస్‌ని ఏం చెయ్యాలి? ఎక్కడ దాచాలి?

ముస్లిం యువతి ప్రక్కన పడి కనిపించింది పెద్ద కాన్వాస్ సంచి ఒకటి. ఉత్సాహంగా దాన్ని అందుకుని ఆమె సూట్‌కేస్‌ని దాన్లోకి తోసేసింది. తరువాత ఎర్‌బ్యాగుని, హేండ్‌బేగ్‌ని అందుకుని రెట్టించిన ఉత్సాహంతో బయలుదేరింది.

* * *

చైతన్య వూహించినట్టే కార్తిని కిడ్నాప్ చెయ్యడానికి షుకూర్ సంగమేశ్వర్రావులు వేసిన ప్లాన్‌ని గురించి చైతన్యకి తెలియజేసిన కుర్రాడు బిందుని కలుసుకున్నాడు. అంతకుముందు అతను న్యాయర్‌ని కలుసుకున్నప్పుడు నాయర్ తన యజమాని ఇచ్చిన ఉత్తరాన్ని ఆ కుర్రాడికి అందజేశాడు. అది చదివిన ఆ కుర్రాడు అన్ని సందేహాలను, సంకోచాలనూ వదలిపెట్టి ధైర్యంగా బిందు దగ్గరికి వచ్చి షుకూర్ ముఠాకి చెందిన అన్ని వివరాలూ అందించాడు. తరువాత ఆమె అతన్ని పోలీసు



'ఉత్తగాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.

# కార్తి సాహసం



కమిషనర్‌గారి దగ్గరకు తీసుకెళ్ళింది

అంతకుముందే ఆమె చైతన్యని విజయవాడ ప్లయిట్ ఎక్కించి తన తండ్రి సహకారంతో పోలీసు కమీషనర్‌గార్ని కలుసుకుని ఆయనకి విషయం వివరించి ఆయనకి క్యాసెట్ అందజేసి కార్తిని ఈ దుండగుల బారినుండి రక్షించడంలో ఆయన సాయం అర్థించింది వెంటనే విజయవాడ పోలీసు అదికారులకి ఈ విషయం తెలియజెయ్యబడింది

కొద్దిసేపట్లో చైతన్య విజయవాడ పోలీసులకి కార్తి ఫోటో అందజెయ్యగలడు సర్ అంది బిందు కమీషనర్‌గారితో

ఇప్పుడామె ఆ కుర్రాడ్ని కమీషనర్‌గారి దగ్గరికి తీసుకెళ్ళింది అతడి పేరు బయటికి రాదని వారు నచ్చజెప్పాక అతడు షుకూర్ ముఠాకి చెందిన స్థావరాల్ని గురించి అతడితో సంగమేశ్వర్రావుకి వున్న సంబందాలను గురించి వీరు నిర్వహించే సంఘవిద్రోహక కార్యకలాపాలకు ఇతోదికంగా చేయూతనందించి సహకరిస్తున్న కొందరు స్వార్థ పరులైన అదికారులను గురించి వివరాలు వివరంగా చెప్పాడు ఆ కుర్రాడు

ఇది మామూలు విషయం కాదని గ్రహించారు కమీషనర్‌గారు! ఈ విషయం డి జి పి గార్కి, తరువాత హోం మినిష్టర్‌కి తెలియజెయ్యబడింది ఆ తరువాత పకడ్బందీ ప్లాన్‌తో పోలీసులు షుకూర్ స్థావరాలమీద సంగమేశ్వర్రావు ఇంటిమీద ఏక కాలంలో దాడిచేశారు రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుబడ్డారు ఇద్దరూ

గల్ఫ్ కంట్రీస్‌కి పంపడం కోసం షుకూర్ సిద్ధం చేసివున్న డజను మంది అమాయకపు కన్నెలు, అరబ్ దేశాల్నుండి తెప్పించిన స్మగ్లింగ్ గూడ్స్ కొన్ని అతని స్థావరాల్లో పోలీసులకి లభించాయి షుకూర్‌తో సంగమేశ్వర్రావుకి సంబంధాలున్నట్టు తెలియజేసే కొన్ని రహస్యపత్రాలు సంగమేశ్వర్రావు ఇంట్లోని ఓ రహస్య ప్రదేశంలో దొరికాయి పోలీసులు వెంటనే ఆ ఇద్దర్నీ అరెస్ట్ చేశారు

బలమైన గట్టి సాక్ష్యాదారాలు లభించడంతో షుకూర్‌కి వున్న పలుకుబడి వీగిపోయింది తమకి కఠిన శిక్ష పడటం ఖాయం అనే నిర్ణయానికి వచ్చారు ఇద్దరూ తరువాత ఈ రహస్యాల్ని అందజేసిన ఆ కుర్రాడ్ని పోలీసుఅధికార్లు అభినందించారు

ఇంతకీ ఆ కుర్రాడు ఎవరయినట్టు?

* * *

బిందు చైతన్య తనకి అప్పగించిన బాధ్యతని సక్రమంగా నెరవేర్చగల్గినందుకు ఎంతో సంతృప్తి పడింది తరువాత ఆమె ఓసారి కార్తి తల్లి సుమిత్రని కలుసుకుంది తన కూతురు ఎంత భయంకరమైన విషవలయంలో చిక్కుకుపోయి వుందో తెలీని సుమిత్ర నిశ్చింతగావుంది బిందు ఎంతో ఆందోళనగా చైతన్య నుండి వచ్చే ట్రంకాల్ కోసం ఎదురుచూస్తున్నా

ఒకవేళ కార్తి పురంధర్ బృందం చేతికి చిక్కినా... అసలైన మూలవిరాట్‌లు పోలీసులచేతికి చిక్కిపోవడంతో పురంధర్ వలన కార్తికేం అపకారం జరగదన్న ధైర్యంతో వుంది

కానీ పాపం బిందుకి తెలీదు కార్తి పురందర్ ఆటకట్టించి, ఆ దుర్మార్గుణ్ణి సరాసరి యమపురి సాగనంపి అంతకంటే భయంకరమైన విషవలయంలో చిక్కుకుపోయివుందని

* * *

కార్తిని శత్రువులు ఎత్తుకు పొయ్యారన్న విషయాన్ని గ్రహించిన రోజ్ నీరసంగా ఆందోళనగా ఆ హోటల్‌లో నుండి బయటపడింది' తరువాత ఆమె తన టాక్సీలో పిచ్చిపట్టినట్టు విజయవాడ సిటీ అంతా కార్తి కోసం గాలించసాగింది' ఎక్కడ కనబడుతుందామెకి తన పిచ్చిగాక పోతే? ఇకతను తిరిగి హైదరాబాదు వెళ్లిపోదామా? అనుకుందామె'

కానీ, అలా తనకి పట్టనట్టుగా కార్తిని శత్రువుల చేతికి అప్పగించి ఒక్కతే తిరిగి వెళ్ళడానికి రోజ్‌కి మనసురాలేదు' బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చిందామె' ఎప్పుడూ తనదగ్గర వుంచుకునే పర్స్ చూసుకుందామె కొంత డబ్బు కనిపించింది' ''ఫరవాలేదు'' తృప్తిపడి హైదరాబాదుకి ట్రంకాల్ బుక్ చేసిందామె' చైతన్యకి విషయం వివరించి అతన్ని వెంటనే విజయవాడ బయలుదేరి రమ్మని చెప్పటం ఆమె ఉద్దేశ్యం అప్పుడు ఇక తనకి ఏ చింతా వుండదు' అతను కడు సమర్థుడు ఈ బాధ్యతని తన బుజస్కందాల మీదకి ఎత్తుకోగలడు' పైగా కార్తి పట్ల అతనికి ఎంత అబిమానమో రోజ్‌కి బాగా తెలుసు'

కానీ చైతన్య వూళ్ళోలేడని అంత క్రితమే ఏ వూరో బయలుదేరాడని చెప్పాడు నాయర్' తెచ్చిపెట్టుకున్న ధైర్యం దిగజారిపోయింది రోజ్‌లో' ఎలా ఇప్పుడు? ఏం చెయ్యాలి తను? పోనీ కార్తి తండ్రికి చెబితేనో? అంతకంటే గత్యంతరం కనిపించటం లేదు' మొదట వాళ్ళు బయపడినా వెంటనే తగిన చర్యలు తీసుకుని కార్తిని శత్రువులబారినుండి కాపాడుకొంటారుగదా? తను ఉపేక్షించి లాభంలేదు' ఇలా అనుకుని ధైర్యం తెచ్చుకుందామె'

ఈ ప్రయత్నమూ లాభం లేకపోయింది' ఆనంద్ వూళ్ళో లేడని చెప్పింది సుమిత్ర' హతాసురాలయింది రోజ్' ఈ విషయం సుమిత్రతో చెప్పడం ఆమెకి ఇష్టంలేక పోయింది' నిన్న విజయవాడ బయలుదేరబొయ్యేముందు తన తల్లికి తను

---

## నా సాహసమే మమ్మల్ని కాపాడింది

మా ఇంట్లో ఆడవాళ్ళంతా కలసి సెకండ్‌షో సినిమాకి వెళ్లాం. విశాఖపట్టణం సమీపంలోని దొండపర్తి దగ్గర మా ఇల్లు. సినిమా వదిలాక వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది కదా' అని సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నడిచి వెళుతున్నాం మా వెనుక ఎవరో మమ్మల్ని అనుసరిస్తున్నట్టు అనుమానం వేసింది అతని ప్రవర్తన ఏమి బాగ లేదు అతను దగ్గరయే కొద్దీ మాలో బయం చోటు చేసుకోసాగింది మాకు చాలా దూరంలో నలుగురు అబ్బాయిలు నడిచి వెళుతున్నారే తప్ప ఇంక వేరే జన సంచారం లేదు ఇక ఉపేక్షిస్తే అతను ఏదో ఒక అఘాయిత్యం చేయడం తధ్యం అనిపించి పెద్దగా చప్పట్లు కొడుతూ కేకలు వేసాను అంతే ఎప్పుడైతే నేను కేకలు వేయడం మొదలు పెట్టానో అప్పుడే అతను కాలికి బుద్ధి చెప్పాడు మా కేకలు విన్న నలుగురు అబ్బాయిలు వెనక్కి వచ్చి జరిగింది తెలుసుకొని మమ్మల్ని ఇంటి దగ్గర దిగబెట్టి వెళ్ళారు



– మొల్లి సత్యవతి

విజయవాడ వెళుతున్న విషయం తెలియజేసి ఒప్పించడానికి కార్తి ఎంత నాటకం ఆడిందో ఆమెకి గుర్తు వచ్చింది!

"మమ్మీకి భయంజాసి చాలా బలహీన మనస్కురాలయి పోతుంది... ఆ విషయంలో! నాకు తలనొప్పి వచ్చినా ఓర్చుకోలేదు!

ప్రయాణం మధ్యలో తల్లిని గురించి కార్తి తనతో అన్న మాటలు గుర్తువచ్చాయి రోజ్‌కి! సుమిత్రకి చెప్పకూడదు ఈ విషయం...... అను కుంది రోజ్!

"ఆనంద్‌గారి బొంబే అడ్రస్... ఫోన్ నెంబర్ ఇస్తారా? ఇమ్మీడియట్‌గా వారితో ఓ ముఖ్య విషయాన్ని గురించి మాట్లాడాలి..." అడిగింది!

"సారీ! నాకూ తెలీదు! ఆయన నిన్న సాయంత్రం అనుకోకుండా సడెన్‌గా వెళ్లాల్సివచ్చింది! ఇంత వరకూ నాకు ఆయన్నుండి ఎలాంటి కబురూ రాలేదు! ఆయన అడ్రస్‌గానీ-ఫోన్ నెంబర్‌గానీ నాకు తెలీదు..." అంది సుమిత్ర!

ఇక రోజ్ చేసేది లేకపోయింది! నిస్సహాయంగా అనిపించసాగిందామెకి! అంతమంది జనం మధ్య నుండి కూడా తను ఒంటరిదై పోయినట్టు... తనేదో ఎడారిలో వున్నట్టుగా ఫీలయిందామె!

ఏం చెయ్యాలి తను ఇప్పుడు? ఇక ఒంటరిగా హైదరాబాదు బయలుదేరి వెళ్ళిపోక తప్పదా? అంతకంటే తను చెయ్యగలిగింది మాత్రం ఏముంది? అక్కడికి వెళ్ళి తరువాత ఆనంద్‌కి ఈ విషయం తెలియ జెయ్యగలగాలి!

పోనీ ఈ విషయం పోలీసులకి తెలియజేస్తేనో? అన్న ఆలోచన వచ్చిందామెకి! అంతలోనే తన ఆలోచన విరమించుకుందామె! అసలు విషయం ఏమిటో కార్తి శత్రువులు ఎవరో తెలీకుండా ఏమని వెళ్ళి చెబుతుంది? అయినా, తనబోటి అతి సామాన్యురాలి మాట మీద కార్తికోసం వెతుకుతారావాళ్ళు? హూఁ పోలీసులు తనబోటి సామాన్య జనానికి అందుబాటులో వుంటే... ఎన్నో తిప్పలు తప్పేవి తమకి! ఎన్నో అన్యాయాలు జరగక తప్పేవి! ఇప్పుడు తను వెళ్ళి చెప్పినా తననో పిచ్చిదాన్నిలా చూడరా!

రోజ్ ఇలా ఆలోచించి నీరసంగా నిరుత్సాహంగా... దిగులుగా హైదరాబాదు బయలుదేరింది! విజయవాడ వదలి 20 కిలోమీటర్ల దూరం ప్రయాణించిందామె అప్పుడు ఎదురువచ్చి ఆపింది ఆమె టాక్సీని ఓ ముస్లిం స్త్రీ! రోడ్డుకి అడ్డంగా నిలబడి ఆమె ఆ చేతులు వూపుతున్న ఆ తీరు... అందులోని ఖంగారుని గ్రహించి సడెన్‌బ్రేకుతో టాక్సీని ఆపేసింది రోజ్! ఆ ఆకారం దగ్గరకి వచ్చేసింది!

"ఎవరు మీరు? ఎక్కడికి వెళ్ళాలి? వెనక్కి వెళ్ళదు టాక్సీ! హైదరాబాదు వెళుతోంది..." కాస్త చిరాగ్గా విసుగ్గా అన్నది రోజ్!

"లాభంలేదు డియర్! వెనక్కి తిరగాల్సిందే! లేదంటే నీ మీద కేసు పెడతాను" అంది ఆ ముస్లిం స్త్రీ.

అదిరిపడింది రోజ్ ఆ కంఠం విని!

"ఏం రోజ్ సిస్టర్! నన్ను ఎక్కనీవా ఏమిటి?"

"కార్తి" అంది రోజ్ నమ్మలేనట్టు!

"యస్...! కార్తినే రోజ్..."

మరుక్షణం పట్టలేని ఆనందంతో అరిచింది రోజ్...." యురేకా..." అంటూ

కార్తి ఎక్కి కూర్చోగానే వెనక్కి తిరిగింది టాక్సీ.

"ఇప్పుడు చెప్పు? ఏమిటీ వేషం? ఎలా బోల్తా కొట్టించావు ఆ దుర్మార్గుల్ని?" ఉత్సాహంగా అడిగింది కార్తి!

"నువ్వు వూహించిన దుర్మార్గులుకారులేవాళ్ళు, కొత్త శత్రువులు. కారణం తెలీని ఆ శత్రుత్వం ఏమిటో మరి వాళ్ళకి నాపట్ల! అయినా పాపం... తమ తప్పుకి నేరానికి మించిన శిక్షని అనుభవించారు..." అంటూ జరిగినదంతా వివరంగా చెప్పింది కార్తి!

అంతావిని ఆశ్చర్యపోయింది రోజ్... "చిత్రంగా వుంది! వున్న వాళ్ళు చాలదన్నట్టు మళ్ళీ కొత్త శత్రువులా? ఎలా అయితేనేంలే... క్షేమంగా బయట పడగలిగావు! నీ సాహసమే నీకు శ్రీరామరక్ష కార్తీ ఒక్కోసారి నీ ధైర్యాన్ని చూస్తే నాకు భయం వేస్తుందిగానీ, ఇప్పుడు మాత్రం ఆ ధైర్యం లేక పోతే నువ్వు విజయం సాధించలేవనిపిస్తోంది! నిన్నూ నీ ధైర్య సాహసాల్నీ మెచ్చుకోవాలనిపిస్తోంది..." అంది రోజ్!

"థాంక్యూ రోజ్..." అంది కార్తి!

తను ఆమె కోసం సిటీ అంతా పిచ్చిపట్టినట్టు తిరగడం...దిగులుపడి పోవడం... ఫోన్‌లో చైతన్య కోసం ఆమె తండ్రి కోసం ప్రయత్నించడం అంతా చెప్పింది రోజ్!

"గుడ్‌గాడ్! వాళ్ళు దొరక్కపోవడం ఎంత మేలయింది! అయినా రోజ్ ఆ పని ఎందుకు చెయ్య బోయ్యావు? ఇంకా నయం... అటు అంకుల్... ఇటు డాడీ ఇద్దరూ దొరకలేదు గాబట్టి నాకు చివాట్లు దీవెనలూ తప్పాయి! బ్రతికి పోయాను..." అంటూ గుండెల మీద చేతులుంచుకుంది కార్తి!

రోజ్ ఆశ్చర్యంగా వింతగా చూసింది! "మరేం చెయ్యను నిన్ను ఒంటరిగా శత్రువులకి అప్పగించి వెళ్ళడానికి నాకు మనసు రాలేదు! పైగా ఎంతో దిగులుగా భయంగా అనిపించింది! అయినా కార్తీ... సాలెగూట్లో చిక్కుకు పోయినట్టయిన ఈ భయంకర పరిస్థితి నీకు భయం కలిగించటంలేదా ఏమిటి? నీ మొహంలోని నవ్వు చెక్కు చెదర లేదు...."

"ఊహూ"! అంటూ నవ్వింది కార్తి! "భయం ఎందుకు? నాకు ఇంకా థ్రిల్లింగ్‌గా వుంది..." అంది!

"థ్రిల్లింగ్‌గా వుందా?"

"అవును! అప్పుడప్పుడూ ఇలాంటి అడ్వంచర్స్ ఎదురవకపోతే లైఫ్‌లో థ్రిల్లే వుండదనిపిస్తుంది నాకైతే! వాట్‌యూసే?"

ఏమంటుంది రోజ్? అందరి చేత మగరాయుడు అని పిలవబడి, విమర్శింపబడుతున్న రోజ్ అవాక్కయి పోయింది కార్తి మాటలకి! ఆమె ఇంక దాన్ని గురించి ఏమీ మాట్లాడలేదు. .

"లాయర్ గార్ని గురించిన ఇన్ఫర్‌మేషన్ ఏదయినా తెలుసుకోగలిగావా రోజ్ సిస్టర్? మళ్ళీ మనం తిప్పలు పడాల్నా?"

"తెలుసుకోగలిగాను" అంది రోజ్.

ఉత్సాహంగా ముందుకి ఒంగింది కార్తి చెప్పమన్నట్టు!

"ఈ వూళ్ళో ఆ పేరుతో ఒకే ఒక లాయర్ వున్నారు! రంగనాథ్ వయసు నలభై అయిదు సంవత్సరాలు. మంచి పేరు ప్రాక్టీసు వున్న క్రిమినల్ లాయర్!



# శ్రీ శుక్లనామ సంవత్సర రాశిఫలాలు!



## మేషరాశి

అశ్వని 4 పా, భరణి 4 పా, కృత్తిక ప్రథమ పాదానికి చెందినవారు మేషరాశి జాతకులు వీరికి ఆదాయం 11, వ్యయం 5, రాజపుజ్యావమానాలు 2, 4. సంవత్సరమంతా ఆనందంగా గడచి పోతుంది అధిపతి 'గురుడు' జూన్ నుండి అనుకూలుడు. శని పెద్దగా అపకారి గాదు రాహు కేతువులు దాదాపు ఆరు నెలలు అనుకూలురు వత్సరమంతయు శని, రాహు కేతువులు శుభులగుట, గృహ నిర్మాణ కార్యక్రమం, చిత్ర రంగానుభవం, రాజకీయానందం, సుఖ శాంతులు, ధనవృద్ధి, ధాన్యవృద్ధి, ఆరోగ్యవృద్ధి చెప్పదగిన అంశాలు వెంట శుభం జరుగుతుంది. చేసిన ఉద్యోగ యత్నాలు అనుకూలిస్తాయి. విద్యా విషయంలో పెంపు. శుభ కార్య నిర్వహణావకాశం, సభా మర్యాదలు, పత్రికారంగాను కూలత ఏప్రిల్ 14 తా నుండి వత్సరాంతం వరకు అనుకూలం చిట్టచివర ఆరోగ్య భంగం కలుగుట గమనింపదగిన అంశం 'ఆరోగ్యమస్తు'



## వృషభరాశి

కృత్తిక 2, 3, 4 పా, రోహిణి 4 పా, మృగశిర 1, 2 పా.లు వృషభరాశికి చెందిన వారు ఆదాయం 5, వ్యయం 14, రాజపూజ్యం 5, అవమానం 4. బాగా పరిగణన చాల కాలం గురు, కుజ గ్రహాలు అనుకూలురు శుక్ర బుధ గ్రహాలు అనుకూలురు వ్యాపార వ్యవహార విద్యా విషయములందు, జాయింటు వ్యాపార వృద్ధియందు, కళారంగమందు, వృత్తి అభివృద్ధియందు, చేసిన ఉద్యోగ యత్నంసానుకూలమగుటయందు, చిత్ర రంగాభి వృద్ధియందు, తీర్థ యాత్రానుకూలత యుందు, రచనా వ్యాసంగమందు,ఆస్తి పెంపకమందు ఏప్రిల్ 14 తా మొదలు మొదట ఆరుమాసాలు లాభదాయకాలు ఉత్తరార్ధమందు ఆరోగ్యరీత్యా జాగ్రత్త పడాలి "ఐశ్వర్యమస్తు"



## మిథునరాశి

మృగశిర 3, 4 పా, ఆర్ద్ర 4 పా, పునర్వసు 1, 2, 3 పాదాలకు చెందినవారు 'మిథునరాశి' చెందిన వారు. 'గురుడు' పెద్దగా అనుకూలుడు గాకున్నను, శని, శుక్ర, బుధ, కుజ గ్రహాలు పూర్వార్ధమున అనుకరింతురు ఆదాయ వ్యయాలు 8, 11లు. రాజపూజ్యానికన్నా అవమానం అత్యధికం వ్యాపారాన, వ్యవహారాన, రాజకీయాలందు బహు జాగత్తగా సంచరించాలి ప్రయాణాలందు జాగత్త పడాలి వృత్తియందు హుషారుగా మెలగాలి. అయిన్న వాటికి కాని వాటికి తగాదాలు రావచ్చు. మొదట ఆరు నెలలు యిబ్బందు లుండవచ్చు. అనవసర వ్యయం ఉండవచ్చు. రాజకీయపు ఇబ్బంధు లుండవచ్చు. కొందరు యిండ్లు మారవచ్చు. అంతా గురు, కేతుగ్రహ ప్రభావములని జపించుచు సంవత్సరం జరపాలి కళారంగావకాశాలు కొంత కాలం దూరమవుతాయి. ఓర్పుతో సంవత్సరం ముగిసేలాగు చూడాలి 'ఆనందోస్తు'



## కర్కాటకరాశి

పునర్వసు 4 పా, పుష్యమి 4 పా, ఆశ్లేష 4 పా.ల వారు కర్కాటకరాశికి చెందిన వారు. ఆదాయం 2, వ్యయం 11, రాజపూజ్యం 4 అయితే అవమానం ఏడు బాగాలు. ఆరింట శని యోగదాయకుడు రాశి నుండి 'త్రి, షట్, ఆయములందు' శని సంచరించు కాలం ధన ధాన్య వస్తు వాహన సంపాదనకు అనుకూలం మార్చి 7 తా నుండి దాదాపు ఎనిమిది నెలలు, వ్యాపార వ్యవహార, చిత్రరంగానుకూలత యందు, నిర్మాణ కార్యక్రమ నిర్వహణ యందు, రాజకీయ వ్యవహార దక్షతయందు 'శుక్ల' సంవత్సరం అనుకూలం లాభస్థాన వ్యయము లందున్న 'గురుడు' శుభఫల దాయకుడు అధిక వ్యయదాయకుడు. శుభ సంబంధంగా వ్యయం అధికం అది శ్రేయోదాయకమేగా! పంపిణీదారులకు, ఛాయా చిత్ర నిపుణులకు, పత్రికాధినేత లకు, పాత్రికేయులకు, రాజకీయములందు సతమత మగువారికి, వాహనము సేకరింప దలచువారికి, అభివృద్ధి, ఆదాయ వృద్ధి, కళ్యాణ వైభవం కొందరకు చెప్పవచ్చు చివరి రెండు నెలలు, దూర ప్రయాణాలు ఆపివేయుటం శ్రేష్ఠం. అనవసర వ్యవహారాల జోక్యం అంతకన్న తగదు, "వృద్ధిరస్తు."



## సింహరాశి

మఘ 4 పా, పూ ఫల్గుణి 4 పా, ఉ ఫల్గుణి 1 పాదములందు జన్మించినవారు సింహరాశి జాతకులు. ఆదాయం 5, వ్యయంకూడా అంతే రాజపుజ్యావమానాలు సమమే రాశియందు 'కేతు' స్థితి కొంత కాలమే వ్యయ గురుడు కొంత కాలం. 'శని' 5, 6 లందు శనిస్థితులు కొంత లాభదాయకమే. ధన వసతి యున్నది. వ్యాపార వృద్ధి యున్నది. చిత్ర నిర్మాణం సాగించ వచ్చు. పంపిణీదారులకు అనుకూలం. రాజకీయవాదులకు అభీష్ట సిద్ధి, ఆరోగ్య వృద్ధి, కళారంగాన ప్రతిభ గలవారికి, ముఖ్యంగా నాట్య నాటక కోవిదులకు అనుకూలం స్త్రీలకు ఉద్యోగ, వృత్తులందు అనుకూలతకు, సంపదాభివృద్ధికి, కొందరకు కల్యాణ సంపదాభివృద్ధికి, సంతాన వృద్ధికి, ప్రభుత్వ పరంగా అభివృద్ధి కల్గుటకు మేలైన వత్సరం 'శుక్ల' వత్సరం శుభఫలప్రదాయకం. 'అభీష్ట సిద్ధి రస్తు.'



## కన్యారాశి

ఉ. ఫల్గుని 2, 3, 4 పా, హస్త 4 పా, చిత్త 1, 2 పా లందు జన్మించిన వారు 'కన్యారాశి' జాతకులు ఆదాయ వ్యయములు దాదాపు సమానమే రాజపూజ్యావమానాలు అలాగే. అర్ధాష్టమ శని బాధ వేధ లున్నవి. భాగ్య, రాజ్యములందు 'గురుని' స్థితి విచారించగా, ఒక్క ఆరోగ్య విషయమున తప్ప, కుటుంబారోగ్య విషయమున తప్ప, ధనవృద్ధికి, సంపదాభివృద్ధికి, వ్యాపార వృద్ధికి అనువైన వత్సరం "శుక్లనామ సంవత్సరం". పంపిణీదారులకు, రచయితలకు, పాత్రికేయులకు, నాట్యకోవిదులకు, ఆటపాటలందు, చిత్ర రంగానుభవం గలవారికి, ప్రకాశవంతం అనుకూలదాయకం. "శని" గ్రహారాధనతో ఈ వత్సరం "శుభదాయకం".

మున్నెం శారద సీరియల్, శాతవాహన ధారావా

# శ్రీ శుక్లనామ సంవత్సర రాశిఫలాలు!



## తులారాశి

చిత్త 3, 4 పా, స్వాతి 4 పా, విశాఖ 1, 2, 3 పా లందు జన్మించిన వారు "తులారాశి" జాతకులు శుక్లనామ సంవత్సరం ఈ రాశి స్త్రీ పురుషాదులకు యోగ్యం ఉద్యోగావకాశా లున్నాయి. సంపదాభివృద్ధి, ఐశ్వర్య వృద్ధి, రాజకీయ రంగాభివృద్ధి, ఒక్కటేమిటి సకల సంపదాభివృద్ధి. కొందరు ఏదో నెపంతో విదేశ గమనం చెప్పదగిన ముఖ్యాంశం కొందరు నూతన వృత్తిని చేపట్టనున్నారు. నూత్న గృహ నిర్మాణము నకు కొందరకు అవకాశం వృత్తి వ్యాపారములందు ప్రతిబంధకములున్నను సమసి పోవును వివాహానికై యత్నించు వారికి బంధు సంబంధం నిశ్చయం కళారంగాన ప్రసిద్ధి గలవారికి సకలాభీష్టాలు తీరుతాయి. విరోధి వర్గం వత్సరాంతాన తల ఎత్త వచ్చు, గ్రహింప గలరు ప్రయాణాలు చివరి మాసమున అవుట శ్రేష్ఠం. "శుభమస్తు"



## వృశ్చికరాశి

విశాఖ 4 పా. అనూరాధ 4 పా. జ్యేష్ఠ 4 పా. ముల వారు ఈ రాశిక చెందిన వారు. ఆదాయ మధికం రాజపూజ్యం అధికం. సంపత్ప్రదమైన వత్సరం శుక్ల' వత్సరం క్రమంగా 'శని' అనుకూలుడు "వృషభ, మిధునములందు" గురుని సంచారం అత్యధిక లాభదాయకం ఆట పాటలందు ప్రావీణ్యమూ మిచి లాభమే. పంపిణీదారులా" మీకు మేలే కళారంగానుభవం, ఏప్రిల్, జూన్, ఆగష్టు మాసములందు క్రమాభివృద్ధి నందును, అధిక ఐశ్వర్య సంపన్నులగుటకు ఈ వత్సరం సహకరించును శుక్లనామ సంవత్సరం బహుళ శుభదాయకం రాజకీయాన, కళారంగాన, ఉద్యోగరీత్యా మేలుండునని, చివరి రెండు నెలలు లాభ ప్రదములని గ్రహించ వలెను రాహు కేతుగ్రహ జపాదుల వలన "అధికార వృద్ధి". "విజయోస్తు".



## ధనుర్రాశి

మూల 4 పా. పూ. షాఢ 4 పా. ఉ షాఢ 1 పా మందు జన్మించినవారు ధనుర్రాశి జాతకులు.

ఆదాయం, రాజపూజ్యములు అధికంగా వృద్ధినందుతాయి వికాసవంతమవుతాయి. రాశి, ద్వితీయమందు 'శని' సంచారం కొంత బాధాకరమే. ఆరోగ్యరీత్యా జాగ్రత్త అవసరం. గ్రహించాలి. గురుని స్థితి ఆరు, ఏడు రాసులందు సంవత్సర చివరి భాగమందు అనుకూలమని గ్రహించండి. 'మే' నుండి అధికార వృద్ధికి ఆస్కారం, ఒకవేళ నూతనోద్యోగ ప్రాప్తికి అనుకూలం నూతన గృహ నిర్మాణానికి, చిత్ర నిర్మాణానికి, తెల్లని వస్తు విక్రయమునకు, ఆటపాటలందు ప్రావీణ్యత చూపుటకు సంవత్సరాంతం శ్రేయోదాయకం, కొందరకు, కారణం ఏదైనగాని విదేశగమనానికి ఆస్కారం క్వచిలోపం రాకయున్న 'ధనధాన్యాభివృద్ధిరస్తు'



## మకరరాశి

ఉ షాఢ 2, 3, 4 పా శ్రవణం 4 పా, ధనిష్ఠ 1, 2 పా లందు జన్మించిన వారికి ఆదాయాని కన్న వ్యయం అధికం, రాజ పూజ్యావమానాలు సాధారణంగా సమానం. రాశియందు 'శని' బాధాకరుడే గురుడు 5, 6 రాశులందు లాభదాయకుడు ధనదాయకుడు ఆరోగ్యదాయకుడు వస్తు వాహన సేకరణకు అనుకూలుడు. విద్యావేత్తల సహాయ సంపత్తులుంటాయి 'రాహుకేతు గ్రహాల' జపం కొంత మేలున్నదని గ్రహించాలి. 'మే' నెల 15 తా. నుండి సంవత్సరాంతము వరకు, నూతన వాహనం కొనుగోలు చేయుటకు, ఆటపాటలందు పేరు తెచ్చుకొనుటకు, కీర్తి ప్రతిష్ఠలకు, రచనా వ్యాసంగాన వృద్ధినందుటకు, బంధు మిత్రుల యింట శుభకార్యాలందు పాల్గొనుటకు ఆస్కారం నటనకై, చిత్రరంగాభివృద్ధికై కొందరకు విదేశీ గమనం స్త్రీలకు సర్వ విధాలా అనుకూల కాలమని గ్రహించి, గ్రహారాధన వలన శుక్ల సంవత్సరమందు 'సంపదాభివృద్ధి'



## కుంభరాశి

ధనిష్ఠ 3, 4, శతతార 4వ పా, పూ భాద్ర 1, 2, 3 పా. లందు జన్మించినవారు కుంభరాశివారు ఆదాయం కన్న వ్యయం అధికం. రాజ పూజ్యం 4 అయిన అవమానం 2 గా గమనించవలెను. చతుర్థ పంచమరాశులందు 'గురుడు' అధిక ధనదాయకుడు, అత్యధిక లాభదాయకుడు ఆనందదాయకుడు. వృత్తి ఉద్యోగమందు, వ్యాపార వ్యవహారాలందు, గృహ నిర్మాణ, ఒక వేళ చలనచిత్ర నిర్మాణ దక్షత యందు అనుకూలుడు రాజకీయాలు బహు చాకచక్యంగా నెరవేర్చుకొనగలవాడు కృషి, గోరక్షణాదులందు, కళ్యాణ గుణాధిక్యత యందు నూతన ఉద్యోగ ప్రవేశమందు, గనుల్లు, కార్ఖానాలు నిర్వహించుట యందు అనుకూలుడు. విద్యా వినయ సంపన్నుల స్నేహం లాభదాయకం. సంవత్సరమంతా స్త్రీ పురుషాదులకు ఆనందప్రదమని గ్రహించాలి. 'విజయీభవ'.



## మీనరాశి

పూ భాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర 4 పా. రేవతి 4 పాదాలందు జన్మించిన వారు 'మీనరాశి' వారు. ఆదాయం అధికం రాజ పూజ్యం 7 అయిన అవమానం రెండే ఒడిదుడుకులతో, అప్పుసప్పులు చేయవలసి రావటంతో, ఆనందంగా కాలం గడపాలని యత్నించినా సాగక పోవటంతో, స్వల్పారోగ్యతతో సంవత్సరం గడుస్తుంది. దశమరాశి యందు 'శని' యున్నంత కాలం కొంత బాధాకరమే ఏమయినా అప్పుడప్పుడు 'శుక్ర బుధగ్రహాల' సహాయం వలన, ఆరోగ్యానికి భంగం రాకుండ, వ్యాపారం సానుకూలం కావటంతో, స్వల్ప లాభదాయకమగుటతో, కళారంగాన స్వల్పాదాయాలతో, సుఖశాంతులతో సంవత్సరం గడిచిపోతుంది మిత్ర సమాగమంతో, కొంతలో కొంత మేలు. 'సుఖీభవ'.

-విద్వాన్‌కోటసత్యరంగయ్యశాస్త్రి

# హాకం,లల్లాదేవి కథా కథనం, అతిత్వరలో.....



(గత సంచిక తరువాయి)

అమూ డియర్!

మనిషికి భవిష్యత్తు తెలియదు కేవలం ఊహ నాకెందుకో భవిష్యత్తు పట్ల కొన్ని అభిప్రాయాలేర్పడిపోయాయి. ఖచ్చితమైన అభిప్రాయాలు వానిలో చాలా ముఖ్యమైంది నేను చాలా రోజులు బ్రతకనన్నది నా మరణం తర్వాతే ఈ ఉత్తరం నీకు చేరుతుంది కాబట్టి భవిష్యత్తు పట్ల నా అంచనా నిన్ను ఆశ్చర్యపరుస్తుంది చాలా ఆశ్చర్యపోతున్నావు కదూ?

నేను చాలా రోజులు ఎందుకు బ్రతకనూ అంటే, నా జీవిత విధానం, నే నెన్నుకున్న జీవన మార్గం అలాంటివి మరి తెలిసి ఎందుకెన్నుకున్నానూ అంటే మరణం గురించి తెలిసిపోయిన భయం కంటే ఈ మార్గంలో నాకు లభిస్తున్న తృప్తి ఎక్కువ కాబట్టి

నా మరణం గురించి నాకు తెలుసన్న దానికి సాక్ష్యంకాదు ఈ ఉత్తరం నీకు తెలుపవలసినవి, తెలియవలసినవి చాలా ఉన్నాయి ముఖ్యంగా నా మరణం తర్వాత

నా మరణానంతరం ఈ ఉత్తరం నీకందజేయవలసిందిగా లాయర్ రామచంద్రరావు గారిని కోరాను ఆయన తెల్లబోయారు "నా మరణం తర్వాత నీ ఉత్తరం నీకు చేరేలా మాత్రం తప్పక ఏర్పాటు చేస్తాను' అంటూ నవ్వారు అంటే అర్ధమయిందనుకుంటాను కానీ నాకు తెలుసు జరగబోయేదేమిటో అందుకే నమ్మకస్తులు, సహృదయులు, వృద్ధులు అయిన ఆయనకు ఈ బాధ్యత అప్పగించాను.

అమూల్యా, నిన్ను చూసిన క్షణం ఎలాంటిదో గానీ నీవంటే ఏమిటో తెలియకుండానే నీ మీద ఇష్టం ఏర్పడిపోయింది క్రమంగా నీలోని విలువలు గ్రహిస్తూ వచ్చాను నీవు మానవాతీతురాలివి కాదు దేవతవు కాదు నీలోనూ మనిషిలో వుండే అనేకమైన బలహీనతలున్నాయి బలహీనత లందరికీ వుంటాయి. అయితే తమలోని బలహీనతల గురించి సిగ్గుపడకుండా మీదు మిక్కిలి సమర్ధించుకునే వారు వేరు. బలహీనతలున్నా ఎప్పటికప్పుడు వాటిని అణగద్రొక్కడానికి ప్రయత్నించే వారు వేరు. నీవు రెండో రకానికి చెందినదానివి. పైగా ఎంతో మంచితనం, ఉదాత్తత, వ్యక్తిత్వం గల దానివి

నన్ను నీవు అసహ్యించుకోవడం నాకు తెలుసు ఈసడించడం నాకు తెలుసు చెడును అసహ్యించుకోవడం మంచితనమయితే ఆ చెడులోనూ ఓ ప్రక్కనున్న మంచిని గుర్తించి ప్రశంసించటం మరీ మంచితనం నీవు మరీ మంచిదానివి చెడును వేలెత్తి చూపడంతోపాటు దానిని క్షమించే ఔదార్యమూ నీలో వుంది అందుకే అమూల్యా, నీవు అమూల్యమైనావు నాకు దొరికిన అమూల్య వగానివైనావు

అమూ, నేను మరీ అనాధను కాను తల్లిదండ్రులు లేకపోయినా దగ్గరి బంధువులు వున్నారు కొన్నేళ్ల క్రితం నేను తిరుపతిలో బంధువుల ఇంట్లో వుండి చదువుకుంటూండే దాన్ని పక్కింటి మేడ గదిలో ఓ అందమైన అబ్బాయి అద్దెకుండేవాడు పేరు కృష్ణ ఆ అందం మామూలుది కాదు చూస్తే తప్ప వర్ణించి చెప్పలేనిది నా అదృష్టమో దురదృష్టమో మా ఇద్దరి మధ్య ప్రేమ అంకురించింది అతని ప్రేమలో నాకు సంపూర్ణమైన విశ్వాసం పెళ్ళి చేసుకోవాలని అనుకున్నాము కొద్ది రోజుల్లో అతని చదువు ముగియబోతోంది ఆ వెంటనే పెళ్ళి కలిసిన మనసులు, త్వరలో పెళ్ళి జరగబోతోందన్న నమ్మకం మా శరీరాలను దూరంగా ఉండనివ్వలేదు

కృష్ణ పరీక్షలు ముగిశాయి వాళ్ల వూరికి వెళ్ళి పెద్ద వాళ్ళను ఒప్పించి ముహూర్తం పెట్టించాలి ఆఖరి రోజు సాయంకాలం అలా వూరవతలికి షికారు వెళ్లాం కొన్ని రోజులు ఎడబాటు కలుగుతుందన్న బాధ మమ్మల్ని త్వరగా విడివడనివ్వలేదు చాలా ఆలస్యంగా చీకట్లో దారి వెదుక్కుంటూ వూళ్లోకి వస్తున్నాము

అతి భయంకరమైన అనుభవం. పాశవిక చేష్ట తలచుకుంటే ఇప్పటికీ గుండెలు జలదరిస్తాయి

మనుషుల రూపంలో వున్న నాలుగు పశువులు మా మీద దాడి చేశాయి

మూడు రోజుల తర్వాత హాస్పిటల్లో కళ్ళు తెరిచాను కృష్ణ ఏమయ్యాడో తెలీదు మా బంధువులెందుకు రాలేదో అర్ధం కాలేదు

తర్వాత సిస్టర్ చెప్పింది నన్ను నలుగురూ కలిసి చెరిచారు నేను గర్భవతిని కూడా నా దౌర్భాగ్య స్థితి తెలిసి మా బంధువులు నా నీడ చూడటానికి కూడా ఇష్టపడలేదు.

అయోమయమో, అచేతనావస్థో నాకు కన్నీళ్ళు కూడా రాలేదు. నా గుండె బండబారి పోయింది.

వారం తర్వాత డిశ్చార్జి చేశారు బంధువులు రానివ్వరు నేను వెళ్లాలనీ అనుకోలేదు ఈ మలిన పుష్పాన్ని కృష్ణ స్వీకరించడు సమర్పించాలనీ నేను అనుకోలేదు అయితే నా కడుపులో అతని తాలూకు వస్తువు జీవం పోసుకుంటోంది దాని గురించి కృష్ణకు చెప్పవలసిన బాధ్యత, దాన్నేం చేయాలో తెలుసుకోవలసిన బాధ్యత నా మీద వుంది అయితే అతని గురించి ఎవరూ ఏమీ చెప్పలేదు అతను అద్దెకున్న ఇల్లు గలవాళ్ళు నా ముఖం మీదే తలుపులు మూశారు

తప్పు విషయంలో బాధ్యత లేని అమాయకురాలైన ఆడదాన్ని ఇంత నిర్దయగా శిక్షించే ఈ దేశం పట్ల, జాతి పట్ల ద్వేషం కలిగింది. అబల అయిన ఆడదాన్ని క్షణిక సుఖం కోసం బల ప్రయోగం ద్వారా ఎందుకూ పనికి రాకుండా నలిపి నాశనం చేసే మగజాతి పట్ల పగ రేగింది మనసు, శరీరం పంచుకున్న వాడి కళ్లెదుటే నలుగురి చేత నాశనం చేయబడ్డ నేను ఇక బాగుపడేదేముంది? ఆడతనం అన్న ఆయుధం చేపట్టి మగజాతి మీద విరుచుకుపడ్డాను అయితే సుచరిత పుట్టిన తర్వాతే

మనసు దోచుకున్న వాడివల్ల పవిత్రంగా నా కడుపున చోటు వెదుక్కున్న చిన్నారి పాపను మలినం చేయదలచలేదు. మరి పాప కడుపున ఉండగానే కదా నలుగురు అనుభవించారూ అంటే దానికి నా బాధ్యతేమీ లేదు.

వ్యభిచారం తప్ప చేయరాని పనులన్నీ చేసి ఆరు నెలలు నెట్టుకు వచ్చాను

పాప పుట్టింది పాప అచ్చం అతని పోలికే నల్లని మట్టి ప్రమిదలాంటి నాలోంచి ప్రకాశవంతమైన జ్యోతిలా వుద్భవించింది పాప

పవిత్రమైన తల్లిదండ్రులకే పుట్టి, పవిత్రంగా పెరిగి, ఒకరికే పవిత్రంగా మనసర్పించి, అతని ద్వారానే తల్లినయిన నేను నా బాధ్యత లేకపోయినా మగవారి స్వార్ధానికి బలై, పతితనై

**జరిగిన కథ- 15: అమూల్య, పెళ్ళి కాకుండానే తల్లి అయిన మైనా శృతి యింట్లో అద్దెకుంటుంటారు. శృతి యింటికి వచ్చి వెళ్తుండే తెలుగు లెక్చరర్ ప్రసాదరావుపై మరులుగొంటుంది అమూల్య. మైనాను ఎవరో హత్య చేశారని పోలీసుల ద్వారా సమాచారం అందుతుంది. పాతికవేల రూపాయలు అమూల్యకు చెందాలంటూ మైనా వ్రాసిన సీల్డు కవరు లేఖను లాయరొకరు అమూల్యకు యిచ్చి వెళ్తారు.**

చరిత్రహీనన‌య్యాను. నా పాప అలా కాకూడదు నా పాపకు చరిత్ర వుండాలి. మంచి చరిత్ర వుండాలి. అందుకే 'సుచరిత' అన్నాను.

పెద్దగా చదువు లేక, చిన్నదైనా ఉద్యోగం లేక, ఆదరించే అయినవాళ్ళు లేక ఆడది జీవించటం ఎంత కష్టమో ఆ ఆరునెలల్లో అర్థమైంది నా భవిష్యత్తు ఎప్పుడో నిర్ణయమైపోయింది అయితే నా నల్లని నీడ నా పాప మీద పడకూడదు నా భవిష్యత్తు కేవలం నా భవిష్యత్తే అది నా పాప భవిష్యత్తు కాదు. కాకూడదు

పాపను అనాథ శరణాలయంలో వదిలాను నేను తల్లినని చెప్పలేదు. నాలాంటి తల్లికి కూతురుగా ముద్రపడకూడదు నా పాప మీద

పాపను వదిలించుకుని, ఈ మగజాతి మీద ఆకలిగొన్న కుక్కలా కసిగా పడ్డాను పీల్చి పిప్పి చేశాను. అందినంత దోచుకున్నాను.' తిన్నంత తిన్నాను అనుభవించినంత అనుభవించాను మిగిలినది బ్యాంకులో వేస్తూ వచ్చాను

ఇంత చేసినా నాలోనూ నీతి నియమాలు ఇంకా వూపిరి తీసుకుంటూనే వున్నాయి మాస్టారి చూపుల పూలు నిన్నభిషేకిస్తున్నాయని నాకు మొదట్లోనే తెలుసు అది కాదు ముఖ్యం. నీ ఆరాధన వెల్లువగా మాస్టారిని ముంచి వేస్తోందని తెలుసు అందుకే మాస్టారు, శృతి భర్త చిరంజీవి, తండ్రిలాంటి లాయర్ రామచంద్రరావుగారిలాంటి వాళ్ళకు దూరంగా వున్నాను

నా బ్రతుకుతెరువు నేను చూసుకున్నా, చదువు మీది అభిలాషతో, ఆకర్షణతో, ముఖ్యంగా నా పగకు, ద్వేషానికి, బ్రతుకుతెరువుకు చక్కని ఆకర్షణగా వుంటుందని కాలేజీలో చేరినా, పగ తీర్చుకుంటున్నా ఓ వైపు పాప గురించిన ఆలోచన, ఆరాటం నన్ను తినివేసేది. పాపనేం చేయాలి? పాప భవిష్యత్తేమిటి? ఎప్పుడూ ఇదే . ఇదే.

నీతో పరిచయమయ్యాక, నీవంటే ఏమిటో తెలిశాక, నా పాపను నీకు చూయించాలనిపించింది కేవలం నా పాప కోసమే నీ స్నేహాన్నభిలషించానని అపోహ పడకు అదేం కాదు ముందుగా నీ ఔన్నత్యమే గ్రహించక పోయి వుంటే నా పాప ప్రసక్తి తెచ్చేదాన్ని కాదుగా' నమ్ముతావు కదూ?

పాప ఎవరో తెలిసినా నీవు పాపను అసహ్యించుకోలేదు. అంటే నా పాపంలో పాపకు భాగం లేదని నీవు గ్రహించావన్నమాట ఈ విషయం నాకెంతో సంతోషాన్ని కలిగించింది

శెలవులకు వూరికి వెళ్ళే ముందు నీయంతకు నీవే పాపను చూద్దామన్నావు చాలా రోజుల తర్వాత అన్నీ మరచిపోయి ఆనందించిన క్షణాలవి!

అక్కడ జ్వరంతో వున్న పాపను చూసి కంపించి పోయాను నా పాపానికి నా పాప అనుభవిస్తున్న దౌర్భాగ్యాన్ని చూసి పిచ్చెత్తినట్లుగా 'అయ్యాను అయితే అమూల్యా! పాప ఎడల నీవు చూపిన ప్రేమ, దయ, కరుణ, సమయస్ఫూర్తి నన్ను పూర్తిగా పిచ్చిదాన్ని కాకుండా కాపాడాయి ఆనందంతో మాత్రం పిచ్చిదాన్ని అయ్యాను

అప్పుడనిపించింది అమూల్య అనే చల్లని పూల పందిరి నీడలో నా పాప తప్పక సేద దీరగలదని

పాప ఖర్చులకు నీ చేత డబ్బు ఇప్పించటం నీకు



# భలే కవలలు!



## టూరిస్ట్ ఎట్రాక్షన్

ఆస్ట్రేలియాలో ఉన్న 'గ్లాన్ విల్లా' కోటను ప్రతి సంవత్సరం అనేక వేల మంది యాత్రీకులు సందర్శిస్తుంటారు. ఇలా ప్రపంచ వ్యాప్తంగా ఈ కోటను సందర్శించడానికి వచ్చే యాత్రీకులను ఆనందింప జేయడానికి ఆ కోటలోపల ఫిరంగులను సాంప్రదాయ దుస్తులు ధరించిన సైనికులు పేల్చి చూపుతారట. ఈ రకమైన ప్రదర్శనవల్ల 'గ్లాన్‌విల్లా'కు సందర్శకుల తాకిడి ఎక్కువ అయిందిట.



## మినీ సబ్‌మెరీన్

వెస్ట్ జర్మనీలో నివసిస్తున్న ఎర్నెస్ట్ బడ్‌గర్ట్ అనే ఆసామి అచ్చం "ఎగిరే పళ్ళెం" ఆకారంలో ఉన్న మినీ సబ్‌మెరీన్ తయారు చేశాడు. పెట్రోలుతో గానీ, బ్యాటరీలతో గాని నడిచే ఈ సబ్‌మెరీన్ సముద్ర గర్భాల్లో పరిశోధనలు చేసే శాస్త్రజ్ఞులకు ఎంతో ఉపయోగ పడుతుందిట. అంతేకాక ఇది చిన్న చిన్న చక్రాలతో మామూలు రోడ్ల మీద కూడా జోరుగా పరుగెడుతుందిట. —పి. వి. యల్.

## అన్వేషి

గుర్తు వుండే వుంటుంది ఆ విషయం నీకు ఇప్పటికీ అర్థం కాని పజిల్‌లా వుండే వుంటుంది నా పగ దృష్ట్యా, నా ద్వేషం దృష్ట్యా నేను మగాళ్ల నుండి రెండు చేతులా దోచుకున్నా ఆ పాపపు సొమ్ము నీడ కూడా పాప మీద పడనివ్వలేదు అసలా వుద్దేశ్యంతోనే పాపను అనాథ శరణాలయంలో వదలవలసి వచ్చింది లేకపోతే పాపను నేను ఆయాను పెట్టి నా దగ్గరే పోషించుకోలేనా?

పాపకు బిస్కెట్లు లాంటివి తీసికెళ్ళడానికి నీలాంటి ఎవరి దగ్గరైనా భిక్షమెత్తేదాన్ని ఆ డబ్బు తిరిగి ఇచ్చేదాన్ని కాదు. ఇస్తే పాపకు మళ్ళీ నా డబ్బే పెట్టినట్లవుతుంది కదా!

అమూల్యా, నీకు చెప్పవలసిన అవసరం లేదు నాకు తెలుసు. అయినా మళ్ళీ చెబుతున్నాను పాప, నా పాప ఏ పాపమూ ఎరగనిది. తండ్రి ఎవరో తెలియకుండా పుట్టిన అనామకురాలు కాదు, అపవిత్రురాలు కాదు రెండు మనసుల పవిత్ర సంగమంలో వూపిరి పోసుకున్న పారిజాతం పాప నీ నీడలో దానికింత చోటివ్వు నీవు అవివాహితురాలివి దాన్ని ఇప్పుడే నీ దగ్గరకు చేర్చుకొనే వీలు వుండదు నాకు తెలుసు కానీ సుచరితను నీవు నీ మనిషి అనుకుంటే చాలు లోకం ఆ పాప నీ తాలూకు అనుకుంటే చాలు నీకు వివాహమై, నీ భర్త సహృదయుడైతే పాపను నీ సంరక్షణలోకి తీసుకునే ప్రయత్నం చెయ్యి అతను దురపోహలు పడకుండా కావాలంటే నా ఈ ఉత్తరం చూయించు

'ఈ బాధ్యత నాకే ఎందుకు అప్పగించాలి? వివాహితురాలూ, పిల్లల పోషణ తెలిసినదీ, ప్రేమికుడైన భర్త వున్నదీ శృతి వుంది కదా?' అని నీవనవచ్చు

శృతి హృదయం నాకు తెలుసు కానీ తప్పుల్ని క్షమించే ఉదారత్వం తనకు లేదు శిక్షే నేరాన్ని, ఆ నేరం తాలూకు పాపాన్ని క్షాళనం చేస్తుందని నమ్మే మనిషి నా పాప ఏ నేరమూ చేయలేదు. కానీ శృతి ఈ విషయం ఒప్పుకుంటుందా? 'తెలిసి చేసినా తెలియక చేసినా నేరం నేరమే అక్రమంగా పుట్టిన నేరానికి సుచరిత శిక్ష అనుభవించి తీరాల్సిందే' అనుకుని నా పాపను ఘోరంగా శిక్షిస్తుందేమోనని నా అనుమానం, భయం అందుకే పాపనెప్పుడూ శృతికి చూయించలేదు పాప బాధ్యతను శృతి కప్పగించాలనీ అనుకోలేదు

నా అమూల్యా, చివరగా ఒక విన్నపం ప్రార్థనే అనుకో నేను నా అవసరాలు పోను కొంత డబ్బు బ్యాంకులో వేస్తున్నాను నేను మరణించేనాటికి అది ఎంతైనా కావచ్చు అదెంతయినా నీకు సంక్రమించే ఏర్పాటు చేస్తున్నాను దాన్ని నీవు ఏ విధంగానైనా ఉపయోగించు. నీ ఇష్టం. కాదని మాత్రం అనకు. అన్నా ఏమీ లాభముండదు ఎందుకంటే నేనుండను కాబట్టి నీకే చెందుతుంది. నా మీద అక్కసుతో ఏట్లోకి విసిరేసినా సరే అది నీ ఇష్టమే అవుతుంది

అమూ, నేను ఏ విధంగా ఎప్పుడు మరణించినా అది సహజంగా వుండబోదని నా నమ్మకం నా కోసం నా వాళ్ళంటూ ఎవరూ రారు కూడా నా వస్తువులు, బట్టలు, నగలు అన్నీ నీ చిత్తం వచ్చినట్లు చెయ్యి కానీ వాటి నీడ కూడా పాప మీద మాత్రం పడనివ్వకు పాప నీ తాలూకు గంజి నీళ్ళతో బ్రతికినా నా ఆత్మ శాంతిస్తుంది

అమూ డియర్, జన్మ జన్మలకూ నీలాంటి స్నేహితురాలు లభించాలని దైవాన్ని ప్రార్థిస్తూ ముగిస్తున్నాను

నీ

మైనా

నా చేతులు వణికిపోతున్నాయి. భూకంపానికి ముందు భూమి పొందే ప్రకంపనల్లా నా గుండె తీవ్రమైన ఒత్తిడికి గురి అయింది నా గుండెల్లో కొలిమి మంటల్లాంటివి నాలుకలు సాచసాగాయి నాకు హఠాత్తుగా దుఃఖం ముంచుకు వచ్చింది! మైనా మరణం తర్వాత గుండెల్లో గూడు కట్టుకున్న బాధ అంతా కళ్ళలోకి ఒక్కసారిగా తోసుకు వచ్చింది కర్కశంగా ఘనీభవించి రాయిలా గుండెల్లోకి దిగిపోయిన కన్నీళ్ళు కరిగి వెల్లువలా వుబికి వచ్చాయి.

చేతుల్లో ముఖం దాచుకుని ఒక్కసారిగా భోరుమన్నాను

(ఇంకా ఉంది)

## 'యువశక్తిని మేలుకొల్పాలి'!

-డా సుబ్బరామిరెడ్డి

కళాసామ్రాట్ డాక్టర్ టి సుబ్బరామిరెడ్డి లాంటి వ్యక్తి రాజకీయరంగంలో ప్రవేశించడం గురించి భిన్నాభిప్రాయాలున్నాయి-

కీర్తి, ధనము అన్నింటినీ మించిన ధర్మ గుణము గల శ్రీ సుబ్బరామిరెడ్డిలాంటి వారు రాజకీయాలలోకి వచ్చినందు వల్ల వారి ఇమేజ్ దెబ్బతింటుంది! రాజకీయపరంగా, వారిపై నిందారోపణలు రావడం లేనిపోనివి కల్పించడం జరుగుతుందని ప్రశాంతంగా వున్న వ్యక్తిని ఈ రాజకీయాల రొచ్చులోకి ఎందుకు లాగాలి అంటున్నారు కొందరు

కానీ- దాదాపు 150 యువసంఘాలు గల సుబ్బరామిరెడ్డి అభిమానులు, శ్రేయోభిలాషులు వారు రాజకీయ రంగంలోకి రావాలనే అంటున్నారు

ఇటీవల- విశాఖలో ఆయన పలువురి పెద్దలతో మాట్లాడుతూ-

'రాజకీయరంగంలోకి వస్తాను! కేవలం పదవి కోసం కాదు! అధికారంలో వుండి ప్రజలకు మరింత సేవ చెయ్యడానికే'. అన్నారు

'సద్విమర్శలకు నేను భయపడ్డాను కానీ నిందారోపణలను లెక్క చెయ్యను! సద్విమర్శ స్వీకరిస్తాను! నా లోపాలను దిద్దుకొంటాను! కాని భయపడి.. రాజకీయరంగంలో ప్రవేశించడానికి వెనుకాడను" నేను దానధర్మాలు చేసినా విమర్శించేవారు అక్కడక్కడా వున్నారు అంచేత.. దానధర్మాలు సత్కార్యాలు మానుకోడం అవివేకం. " అన్నారు

దేశం నలుమూలలా తన పేరుతో 150 కళా సంఘాలు సేవా సంఘాలు ఏర్పడి, తన ధన సహాయం లేకుండా వారికి వారుగా కళాసేవ, ప్రజాసేవా కార్యక్రమాలు చేస్తున్నాయని చెపుతూ- ఒక పారిశ్రామికవేత్తగా తన పేర ఇన్ని సంఘాలు వుండడం అదృష్టం అన్నారు శ్రీ సుబ్బరామిరెడ్డి

'యువతరాన్ని చాలామంది తప్పు దారిలో వాడుకొంటున్నారు అలాగాక యువతరంలో చైతన్యం తీసుకువచ్చి వారిలో గల నిరాశా నిస్పృహలను పోగొట్టి వారి సేవా కార్యక్రమాలతో ఈ దేశంలో ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు జరపవచ్చుని యువశక్తిని తక్కువ అంచనా వేస్తున్న పెద్దలు మారాలని అంటాను నేను!' అన్నారు శ్రీ సుబ్బరామిరెడ్డి

'ఈ జీవితం ప్రజా సేవకి... ఆధ్యాత్మిక సేవకి అంకితం చేస్తాను! నాకంటే గొప్పవారు దనవంతులు వున్నారు! ధర్మ కార్యాలు చెయ్యాలనే ఉత్సాహం వారందరికీ కలిగేలా, వారిని చైతన్యవంతుల్ని చెయ్యాలన్నదే నా కోరిక! అందుకే. ఈ పబ్లిసిటీ! ఈ పబ్లిసిటీ చూసి దనవంతులు ముందుకొచ్చి. ధర్మ కార్యాలు చేసి నన్ను జనం మర్చిపోయేలా చెయ్యాలన్నదే నా తపన!" అంటూ ఆవేశంగా చెప్పారు శ్రీ సుబ్బరామిరెడ్డి- (-గణపతి)



# పుస్తకాల పేజీ

### ★ శ్రీరామ కల్యాణం :

రచయిత పరిటి సూర్య సుబ్రహ్మణ్యం, పుటలు 49, వెల 8 రూపాయలు, ప్రతులకు పరిటి సూర్య సుబ్రహ్మణ్యం, "శ్రీ శారదాపీఠం", 25-11-5, అయ్యకోనేరు తూర్పుగట్టు, విజయనగరం-2 (ఆం ప్ర)

### ★ జక్కులదేవి

రచన. విద్వాన్ తాతినేని లక్ష్మయ్యచౌదరి, పుటలు 164, వెల పదిహేను రూపాయలు, ప్రతులకు విశ్వశాంతి పబ్లికేషన్స్ కలవపాముల- 521164, కృష్ణాజిల్లా 10వ శతాబ్దాంతమునందుండిన నూర్మడి తైలపచక్రవర్తికి సంబంధించినదీ కథ

### ★ పాలేరు (సాంఘిక నాటకం)

రచన బోయి భీమన్న, పుటలు 103, వెల ఇరువది ఒక్క రూపాయి, ప్రతులకు ఐ సి 85, ఐ ఎం కాలనీ, హైదరాబాద్-500482

### ★ కానుక (స్వేచ్ఛా కవితల కూడిక)

రచయితలు దేవరకొండ సుబ్రహ్మణ్యశాస్త్రి, కుమారి డి వి ఎస్ సుబ్బలక్ష్మి, పుటలు 40, వెల నాలుగు రూపాయలు, ప్రతులకు శ్రీ కళా భారతి, బొబ్బిలి-532558 లేదా డి వి ఎస్ సీతా రామస్వామి, కేరాఫ్ శ్రీ డి ఎస్ శాస్త్రి సబ్ జడ్జి, అనకాపల్లి-531001

### ★ సత్యవతి కథలు

రచన పి సత్యవతి, పుటలు. 176, వెల. పదిహేను రూపాయలు, ప్రతులకు అరుణ పబ్లిషింగ్ హౌస్, ఏలూరురోడ్, విజయవాడ-2 మధ్యతరగతికి చెందిన వారి హిపాక్రసీ మీద దెబ్బ తీసిన కథ 'గ్లాసు పగిలింది', రెండు తరాలకు చెందిన మహిళల దుస్థితిని కళ్ళకు కట్టినట్టు చూపించిన కథ 'మాఘసూర్యు[illegible]', నేటి పిల్లల తల్లులకు గొప్ప గుణపాఠం 'పునాది' కథ

### ★ కాంతి స్వప్న : (కావ్య ఖండిక)

రచయిత. డా. జి వి పూర్ణచందు, పుటలు. 72, వెల ఎనిమిది రూపాయలు, ప్రతులకు స్పందన సాహితీ సమాఖ్య, రామానాయుడుపేట, మచిలీపట్నం లేదా డా జి. వి పూర్ణచందు, శుశ్రుతా క్లినిక్, విద్యాధరపురం, విజయవాడకి వ్రాయవచ్చును.

### ★ భవబంధాలు మోక్షానికి ప్రతి బంధకాలా?

కూర్పు. నసీమ్‌గాజి, అనువాదం ఇక్బాల్ అహ్మద్, పుటలు 27, వెల. రెండు రూపాయలు, ప్రతులకు తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ్ కోట్, ఛత్తాబజార్, హైదరాబాద్- 500002

### ★ విశ్వదాత గౌతమ బుద్ధ

రచయిత · శ్రీ మధ్వాచార్య రఘునాథ చక్రవర్తి, పుటలు 35, వెల పది రూపాయలు, ప్రతులకు · చక్రవర్తి ప్రచురణలు, సి-132, హెచ్ ఎ. ఎల్ కాలనీ, హైదరాబాద్-500042 లేదా శ్రీమతి చక్రవర్తి జయలక్ష్మి, ఫ్లాట్ నెం. 104, లలితా నగర్ హైదరాబాద్-500044.

### ★ గోపీనాథుని వెంకయ్యశాస్త్రి సాహిత్య పరిచయం

రచయిత · కాళిదాసు పురుషోత్తం, పుటలు 122, వెల. పది రూపాయిలు, ప్రతులకు. శ్రీమతి కె సత్యవతి, 16/1179, కస్తూరిదేవి నగర్ నెల్లూరు-524001 (ఆం|ప్ర.). నూరేళ్ళ క్రితం జీవించివున్న నెల్లూరి కవి శ్రీ వెంకయ్యశాస్త్రి జీవితం గురించి, జీవిత సాహిత్యాల గురించి రచయిత ఈ పుస్తకంలో తెలియజేశారు ●

సాహితీ పజిల్

గెల్చుకొండి రు.200/-

# గళ్ళ నుడి కట్టు – 8

## ఆధారాలు

**నిలువు**

1 ఏనుగుకు తుమ్మెదకూ ఒకటే మాట
2 ఇదే ముక్కుకు అందం
3 సరసములో దండ
4 మనసులో పుట్టినవాడికి శరీరంలేదు
6 ఇది క్రుంగటం కర్ణుని మరణానికి ఒక కారణం
8 వీడిని చంపనివాడు ఏం వీరుడు
9 వ్యర్థుడు
12 ఇతడు పండితోత్తముడు
13 చూడు
15 విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు ఉపదేశించిన విద్య ఎక్కువ బలం కలది
16 అన్ని చక్రాలు దీనిమీద తిరగాల్సిందే
17 బాణం క్రిందనించి

**అడ్డము**

1 ఇలాంటిదే సంసారం
3 పారిజాతం తెప్పించింది భామ
5 చతురంగ బలాలల్లో తురంగంతో ఉండేది
7 ముఖానికి శత్రువు కాదు రాగం
9 ఇది వుంటే శంఖం ఊదవద్దు
10 దీన్నిచూచి నక్క వాత పెట్టుకుంటే సామెత
11 ఇది పెద్ద కుండ
12 రాముడు అధివసించిన కొండవీడు
14 అటునుండి పెరటిలో ఒకేసారి కాచేది
16 అగ్ని దీనితో స్నేహం చేసి సమ్మెట దెబ్బలు తింటుంది.
18 ఈయన లేకపోతే కృష్ణరాయలు లేడు
19 పక్షులు పెంచిన సుందరి

ఆధారాలున్నాయి. నుడి కట్టు గళ్ళు నింపండి! కూపన్ కత్తిరించిమీ చిరునామా రాసి పంపండి! ఆల్ కరెక్టు సొల్యూషన్ పంపిన వారికి రు. 200/-లు బహుమతి లభిస్తుంది–ఒకరి కన్నాఎక్కువమంది కరెక్టు ఆన్సర్‌లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది. తుది నిర్ణయం సంపాదకునిదే !
–సం

గడువు : 18-4-1989



**ఆంధ్రసచిత్రవారపత్రిక**

పంపిన వారిపేరు : ..............................

పూర్తి చిరునామా : ..............................

..............................

.............................. పిన్‌కోడ్.. ..........

సాహితీ పజిల్

# గళ్ళ నుడి కట్టు – 6

## బహుమతులు



వందలాది పాఠకులు అమితోత్సాహంతో ఈ పోటీలో పాల్గొన్నారు. అందరికీ అభివందనాలు. సరియైన జవాబులు ఐదుగురు మాత్రం పంపగలిగారు బహుమతి మొత్తం రు. 200/–లను ఈ ఐదుగురికి సమానంగా పంచగా ఒక్కొక్కరికి రు 40/– లు వచ్చాయి. త్వరలో ఈ బహుమతులు నగదు రూపంలో పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి ఒకరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చును. తెల్లకాగితం మీద రాయకూడదు.

### సరియైన జవాబులు పంపిన వారి పేర్లు

కె వి ఉషా కల్యాణి (ఏలూరు), అ రామారావు (ఉయ్యూరు), ఎస్ జ్ఞానేశ్వరి (ఖమ్మం), వి పార్వతి (హైదరాబాద్), జి ఎల్ ప్రసన్న (నరసరావుపేట)

## సరియైన జవాబులు

| నిలువు | అడ్డం |
|---|---|
| 1 కిరీటి | 1 కిన్నెర |
| 2 రవము | 3 కౌముది |
| 3 కౌగిలి | 5 కిటి |
| 4 దివము | 6 ముసలి |
| 5 కిసలయము | 8 ముర |
| 7 సభ | 10 లకుముకి |
| 9 రవి వంశము | 11 పరాభవం |
| 12 గద | 13 ముఖం |
| 14 ఖంగున | 15 మోదకం |
| 15 మోక్షము | 17 పాము |
| 16 కందుకం | 18 నఖము |
| 17 పానకం | 19 కందకం |



# వీక్లీ పోస్ట్



## సినిమా కావాలి

ఆంధ్రపత్రికలో గత కొద్ది కాలంగా వచ్చిన మార్పులు ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నాయి కాని 3/10 మార్చి 89 పత్రికలో "సినిమా ఎందుకు?" సినిమా వార్తలు ప్రతి దిన వారపత్రికలో ప్రచురిత మవుతున్నాయి కాబట్టి ఆ శీర్షికను తీసివేసి పాఠకులకు ఉపయుక్తమైన శీర్షికలు ప్రవేశపెట్ట మని అనకాపల్లి నుండి కృష్ణమోహన్‌గారు రాసారు ఉపయుక్తమైన శీర్షికలు కావాలి అని కోరడము మంచిదేగాని అందుకు "సినిమా శీర్షిక" తీసేయ మనడము బాగాలేదు

సినిమా శీర్షికను అలాగే కొనసాగిస్తూ, సీరియల్స్ కథలలో వేసే బొమ్మలలో శ్రద్ధ తీసుకోవాలని, మీ (మా) పత్రికను సకాలములో మాకు అందించగలరని పత్రిక సంపాదకులకు మనవి.

ఎస్ కరిముల్లా, కొవైట్ (అరేబియన్ గల్ఫ్)



(శ్రీ కరిముల్లా అంత దూరం నుంచి యీ ఉత్తరంతో పాటు ఒక పేపర్ క్లిప్పింగ్ పంపించారు. దాన్నిక్కడ వేస్తున్నాము. సం.)

## సీరియల్

17-23 మార్చి 89 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో కె. గోదావరిశర్మగారి వైవిధ్యకరమైన ఇతివృత్తం గల ఈ అబ్బాయికి పెళ్లవుతుందా? సీరియల్ హాస్య సందర్భంతో కూడుకొని ఉంది. నవ రసాల్ని రంగరించి ఉన్నా ఈ వెరైటీ సీరియల్ టైటిల్ గమ్మత్తుగా ఉందికదా' ఈ రోజులలో అమ్మాయిల పెళ్లవుతుందా? అనుకొనే వారికి ఈ సీరియల్ చదువుతే టానిక్కులా పని చేస్తుంది అని మాకు అన్పించింది ఈ సీరియల్ చదువుతుంటే విభిన్న సీరియల్స్ అందిస్తున్న మీకు అభినందనలతో

–కుమారి పెయ్యేటి చండీప్రియ, కుమారి పెయ్యేటి చాముండేశ్వరి, శ్రీకాకుళం

## భలే ఫ్రెండు

మా ఫ్రెండొకడు అంటూండేవాడు 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక'లో ఏ ప్రత్యేకతా ఉండదని, పాఠకులకి స్థానం తక్కువని ఈమధ్యే అనుకోకుండా ఆంధ్ర సచిత్ర వార పత్రిక చూసి ఆశ్చర్యపోయాను పాఠకులకి ప్రోత్సాహన్నిచ్చే ఎన్నో ఫీచర్స్‌తో పాటు, మంచి సీరియల్స్, కథలతో అద్భుతంగా ఉంది పత్రిక. వెంటనే వెళ్లి నా ఫ్రెండ్‌కి చూపించాను ఈసారి ఆశ్చర్యపోవడం వాడి వంతు అయింది పత్రికలో మార్పు చూసి వాడెంతో ఆనందించాడు.

–మైసా నరసింహారావు (కొత్తగూడెం)

## తా. కా.

24-30 మార్చి సంచికలో 'తాజా కాలమ్' మన రాజకీయాల తీరుతెన్నులు, అవి ఎంతగా దిగజారిపోతున్నాయో దర్పణం పడుతోంది. 'ఇదేం ప్రజాస్వామ్యం' క్రింద శ్రీ వీరాజీగారి విశ్లేషణ రాజకీయ పరిశీలకుల అభిప్రాయాలను చక్కగా వివరించింది. 'ఇదేం ప్రజాస్వామ్యం' అంటూ మన మడగవలసిన ప్రశ్న రామారావుగారు అడగడం అప్పుకోసం వెళ్లామని తెలిసి ఎదుటాయన మనల్నే అప్పు అడిగిన రీతిగా ఉంది ఒకేపడవలో ప్రయాణం చేస్తూ, ఎవరికి వారు చిల్లులు వేస్తే నష్టపోయేది వాళ్ళేనని ఎప్పుడు గుర్తిస్తారో' రాజకీయ దిగజారుడు తనానికిది నిదర్శనం

–యు యు యు (ఎమ్మిగనూరు)

## గురక

ఆంధ్ర సచిత్ర వారపత్రిక (24-30 మార్చి '89) సంచిక మొత్తం చదివిన తరువాత ఈ లేఖ వ్రాయాలనిపించి వ్రాస్తున్నాను. చక్కటి విలువలున్న కథలు, సీరియల్స్ ప్రచురించటం సంపాదకుని ఉత్తమాభిరుచికి నిదర్శనం

సంచిక మధ్య పేజీలలో వేసిన "పందిబాబు" వ్యాసం, ఫోటోలు మా ఇంటిల్లిపాదిని ఆశ్చర్యంతో ముంచెత్తింది

– నందం శ్రీలత, సుధారాణి (భట్టిప్రోలు)

## సెలయేరు

ఇన్నాళ్ళు నిశ్చలంగానున్న సరస్సు ఇప్పుడు సెలయేరులా గలగలా పారుతున్నట్లుగా ఉంది ఇప్పటి పరిస్థితుల కనుగుణంగా ప్రవేశపెట్టిన కొత్త శీర్షికలు చాలా ఉత్తేజకరంగా వుండి యువతను ఉత్సాహ పరుస్తున్నాయి కాని ఈ మార్పులు చూసి కొంత మంది తాతయ్యలు అసంతృప్తి వ్యక్తం చేయడమే బాధగా వుంది నిజానికి వాళ్ళు బాధపడవలసిన పనిలేదు ఎందుకంటే పత్రికలో ఎంత మార్పు వచ్చినప్పటికి కథల్లో గాని, సీరియల్స్‌లోగాని ఎక్కడా సరాలు వేడెక్కించే అశ్లీల పదాలు లేకపోవటం గమనార్హం'

– తుల్లి రాజగోపాల్ (రాజమండ్రి)

## సీరియల్స్

వి. వి. శాంభవిగారి సూపర్‌గర్ల్ సీరియల్ కెంతో నచ్చింది

–ఏ విజయసారథి



"నీ కాళ్లమీద పడుతున్నాననుకొకో! బయట ఒకరి కాళ్లమీద పడాలి అందుకె ప్రాక్టీస్ చేస్తున్నానంతే!

## దస్తూరీ

ఉత్తరాల రచయితలను చిరునామా కూడ తెలుగులో రాయాలనే రూల్ పెట్టి పత్రిక స్టైలుగా నా తెలుగు రయిటింగ్ ఇంప్రువ్ అయ్యేలా చేసింది.

–బి. కుమారస్వామి (వరంగల్)

Printed and Published for Nageswararao Estates Ltd; by S Nageswararao at the Andhra Patrika Press, Gandhinagar, vijayawada-3, Chief Editor : S. Radhakrishna, Advisory Editor : Veeraji, Editor M Madhavarao, Phones Bussiness 61247, 61248, 75569 and Editorial 75667